# ముళ్ళ గులాబి

రచన:
కె. చిరంజీవి

ప్రచురణ:
నవీన గ్రంథమాల, విజయవాడ-2.

5

# ముళ్ళ గులాబి

నేను చనిపోతున్నాను, ఇంకెంతో కాలం నేను జీవించలేను. ఈ తనువు చాలించేముందు ఏమేమో చెప్పాలనీ, చాలా చాలా చెప్పాలనీ వుంది. కాని ఎలా చెప్పాలో తెలియటంలేదు.... నా చావుకు బాధ్యులెవరూ కారు. నా కర్మానికి నేనే చనిపోతున్నాను. కాలం నన్ను తనలో కలుపుకుంటున్నది.

కాని.... మరో వైపునుంచి ఆలోచిస్తే ఇది నిజమా? నా చావుకు కారకులెవరూ లేరా? నా అంతట నేనే చనిపోతున్నానా? ఏమో? నేనేమీ చెప్పలేను.

* * *

ఏ ముహూర్తాన పుట్టానోగాని, నే నీ భూమిమీదపడ్డ క్షణానే మా అమ్మ కనుమూసింది. పుణ్యాత్మురాలు గనుకనే పోయిందంటుండేవారు, మా అమ్మమ్మా తాతయ్యాను. నను గన్న తండ్రి, నా యీ ముప్పైయేండ్ల జీవితంలోనూ రెండే రెండు పర్యాయాలు నాకండ్ల బడ్డాడు. వా డెలా తటస్థించాడో నేను వివరించలేను. తండ్రిని పట్టుకుని 'వాడు' అంటున్నానని మీకు కోపము రావచ్చు. వాడికథ వింటే తప్పక నన్ను క్షమిస్తారు.... వాడు, మా అమ్మను పెళ్ళిచేసుకోకుండానే నన్ను కన్నాడు. నే నొకదాన్ని తనకు పుట్టిన బిడ్డను ఉన్నానన్న విషయమే కొన్నాళ్ళవరకు వాడికి తెలియదు.... మా అమ్మ పోయింది. అమ్మమ్మ నన్ను పెంచింది. మా తాతయ్య ఏదో బెంచికోర్టులో బంట్రోతు. నెలకో పాతిక రూపాయలు సంపాదించుకొచ్చి ఆ ముసలిముండ కిచ్చేవాడు. మా అమ్మమ్మ నిజంగా దేవత. ఎంత తప్పిదాన్నయినా ఒక్క కన్నీటిబొట్టుతో క్షమించేది. ఎప్పుడూ ఏదో పనిచేస్తూనే వుండేది. కొన్నాళ్ళు వేరుశనక్కాయ లమ్మేది. కొన్నాళ్ళు కూరగాయలు గంప

కెత్తుకుని, తిరిగి అమ్ముతుండేది. అప్పుడప్పుడు సూలకమంచా లల్లి అణా బేడా పైసంపాదన తెస్తుండేది. మా తాతయ్యా కూడా బహు నెమ్మదైనవాడు. కాని లోకానికెంత అణగి మణగి వుండేవాడో, మా అమ్మమ్మపై అంతెత్తున లేచేవాడు ఒక్కోసారి.

నాకు బాగా జ్ఞాపకం. చిన్నదాన్నయినా ఆ సంఘటన నా కిప్పటికీ గుర్తున్నది. తాతయ్యా ఆవేళ ఎందుకంత మండిపడ్డాడో, అవసానదశలో గాని నేను తెలుసుకోలేక పోయాను.... జరిగిందేమంటే తాతయ్యకు తెలియకుండా నన్ను బడికి పంపిస్తుండేది మా అమ్మమ్మ. నేనెప్పుడైనా ఇంటివద్ద పలకా బలపం పుచ్చుకుంటే అమ్మమ్మ కన్నెర్రజేసి 'బయటికెళ్ళి ఆడుకో పో' అని గదిమి, నన్నింటివద్ద చదువుకో నిచ్చేది కాదు.

భగవంతుడు స్వతహాగా నాకో గుణాన్ని ప్రసాదించాడు. ఆ గుణమే నన్నింత పైకెత్తి, పతనానికి దారిచూపింది. అదేమంటే దేనిలో కాలు పెట్టినా నాదే మొదటి మార్కు. చూపేందుకిదెంతో సలక్షణంగా కనుపించినా, నా జీవిత నాశనానికి నాంది పలికిందీ గుణమేనని నా కిప్పుడు తోస్తున్నది.

ఆ రోజు మా బడిలో పిల్లలందరం కలసి ఒక చిన్న నాటకం వేశాము. అందులో నేను ప్రహ్లాదుని వేషం కట్టాను. మా మాష్టర్లందరూ నన్నెంతగానో మెచ్చుకుని, ఒక అద్దం దువ్వెనా నాకు బహూకరించారు. సంతోషంతో గంతులు వేసుకుంటూ ఇంటికి పరుగెత్తు కొచ్చాను. తాతయ్యప్పుడే ఆఫీసునుంచి వచ్చాడేమో, పడుకుని వున్నాడు. మా అమ్మమ్మ కాళ్ళు పిసుకుతున్నది. వచ్చీ రావడంతోనే ఆరంభించాను.

"తాతయ్యా! నా దగ్గర ఏముందో చెప్పుకో చూతాం" అని పలకా పుస్తకాల మధ్య నా బహుమతులను దాచి, గంతులేస్తూ అడిగాను. తాతయ్యా నా వైపు చూశాడేగాని నోరెత్తలేదు. మా అమ్మమ్మమాత్రం నవ్వుతూ 'ఏముందే? నాకు పెట్టవా?' అని అడిగింది.

"తినేవికాదమ్మా. దువ్వెనా అద్దం" అని రాగం తీశాను. తాతయ్యా కళ్ళు విప్పి చూచాడు.

"నాటకంలో గెల్చుకొచ్చాను తాతయ్యా! మా మాష్టర్లంతా నన్ను మెచ్చుకున్నా రనుకో. అబ్బో! బలేగా పాడేశానులే! ఇవో చూడండి ఎంత బావున్నాయో?"

అద్దం దువ్వెనలు బయటికి తీశానో లేదో తాతయ్య, కాళ్ళు పడు తున్న మా అమ్మమ్మను ఆ కాలితోనే తన్నాడు. నాకేమీ అర్థం కాలేదు. తాతయ్యపై ఎంతకోప మొచ్చిందో చెప్పలేను. అమ్మమ్మా నేనూ రెండు రోజులవరకు భోజనమే చేయలేదు.

నేను నా శక్తిని ప్రదర్శించి గెల్చుకొస్తే తాతయ్య కెందుకింత కడుపుమంట! అయినా తప్పు చేసింది నే నయితే అమ్మమ్మ నెందుకు దండించాలి?

అమ్మమ్మ నడిగాను. "నే నేం తప్పుచేశా నమ్మమ్మా? నాటకంలో వేషం వేయడం తప్పా?" అమ్మమ్మ ఇంకా ఏడుస్తూనే వుంది.

"కాదమ్మా, నువ్వేమీ తప్పుచేయలేదు," అని నన్ను దగ్గరకు తీసుకుంది అమమ్మ. నేను పెద్దగా ఏడ్చాను.

నిజంగా తప్పెవరిదో నాకానాడు బోధపడలేదు గాని, ఆ సంఘటన మాత్రం చెరిగిపోని ముద్రవలె నాజీవితంమీద నిలచింది.

తమ బిడ్డలు సుఖపడాలని, నలుగురిలో పేరుతెచ్చుకుని పెద్ద వాళ్ళు కావాలని ప్రతి తలిదండ్రులూ కోరుకుంటారు. తన బిడ్డ దొంగయై చేతులకు సంకెళ్ళు వేయించుకునేంత పశుప్రాయు డవుతాడని గాని, బిచ్చ మెత్తుకుని అడుక్కు తింటూ అతి దౌర్భాగ్యంగా జీవిస్తాడనిగాని వారు తలంచలేరు. తమ బిడ్డలు సుఖపడాలనే వాంఛతోనే వారు ఏమేమో చేస్తారు. ఏమేమో యోచిస్తారు.

మా అమ్మమ్మేగనుక నాకా నాలుగక్షరాలు నేర్పించకుంటే నా జీవితం ఈ తీరున వుండేదికాదు. నేనూ మా అమ్మమ్మలాగానే, ఏ కూలి నాలి చేసుకునేవాడినో కట్టుకుని పుట్టుగుడ్డిలా పడివుండేదాన్ని. జీవితంలో ఇంత సారం వున్నదని, సమాజంలో ఇన్ని భిన్న విభిన్న కోణా లున్నా యని గమనింపు లేకుండానే అర్థరహితంగా చనిపోయి వుండేదాన్ని.

* * *

కోరికలే మానవులను నడిపిస్తాయి; శాసిస్తాయి. కాని చేతికందితే మనుషుల్ని చిదిపి నాశనం చేస్తాయి. చనిపోనున్నవారు సైతం సుఖంగా చనిపోవాలని కోరుకుంటున్నారంటే, కోర్కెల కెంత సత్తువ వున్నదో గమనించవచ్చు.

ఆనాడు నేను గెల్చుకున్న వస్తువులు, నా లేతహృదయంలో ఎన్నో కోరికల్ని కుసుమింపచేశాయి. ఎప్పుడూ అద్దంముందు కూర్చుని, నా బొమ్మతోనే నేను మాటాడుకునేదాన్ని. అద్దంలో వారెవరో పరాయి మనిషి అయినట్లు పరాచికా లాడేదాన్ని. చిన్నతనానే అలవాటైన ఈ జబ్బు నాకు కొంత కులుకును నేర్పింది.

మా తాతయ్య నాతోను, అమ్మమ్మతోను మాటాడ్డం మానే శాడు. అమ్మమ్మ పలకరించినా బిగించుకునేవాడు. ఒకనాడు పనినుంచి వచ్చి, ఎవరితోనూ మాటాడక మంచం వాల్చుకుని పడుకున్నాడు. ఇది నిత్య కార్యక్రమమే. ఆయ నలా పనినుంచి రాగానే మా అమ్మమ్మ మంచం వాల్చి, తను కాళ్ళకట్టన కూర్చుని పాదాలు పట్టేది. కాని ఈ సంఘటన జరిగిన మరునాడు కాళ్ళుపట్టు కూర్చోబోగానే కాలు విదిలిం చేశాడు. మా అమ్మమ్మ ఉత్త కన్నీటికుండ.

"నేనేం పాపం చేశానని? ఆ పిల్లముండను బడికంపి చెడగొడు తున్నాననేగా? నువ్వు వద్దంటే...." అని గుడ్లనీరు కుక్కుకుంది.

మా తాతయ్యకు ఇసుమంతైనా జాలికలుగలేదు. ఆ ముసలిముండ ఆవంతున ఏడుస్తుంటే అదేమని పల్లెత్తు మాటయినా పలుకలేకపోయాడు. అద్దంముందు కూర్చున్న నేను అంతా చూస్తూనే వున్నాను. ఎక్కడలేని అభిమానం పుట్టుకొచ్చింది. ఏ భావమైనా నన్ను అమితంగా కదిలిస్తే వెంటనే నా కళ్ళు చెమ్మగిలుతాయి. దుఃఖ మొచ్చినా అంతే; సంతోష మొచ్చినా అంతే. ముందు ఏడ్చి కూర్చుంటాను.

ఏడ్పు కొంచెం నెమ్మదించాక "అమ్మమ్మా! నేనిక బడికిపోను" అనేశాను. తాతయ్య కది వినిపించి నట్టేలేదు. అమ్మమ్మమాత్రం పమిట చెంగుతో కన్నీరు తుడుచుకుంది. ఉభయులూ ఏమీ మాటాడలేదు. ఆ రోజునుంచి బడి మానేశాను. అమ్మమ్మ ఆరోజంతగా నా దగ్గరకు రాలేదు, నన్ను ఒడిలోకి తీసుకుని ఓదార్చనూలేదు.

అదేమి చిత్రమోగాని ఎంతో బలీయమైన మన అభిప్రాయాలు ఒక్కొక్కప్పుడు అతి స్వల్పమైన గాలికే దూదిపింజెల్లా తేలిపోతాయి. ఏ చిన్న విషయమో మన అభిప్రాయాన్ని పూర్తిగా మార్చివేస్తుంది.... నన్ను బడికి పంపించడమంటే ఘోరాతిఘోరమైన నేరంగా భావించిన మా తాతయ్య, ఒకనాటి సాయంకాలం వస్తూనే "సుబ్బులూ! సుబ్బులూ!" అని కేకేశాడు. నే నప్పుడు ప్రక్కింటివాళ్ళ కరివేపాకు కోసిపెట్టమంటే చెట్టెక్కి కోస్తున్నాను. తాతయ్య తేలికైనకంఠం వినబడగానే, దూకి గబగబా వచ్చేశాను. తాతయ్య చేతిలో ఒక కొత్త కలం నిగనిగ లాడుతున్నది. ఇన్నాళ్ళకుగాను తాతయ్య మళ్ళీ నవ్వుతూ కనుపించాడు.

"ఏం తాతయ్యా?" నవ్వుతూనే అడిగాను.

"అయితే నువ్వు బడికిపోవా?"

"పోను తాతయ్యా" తెగ్గొట్టినట్లు చెప్పేశాను.

"అయితే ఇంట్లోనేవుండి మా యిద్దరినీ ఏడ్పిస్తుంటావా?"

"నువ్వే పోవద్దన్నావుగాయ్యా! మా అమ్మమ్మను కొట్టి ........" పూర్తి చేయకుండానే బుంగమూతి పెట్టాను.

"రేపటినుంచి నువ్వు బడికి పోవాలి. పోకపోతే ఏం చేస్తానో తెలుసా?"

"ఆ కొత్తకలం నాకిచ్చేస్తావు కదూ!" అన్ని పగలబడి నవ్వి గంతులేశాను. తాతయ్యను అటూ యిటూ తిప్పి గోలచేసి ఆడాను. తిరిగి పాత మనుషులమై పోయాం. తాతయ్యలో ఈ మార్పు ఎలా సంభవించిందో! ఎవరైనా తెలియచెప్పారో లేక తను ఏదైనా చూశాడో, మరెందువల్ల మనసు మార్చుకున్నాడో తెలియదు.

• • •

జీవితదశ లన్నింటిలోను అతి సుందరమైన దశ బాల్యం. స్వచ్ఛందమైన సుఖానుభూతి నీ ఒక్క దశలోనే పొంద గలుగుతాం. సమాజంలోని మంచి చెడుగులతో వారి కెలాంటి సంబంధమూ వుండదు. కుళ్ళు, కుత్రలు ఆ లేహృదయంలో జొరబడనేలేవు. నొప్పి కలిగిన క్షణాన ఏడుస్తారు; నవ్వించగానే తిరిగి తీయగా నవ్వుతారు. ఆ మహా

త్తర శక్తి ఒక్క చిన్నబిడ్డలకే వుంది.... పిల్లలంటే నాకెంతో ఇష్టం. విచ్చిన గులాబీల్లా వారు ఆడుతుంటే నేను పరవశమై పోతాను. నా మనసుకూడా వారితో కలిసి ఆడుతుంది. కాని వెంటనే ఎక్కడలేని దుఃఖం నన్ను ముంచివేస్తుంది. "ఇలా ఎంతకాలం కిలకిల నవ్వ గలుగుతారు? ఎంత కాల మిలా చీకు చింతల్లేకుండా బ్రతకగలుగుతారు? అయ్యో! కొద్ది దినాలు. బహు కొద్దిదినాలు మాత్రమే. ఆడుకోండి పిల్లలూ! త్వర త్వరగా ఆడుకోండి! ఆనందమైన మీ బాల్యాన్ని నిద్ర పోతూ వృధా పుచ్చకండి.... వయసు మీకు కళ్ళెం వేస్తుంది. లోకం మీ పైన నల్లని తెర కప్పుతుంది .... పెళ్ళి చేసుకుంటారు; పిల్లల్ని కంటారు, పాడులోకపు గుండంలో పడి అనేక అన్యాయాలు, అమానుషాలు చేస్తారు, తెలియకపోయినా దగ్గరకుతీసి జోకొట్టి, సమాజం మీకు నేర్పుతుంది. దానితో స్ఫటికంవంటి మీ చక్కటిగుణం లేచి చక్కా పోతుంది. ఇక జన్మలో మీకు సుఖం లభించదు. బాల్యంలో నవ్వినంత తీయగా మరెన్నడూ నవ్వలేరు" అని విల విల లాడిపోతాను.

మా తాతయ్య కొని తెచ్చిన కొత్తకలం తీసుకుని మళ్ళీ బడికి వెళ్ళాను. నన్ను చూడగానే పిల్లలంతా "ప్రహ్లాదుడు! ప్రహ్లాదుడొచ్చాడు" అని చుట్టూ మూగి గోల చేశారు. హిరణ్యకశిపుని వేషం వేసినతను, రాజులాగా నడుచుకుంటూ వచ్చి "ప్రహ్లాదా! ఎవరు చెప్పినార్రా నీకీ బుద్ధి? తండ్రి మాటయే జవదాటి-(ఒక వేపుళనక్కాయొలిచి తిని) బడికి వచ్చుటయే ఎగ్గొట్టితివిగదా! ఆహా! ఒక గంటసేపు బెంచీ యెక్కి నిలువబడ వలసిందిగా నీకు శిక్ష విధిస్తున్నానురా. ఒరే సేవకా!" అనీ అనటంతోనే క్లాసంతా గొల్లున నవ్వింది నవ్వుల సందడిలో డ్రాయింగ్ మాష్టారు ఎప్పుడొచ్చాడో ఎవరూ చూడలేదు.... ఆయనకు నేనంటే ఇష్టం.

"ఏం సుబ్బులూ! బడికి రావడంలేదేం? మానేశా వనుకున్నాను" అన్నారు కుర్చీలో కూర్చుంటూ. నే నేమీ సమాధానం చెప్పలేదు. సిగ్గు పడుతూ సన్నగా నవ్వాను.

మా డ్రాయింగ్ మాష్టారికి బొమ్మ వేయడంకంటే, అందాన్ని గూర్చి చెప్పడమంటే ఇష్టం.

"ప్రపంచంలోకెల్లా అందమైనవస్తువు ఏదిరా అబ్బాయిలూ?" అని రోజుకొకసారైనా అడిగేవారు. కొందరు పిల్లలు గారె అని, మా యింటి దగ్గర మేడ అని, ఆవుదూడ అని మొదట్లో ఏవేవో చెప్పేవారుగాని ఇప్పుడంతా ఒకేసమాధానం చెపుతారు. అదేమంటే 'అమ్మాయి' అని. ఈరోజుకూడా తెల్లసున్నంముక్క నలుపుకుంటూ అదే ప్రశ్న అడిగారు. అందరూ పై సమాధానమే చెప్పారు, తరువాత ప్రశ్న: "మన క్లాసులోకల్లా అందమైన దెవర్రా?" ఈ ప్రశ్న అడుగగానే "సుబ్బులు! సుబ్బులూ!" అని పాత జవాబే యిచ్చారు. పైకి కనుపించనివ్వేదాన్ని కాదుగాని, పిల్లలంతా నా పేరు పలుకుతుంటే లోలోన ఎంతో మురిసిపోయేదాన్ని. హాజరు తప్ప కుండా బడికి వెళ్ళటంలోగల అభిరుచి దీనివల్లనే కలిగిందేమో నాకిప్పటికీ బోధపడలేదు. ఏమైనా బడికి పోవడమంటే నాకెంతో సరదాగా వుండేది. చాలమంది పిల్లలు బడిని నరకంగా ఊహించుకుంటారుగాని, ఆదివారమే నాకు నరక మనిపించేది. పక్కింటి పిల్లలతో ఆడుకున్నా, చెట్లెక్కి సీమచింతకాయలు కోసుకుతిన్నా, వారిచేత వీరిచేత అల్లరిపడి తిట్లు తిన్నా నాకు ఆదివారం గడిచేదికాదు. ఏమీ తోచక కాలుగాలిన పిల్లిలా తిరుగుతుండేదాన్ని. ఇంట్లో పాతగుడ్డలేమైనావుంటే రక రకాలుగా కుట్టేదాన్ని. పనికిరాకుండా చిరిగిపోతూన్న పంచె ఒకటి మా తాతయ్యది వుంటే, ఒక ఆదివారం కూర్చుని అమ్మమ్మకు సరిపడేలా రవికె కుట్టాను.

ఆనాడు మా అమ్మమ్మ అంది, "నాకు తెలుసే, నువ్వు దేనిలో నైనా ఫస్టే"

నిజంగా అలా కుట్టాలని నాకెవరూ నేర్పినవారు లేరు. ఊహించి, నాకు తోచిన విధంగా కుట్టాను. మా అమ్మమ్మ యెంతో సంబరపడిందానాడు. తాతయ్య ఇంటికి రాగానే "నీ చొక్కాలు గిక్కాలు ఇంక బయట యివ్వొద్దు. ఆ కూలిలో సగమిస్తే చాలు. మే మిక్కడ కుట్టిపెడతాము" అని పండుగలా తనకు కుట్టిన రవికె చూపింది. తాతయ్య కాస్తంతయినా చలించలేదు. కనీసం నవ్వనయినా నవ్వలేక పోయాడు. ఒక్కమాటు కన్నెత్తి నిండుగా నావైపు చూశాడంతే. నా

కెందుకో ఆ చూపు వికారమనిపించింది. దానితో అమ్మమ్మగూడా ఆ ప్రస్తావనకు స్వస్తి చెప్పింది.

◆ ◆ ◆

మా తాతయ్యది మరీ అంతుపట్టని మనస్తత్వం. ఏ విషయం లోనూ తన స్పష్టమైన అభిప్రాయాన్ని తెల్పడు. వంగి వంగి నమస్కారాలు చేస్తూ, లోకానికి అణగి మణగి వున్నట్లు కనుపిస్తాడేగాని లోతుకు చూస్తే నిప్పుల కుంపటిలా వుంటాడు. లోలోన మహాగ్ని లేవేవో దహించి వేస్తున్నట్లు, ఏనాడో అది ప్రజ్వరిల్లి మహా ప్రళయాన్ని పుట్టిస్తా యన్నట్లు వుంటాడు. చిన్నపిల్లనుగనుక నాకేమీచెప్పడనుకుంటే, మా అమ్మమ్మకు సైతం స్వవిషయాలగూర్చి చెప్పడు. ఎవ్వరితోనూ, ఎప్పుడూ కష్టసుఖాలను గురించి మాటాడడు. ఎవరైనా చెబితేమాత్రం 'ఆహాఁ, ఊహుఁ' అని ఊఁకొడతాడేగాని పన్నెత్తి పలకడు........ ఒక సారిమాత్రం ఒంటరిగా కూర్చుని ఏడుస్తుంటే నేను చూశాను. తాతయ్య కంటివెంట నీరు పెట్టడం అదే తొలిసారిగా చూశాను. నా అనుభవంలో తుదిసారికూడా అదే. ఎప్పుడూ ఏడ్చెరుగని తాతయ్య అలా ఏడుస్తుంటే నాకూ ఏడుపొచ్చింది. భయమేసిందికూడా. బెరుకు బెరుకుగానే దగ్గరకు వెళ్ళాను. కంటెదుట నిలబడ్డా నన్ను గమనించినట్లు లేదు. ఎక్కడో, ఏ కాలంలోనో, ఎవరికోసమో ఏడుస్తున్నాడు. కుమిలిన కన్నీరంతా ఈనాడు వెల్లువగా తన్నుకొస్తున్నదా అన్నట్లు పొరలి పొరలి ప్రవహిస్తున్నది. నేనిక వుండలేక 'తాతయ్యా!' అని పిలిచాను. సమాధానం లేదు. మా అమ్మమ్మగూడా సమయానికక్కడ లేకపోవడం నన్ను మరీ భయపెట్టింది. తిరిగి "తాతయ్యా! తాతయ్యా!" అని మనిషిని పట్టుకు ఊపాను. కండ్లనీరు కార్చుతూనే నా వైపు చూశాడు. సూటిగా కండ్లలో కండ్లుంచి ఎవరు నీ వన్నట్లు చూస్తున్నాడు.

"నేను తాతయ్యా! సుబ్బుల్ని. ఎందుకేడుస్తున్నావు?" నేను ఏడుస్తూనే అడిగాను. అప్పటికిగాని తాతయ్య మన ప్రపంచంలోకి దిగలేక పోయాడు.

"ఏడుస్తున్నానా అబ్బే లేదమ్మా, వూరికే" అని కట్టుపంచెతో కండ్లు తుడుచుకున్నాడు. రెండు సెకండ్లు గడిచాయి. నవ్వుతూ నన్ను తన ఒడిలోనికి లాక్కున్నాడు. కాని నా ఏడుపు మాత్రం పూర్తిగా పోలేదు.

"పిచ్చిపిల్లా! నువ్వేడుస్తూ, నన్నంటున్నావా?" అని చెక్కిళ్ళు తుడిచాడు.

అంతలో మా అమ్మమ్మ వచ్చింది ఎవరిమీదో పెద్దగా అరుచుకుంటూ.

"అమ్మమ్మతో చెవుతావా?" నవ్వుతూనే అడిగాడు నన్ను.

"మరి ఎందు కేడ్చావో చెవితే!"

ఈ మాటతో తాతయ్యముఖం తిరిగి గంభీరమైంది. అమ్మమ్మ వాకిటవతలే ఇంకా కేకలేస్తున్నది.

"చెపుతానమ్మా! నీకుచెప్పక మరెవరికి చెపుతాను? తప్పకుండా చెపుతాను. ఒట్టు వేసుకుంటున్నాగా" అని నా శిరస్సుపై ముద్దు పెట్టుకున్నాడు. అమ్మమ్మ కట్టెలమోపుతో లోనికొచ్చింది.



కాలం ఎప్పుడూ ఒకేలాగ వుండదు. మన యింటి గడియారమైనా మనతో సంబంధంలేనట్లు, మనం నిద్రపోతున్నా అది నడచిపోతుంది. మనం లేచి పరుగెత్తినా మనతో రాక, దాని నడకేదో అది నడుస్తుంది. అలాగే వర్షాకాలం రాకూడదని మా అమ్మమ్మ ఎన్ని దేవుళ్ళకు మొక్కుకున్నా, ఆ ఋతువు రానే వచ్చింది. వర్షాకాలం పేరు చెవితేనే మా అమ్మమ్మ భయంతో వణికిపోయేది. ఆ మూడు మాసాల కాలం దుప్పటికప్పి మంచంనుంచి దిగేది కాదు. ఎందువల్లంటే వంగసాలగా సిద్ధించిన ఉబ్బసం....... ఈ ఉబ్బసం జబ్బు మనిషిని చావా నివ్వదు; బ్రతుకా నివ్వదు. జీవితంపైని రోత పుట్టించేట్లు అల్లాడిస్తుంది. దగ్గు తగ్గేంత వరకు ఇంటివద్దనే వుండి, ఇంటి పనులవీ చూస్తానని అమ్మమ్మతో చెవితే ఆవిడ మండిపడేది.

"నే నుండటం నీకు కష్టంగా వుందేమే? అయ్యో భగవంతుడా! నన్నెందుకు తీసుకుపోవురా!" అని కంట నీరు పెట్టుకునేది.

తాతయ్యా, నేనూ సంప్రదించుకుని ఒక నిర్ణయానికి వచ్చాము. నేను ఉదయమే లేచి బడికి వెళ్ళాలిగనుక ప్రొద్దుట భోజనం తయారు చేయడం తాతయ్య వంతు, రాత్రి వంట నా వంతు.

సాయంత్రం బడి వదలిపెట్టగానే ఆలస్యం చేయకుండా సరాసరి ఇంటికి వచ్చేదాన్ని. కూడూ కుమ్మా అంతా అయేటప్పటికి రాత్రి ఏ ఎనిమిదో కొట్టేది. లంగా పైకి కట్టుకుని నేను పనిచేస్తుంటే "కర్మ కర్మ!" అని మంచంలో పడుకునే మా అమ్మమ్మ సణుగుతుండేది.

"బెల్లం కొట్టేరాయిలా అలా కూచోకపోతే ఆ పిల్లముండాదానికి ఏదన్నా అందించకూడదు? అదొక్కతే చావాలా?" అని తాతయ్యను సాధిస్తుండేది.

ఒకరోజు నాకు మండుకొచ్చి "మా చావేదో మేము చస్తాంగా. నోరు మూసుకు నువ్వు పడుకోరాదూ?"అని తొందరపడ్డాను.

అతి స్వల్ప విషయానికే అమితంగా బాధపడే స్వభావమని తెలిసి కూడా నేను తొందరపడ్డాను. నా ఈ ప్రవర్తనకు తాతయ్యకూడా ఆశ్చర్య పోయాడు. ఉభయులము కలసి ఎంతబ్రతిమాలినా, క్షమించమని నేనెంత వేడుకున్నా మా అమ్మమ్మ ముద్ద నోటి కెత్తలేదు. ఏడ్పుతోపాటు విపరీత మైన దగ్గు ప్రాణాలను కొరికేస్తున్నది.

మరునాడే పుట్టెడు జ్వరం ముంచుకొచ్చింది. తాతయ్యా, నేనూ సెలవు పెట్టి మంచందగ్గరే కావలి కూర్చున్నాము. కాని ఏం లాభం?

"సుబ్బులూ! దగ్గరకు రామ్మా!" చేతులుచాచి నన్నందుకున్నది.

"ఏడుస్తున్నావా? తప్పుగదూ. నీమీద నాకు కోప మొచ్చిందను కున్నావా?.... ఏమయ్యో! విన్నే. వింటున్నావా? నే వెళ్ళిపోతున్నాను, బిడ్డను నీచేతుల్లో పెట్టి పోతున్నాను. ఎలా సరిదిద్దుకుంటావో ఏమో? ఏమ్మా! బుద్ధిగా తాతయ్యను కనిపెట్టుకునే వుంటావుగదూ!.... అయినా నే నెక్కడికి పోతానులే" అంటూనే అమ్మమ్మ వెళ్ళిపోయింది.

పాపిష్టిదాన్ని. పుడుతూనే తల్లిని పోగొట్టాను. పెంచి పెద్దచేసిన దాన్ని నిర్దాక్షిణ్యంగా నేనే పొట్టన పెట్టుకున్నాను ...అయిపోయింది. అమ్మమ్మ పాత్ర అంతటితో ముగిసిపోయింది.

  

ఆకురాల్చి మోడువారిన చెట్లు తిరిగి వసంతంలో చిగుర్చుతాయి. కాని మూలంవరకు నరికివేయబడి పూర్తిగా జీవం గోల్పోయిన చెట్టు ఎన్నటికీ కుసుమించదు.

నేను చదువుకు స్వస్తి చెప్పాను. ఈ విషయంలో తిరిగి తాతయ్యకూ, నాకూ ఘర్షణ పడింది. పోయిన మా అమ్మమ్మ కోసమయినా చదవమంటా డతను. చదివితే సంసారమెలా అంటాను నేను.

"నేను బ్రతికున్నంతవరకు నీకా దిగులేమీ అక్కరలేదు. పోయి చదువుకో!"

నిజంగా నాకు చదవాలనే వున్నది. కాని తాతయ్య మరీ బాధపడిపోతాడనే కారణంగా, ఆయన ఎంత నతపోరినా నేను ససేమన్నాను. తాతయ్య పట్టుకూడా కొంతసడలింది.

ఉదయమే లేచి ఇంటిపనులన్నీ చూసుకుని, తాతయ్యకు కోటూ అదీ తొడిగి, క్యారియర్‌లో అన్నంపెట్టి ఆఫీసుకు పంపేదాన్ని. సాయంకాలం 6 గంటలకు గాని తాతయ్య ఇంటికి చేరడు. ఆయన వచ్చేంతవరకు ఒంటరిగా ఇంట్లో కూర్చోడమంటే విసుగెత్తి పోయేది.అందులో తిరిగిన కాలు నాది. కొంతసేపు ఆయింటి కాయింటికి పోయి ఏవో చొల్లు కబుర్లతో కాలం వెళ్ళదీసేదాన్ని. ఒకనాడు తాళం వేయకుండా కాలక్షేపానికనిపోతే, ఇంట్లోవున్న చెక్కపెట్టె పగులగొట్టి అందులోనున్న పది రూపాయల రొక్కం, మరచెంబూ పట్టుకుపోయారు. పట్టపగలు ఇది సంభవమని గ్రహించకపోవడమే నా పొరపాటు.

తాతయ్యకు తెలిస్తే ఏమంటాడో? తెలియకుండా దాస్తే ఎంత కాలం?.... అప్పుడు నేరం మరీ భారమవుతుందని తాతయ్య ఇంటికి రాగానే చెప్పాను. తిడతాడని, కేకలేస్తాడని, ఇంకా కోపమొస్తే కొడతా

దనికూడా అనుకున్నాను. కాని తనకేమీ పట్టనట్లే, అసలు విననట్లే ఊరుకున్నాడు. నాకు ఎంతో ఆశ్చర్య మేసింది.

"భగవంతుడా! నా కెంత మంచి తాతయ్యనిచ్చావు"అని ఆ నాటి రాత్రి ఉభయులనూ అభినందించాను.

ఇక ఇంటినుంచి కాలు బయట పెట్టడంలేదు. చిన్నదాన్నా, చితక దాన్నా- తిరిగే కాలు నిక కట్టేయాలనుకున్నాను. ఆ నిర్ణయంతోనే కొంతసేపు పడుకునేదాన్ని. కొంతసేపు పాడుకున్నేదాన్ని. మరికొంత సేపు నే నొక్కర్తెనే ఆడుకునేదాన్ని. ఈ ఏకాంత స్థితిచూస్తే ఒకోసారి నాకే నవ్వు వచ్చేది.

"ఏమటి సుబ్బులూ? నీ వ్యవహారం?" అని నాలో నేనే చెప్పుకు నవ్వుకునేదాన్ని. అంతలో ఫ్యాక్టరీ కూసేది. బియ్యం పొయ్యిమీద వేసేదాన్ని.

♦ ♦ ♦

అనుకోకుండా ఒకనాడు నాకో పిలుపు వచ్చింది. నేను చదువుకున్న స్కూలు వార్షికోత్సవ సందర్భములో పెద్దనాయకు లెవరో వస్తున్నారట. బ్రహ్మాండమైన ఏర్పాట్లు జరిపించిన ఆ మహాసభ నా ప్రార్థన గీతంతో ప్రారంభించాలని మా హెడ్ మాష్టరుగారు నిర్ణయించి, కార్యక్రమపత్రంలో నా పేరు వేయించి నాకు పంపారు. నాకు మహా సంతోష మైంది. ఎన్నాళ్ళకు మళ్ళా స్కూలులో కాలు పెడుతున్నా ననుకుంటూ మహాభాగ్యమని వెళ్ళాను. నేను చదువుకున్న యావత్తుకాలంలో అలాంటి ఏర్పాట్లు ఎన్నడూ జరుగలేదు పెద్దపెద్ద పందిళ్ళు, దేదీప్యమానంగా వెలిగిపోతున్న విద్యుద్దీపాలు, రంగురంగుల కాగితాలు, పూసకూర్పులతో ఆ ప్రదేశమంతా కన్నులపండువుగా వుంది. అందరి ముఖాల లోను సందడి, సంతోషం. నేను సరాసరి హెడ్ మాష్టారి గదిలోనికి వెళ్లాను. వారుగూడా హడావుడిగానే మాటాడుతున్నారు. డ్రాయింగ్ మాస్టారు పరుగెత్తుకుంటూ వచ్చి 'వస్తున్నారు, వస్తున్నారు. కారు వచ్చేస్తోందిసార్' అని చెమటలు గ్రక్కుతున్నారు.

"అయ్యో! సుబ్బులు రాలేదే! ఏం చేసేట్టు! ఎవరినైనా త్వరగా పంపి పిలిపించకూడదూ?" అని హెడ్‌మాష్టరుగారు అనగానే నాకు సిగ్గు వేసింది.

"వచ్చాను మాష్టారూ, ఎవరినీ పంపించనక్కరలేదు" అంతా నా వైపు చూశారు.

"నాకు తెలుసుమాష్టారూ! సుబ్బులంటే ఏమిటి?" నా దగ్గర కొస్తూ అన్నారు డ్రాయింగ్ మాష్టారు.

"వచ్చావా సుబ్బులూ! రా వెడదాం. మొత్తానికి చదువు మానేసిన తరువాత కాస్త ఒళ్ళు చేశావే" అని నవ్వుతూ హెడ్‌మాష్టరుగారు నా చేయి పుచ్చుకుని పందిరివైపు తీసుకెళ్ళారు. వేదికవెనుక కట్టిన తెరల గదిలో హెడ్‌మాష్టారి సరసనే నన్ను కూర్చోబెట్టుకున్నారు. నేను కూర్చునీ. ఇతరమాష్టర్లు నిలబడీ మాట్లాడుతుంటే నాకు ప్రాణం పోతున్నట్లుండేది, మాటిమాటికీ లేవ ప్రయత్నించేదాన్ని.

"ఫరవాలేదులే కూర్చో. నీవిప్పుడు మా విద్యార్థినివి కాదుగా. ప్రస్తుతం మా అతిథివిగాబట్టి సత్కరిస్తున్నాము. భయపడక కూర్చో" అన్నారు హెడ్‌మాష్టారు నన్ను కనిపెట్టి.

అంతలో కారు రావడం, నినాదాలు మ్రోగడంతోపాటు, బ్యాండు మేళంకూడా మేళవించింది. హెడ్‌మాష్టారూ, మరికొందరు ప్రముఖులు ఎదురేగి అతిథులను స్వీకరించి ఆసీనులను గావించారు. వారిని పుష్ప మాలాలంకృతులను చేయడమే ఒక అరగంట పట్టింది.

"ఇప్పుడు మన 18 వ వార్షికోత్సవ మహాసభ మన పాతవిద్యార్థిని చిరంజీవి సుబ్బులు ప్రార్థనగీతంతో ప్రారంభించబడుతుంది" అన్న ముక్కలు నాలో కంపనాన్ని కలిగించాయి. ఒకవైపు కంగారు, మరోవైపు ధైర్యంతో ముందుకు నడిచాను. మైక్ ముందు నిలబడగానే డ్రాయింగ్ మాష్టారు నా మెడలో పూలమాల వేశారు. జనం చప్పట్లు కొట్టారు. "ప్రహ్లాదా పాడు! జోరుగాపాడు!" అని ఒక మూలనుంచి ఎవరో పెద్దగా కేకవేశారు. ఆ పందిరి నవ్వులో నా కంగారు కొట్టుకుపోయింది.

"ఏదేశమేగినా, ఎందుకాలిడినా
ఏపీఠమెక్కినా, ఎవ్వరెదురైనా
పొగడరా నీతల్లి భూమి భారతిని
నిలుపరా నీజాతి నిండు గర్వమ్ము."

అని గొంతెత్తి పాడాను. ఆపెద్ద నాయకులు ఎంతగానో మురిసి పోయారు.

"ఈ చిరంజీవి అభివృద్ధిచెంది వర్ధిల్లాలని ఆశీర్వదిస్తూ, ఈ ఉంగ రాన్ని బహూకరిస్తున్నాను" అని ఆ వుంగరాన్ని నా వ్రేలికి తొడిగారు. వారి ఉంగరం నా కెక్కడ సరిపోను? పాపం! వారు విశ్వప్రయత్నం చేస్తుంటే 'రెండు వ్రేళ్ళకు కలిపి గుచ్చండి' అన్నాను.

జనంతోపాటు నాయకులూ నవ్వి 'మహా మాటకారివే' అంటూ ఉంగరాన్ని నాచేతి కిచ్చారు. నమస్కారం చేసి నేను దిగి వచ్చాను.

కార్యక్రమాలనంతరం సెలవు పుచ్చుకుని బడి ఆవరణ నొదిలి వస్తుంటే, నిజంగా నాకు ఏడుపొచ్చింది. అభివృద్ధి చెందే అవకాశా లనూ, మంచి జీవితాన్నీ వదలుకుని శూన్యంలోకి దిగిపోతున్నా ననిపించింది.... చదువుకుంటే చక్కని భవిష్యత్తు వుంటుంది. 'నాయంత పాడగలవారు లేరనేగా నన్ను పిలిపించింది? .. చదువులోమాత్రం నేనెవ రికి తీసిపోతాను? క్లాసులో మొదటిదానిగానో, రెండవ స్థానంలోనో వస్తానుగదా! డ్రాయింగ్‌మాస్టారు ఒకోప్పుడు నీకంటే నీచేతి బొమ్మ బావున్నదంటారే! ఇన్నివుండి చదువుకుంటే ఎంత రాణింపుకొస్తాను?.... ఈ కొద్దిపాటిఅయినా చదువుకోకపోతే నాకీ ఉంగరమిప్పుడు బహుమా నంగా లభించేనా?.... ఇంకా చదివితే ఇంకెన్ని బహుమానాలో! ఎందుకు చదవ కూడదు? చదువుతాను. తప్పక చదువుతాను; అనుకుంటూ భావా వేశంలో కొట్టుకుపోతూ ఇల్లు చేరాను.

తాతయ్య మంచంమీద కూర్చుని తనకాళ్ళు తనే నొక్కుకుంటు న్నాడు. ఆ దృశ్యం నాలోని భావపరంపరలన్నింటినీ తుడిచి కొట్టింది.

చదువుకోతగిన అవకాశాలు మన కెక్కడున్నాయి? తాతయ్య తెచ్చే పాతికరూపాయల్లో ఇల్లు గడవటమే అంతంత మాత్రంగా వుంటే ఇక చదువెక్కడ?

"ఏం తాతయ్యా! ఈరోజు త్వరగా వచ్చేశావు? అప్పుడే విడుదల చేశారేం పాపం! సరేగాని మనం బయటికి వెళ్ళామంటే సంపాదనే సంపాదన. చూడు. ఈ ఉంగరంచూడు తాతయ్యా! ఎంతవిలువ చేస్తుం దంటావు." అని ఉంగరాన్ని తాతయ్య చేతిలో పెట్టాను.

"మంచిదే. ఎవరిదో గొప్పింటి వారిదల్లే వుంది." అన్నాడు ముక్తసరిగా.

"నాకు బహుమానం యిచ్చారు తాతయ్యా! ఎవరో పెద్ద నాయకులు!"

అన్ని విషయాలూ వివరంగా చెప్పాను.

"మీ అమ్మమ్మ అంటుంటే ఏమో నీపై ప్రేమకొద్దీ ననుకున్నాను. నిజంగా నీవన్నిటిలోను ఘట్టేనమ్మా సుబ్బులూ!" అన్నాడు తాతయ్య.

ఆయనలా అనేసరికి "చదువుకుంటాను తాతయ్యా!" అని అన కుండా వుండలేకపోయాను.

"చదువుకుంటావా?" వెల వెల పోతున్నాడు తాతయ్య.

ఆయనే ఒకనాడు చదువుకునేందుకు కలం కొనితెచ్చాడు. మొన్న మొన్నటివరకు చదువుకుంటావా లేదా యని సతపోరాడు. అటువంటి తాతయ్య ఈ నా డిలా తేలిపోవడంలో గల కారణం?

"ఏం తాతయ్యా! వద్దా?" కాళ్ళు పడుతూనే అడిగాను.

"వద్దని చెప్పేందుకు నోరెలా వస్తుందమ్మా....చదువుకో," అన డంతో నా ఆనందానికి అంతు లేకపోయింది.

"కాని......... చూడమ్మా......... నా ఉద్యోగం ఈనాటితో సరి పోయింది."

ఈ పలుకులు పిడుగులవలె నా శిరస్సున పడ్డాయి.

  

తల్లి ఒడిలోంచి ఉరకలు వేసుకుంటూ వచ్చిన ఉదయభానుడు కళ కళలాడుతూ, కేరింతలుకొడుతూ తనూ చక్కగా నవ్వుతాడు; ఇతరులనూ నవ్విస్తాడు. ఆ దశ ఆనందమయంగా గడచిపోతుంది. యౌవనంలో అడుగిడుతూనే చిటపట లాడుతాడు. కష్టాల పరంపరలకు కన్నెర్ర చేసుకుని దయా దాక్షిణ్య రహితంగా నిప్పులు కురిపిస్తాడు. వివేకవంతుడు గనుక, వెంటనే తప్పిదాన్ని తెలుసుకుని, తనకు తనే పశ్చాత్తాప పడి సిగ్గుతో తలవాల్చి కృంగిపోతాడు.

నే నిప్పుడే బాల్యం దాటి యౌవన ప్రారంభంలో కాలు మోపాను. జీవితదశ లన్నింటిలోను అత్యంత కీలకమైన దశ యౌవనారంభమేనని చెప్పాలి. ఈ దశలోని మంచి చెడుగులే జీవితాన్ని దిద్దుతాయి. ఈ దశలో ఏర్పరుచుకున్న హద్దులూ, నిర్ణయాలే జీవితాంతాన్ని నడిపిస్తాయి.

ఇంతకుముం దెన్నడూ 'అసంతృప్తి' అంటే ఏమో ఎరుగను. ఈ దశలో అత్యంత ప్రమాదకరమైన ఆ జబ్బు ఒకటి పట్టుకుంది. అందుకు పరిస్థితులే కారణం కావచ్చు. మరేదైనా కావచ్చు....తాతయ్యకు వచ్చే పధ్నాలుగు రూపాయల ఫించనుతో రెండు జీవాలు బ్రతికి బట్ట కట్టాలంటే ఎంతసంభవమో తెలియందిగాదు......కాని ఏమిటి చేయడం? కూలి నాలి చేయడమంటే మనసొప్పి చచ్చేదికాదు. ఇంత పాటకురాలను, క్లాసులో ఫస్టున వచ్చేదాన్ని కూలిచేయ తగుదునా? కాయ కష్టాన్ని ఈ సుకుమార శరీరం భరించగలదా?

నే నొక నిర్ణయానికి రాలేక ఒకనాడు తాతయ్య నడిగాను, "తాతయ్యా! నే నేదైనా పని చేస్తాను."

ఆయనకు నవ్వు వచ్చింది.

"అవును తాతయ్యా! నవ్వులాట కాదు."

"ఏం చేస్తావమ్మా! వరికోతకు వెడతావా?"

"ఆ. వెడతాను."

"సరే వూరొక్క...... సంబంధం చూస్తున్నాను" అన్నాడు తాతయ్య.

"ఎవరికి సంబంధం?"

"నాకిక ఎవరున్నారమ్మా? నీకే........ నీకో పెళ్ళి సంబంధం చూస్తున్నాను. కొన్నాళ్ళు కళ్ళు మూసుకుని ఎలాగో గడుపు. మంచి వాడ్నిగాచూసి నిన్ను వదిలించుకుంటాను," నవ్వుతూనే తాతయ్య బయటికి నడచి పోయాడు.

పెళ్ళి! ఊహ తెలిసిన తరువాత నేను చాలా పెళ్ళిళ్ళు చూశాను. కాని, నాకూ ఒకనాడిలాగే పెళ్ళి జరుగుతుందనీ, పూల పల్లకీలో ఎక్కి ఊరంతా తిరుగుతాననీ నేనెన్నడూ ఊహించలేదు. చిన్నతనానైనా కనీసం నేను బొమ్మలపెండ్లి చేసుకు ఎరుగును. ఈ వయసులో వున్న యువతీ యువకులకు పెళ్ళి సంబరమంటే చాల యిష్టమనీ, ఎన్నెన్నో గాలిమేడలు నిర్మించుకుని తీయని కలలు కంటారనీ నేను ఎంతో కాలానికి గాని తెలుసుకోలేక పోయాను. పెళ్ళి చేసుకోవడంపై నాకో అభిప్రాయం లేదు. ఇంత చక్కని వరుడు కావాలి, ఇలా యిలా వుండాలి, వివాహానంతరం మేమిలా తేలిపోతాం, గాలికిపోతాం అని నేనో గీత గీసి పెట్టుకోలేదు.

తాతయ్య నాకూ పెళ్ళి చేస్తానన్నాడు. ఈ హెచ్చరికతో ఎన్నడూ లేని కొన్ని విచిత్ర భావాలు నాలో మొలకలెత్తాయి. పెళ్ళి చేసుకుంటాం. సరే........ తరువాత? అసలు నాకు లభించే భర్త ఎలాంటివాడో?.... కొంపతీసి మా తాతయ్యకుమల్లే కుంటి కాలివాడో, లేక గుడ్డికంటివాడో దొరకడుగదా?........ వెధవ కోర్కెలు నేనూను! ఛీ ఛీ. నాకేమిటి? చక్కగా చదువుకున్న సుందరుడైన భర్తే లభిస్తాడు........ నేనంత క్రితమే కొన్ని దినాలముందు ఒక ప్రేమ సినిమా చూశాను. ఒక అమ్మాయి, అబ్బాయి. యిద్దరూ అందమైనవారే. "హాయి ప్రేమ సుఖదాయి ప్రేమ" అని ఎదురుబళ్ళా కూర్చుని పాడుకోడంతప్ప వారికి వేరు పని వున్నట్లే కనుపించదు. ఆ జంట అన్న మెప్పుడు తింటుందో, ఎన్నడైనా స్నానం చేస్తుందో లేదో తెలియదు. పొద్దస్తమానం ప్రేమించుకోవడమే వారి పని.... కాని మధ్యలో ఒక దుర్మార్గుడు ప్రవేశిస్తాడు. నాయకీ నాయకుల ప్రేమ సౌధానికి నిప్పంటిస్తాడు. దానితో ప్రేమికులిద్దరు లబో దిబోమని ఈయనొక ఊరిలో, ఆ యమ్మ

ఒక ఊరిలో పడిపోయి ఇద్దరూ కలసి ఒకే పాటను వీణపై పాడుతారు. ఇద్దరి గొంతులూ ఎంతో శ్రావ్యంగా వుంటాయి.... నిజంగా చూస్తు న్నంతసేపు వారి కష్టాల పరంపరకు కన్నీరు కార్చకుండా వుండలేము. అంతలో నాయకుడు చెప్పలేనన్ని ఘనకార్యాలుచేసి, సెభాషనిపించుకుని నాయికను చేరుతాడు. అప్పుడుగాని వారు పెళ్ళిమాట తలపెట్టరు.... వాస్త విక జగత్తులో అదెలా సంభవమనే ప్రశ్న మనకు ఉదయించదు. "ఆహా! దివ్యంగా ఉన్నది. ప్రేమే పవిత్రం!" అనుకుంటూ లొట్టలేసు కుంటూ చక్కా ఇంటికొస్తాము.

ఇంకా పెద్ద దాన్నయితేగాని అర్థం కాదు కామోను ఆ ప్రేమ సారాంశమని అనుకున్నాను. ప్రేమకు, పెళ్ళికీ సంబంధమున్నది గనుక కొంచెం కులాసాగా వుండాలనిపించింది. కొత్త బట్టలు లేకపోయినా ఉన్నవరకే సింగారించుకుని తాతయ్యకోసం ఎదురుచూస్తూ కూర్చున్నాను. దూరాన్నుంచి తాతయ్య రావడం కనుపించింది. కూడా ఎవరో కొత్త వ్యక్తి! ఇద్దరూ మాటాడుకుంటూ ఇంటివైపుకే వస్తున్నారు. వెంటనే నా కాలోచన తట్టింది. అతనే కాదుగదా నా కాబోయే భర్త?.... దగ్గర పడారు. పరికించి అతనివైపు చూశాను కుర్రకుంక గాకపోయినా కొద్దో గొప్పో అందగాడే. శుభ్రమైన బట్టలు అతని వయస్సును చెప్ప నిరాక రిస్తున్నాయి.... అంతలోనే వారు ఇంటి ముంగిట కొచ్చేశారు. నేను లోనికి జరిగాను.

మే ముండే కొంపకు గదులంటూ వుండవు. అదే వంటగది, అదే పడకగది, అదే వాడుకునే గదీను. కొత్త వ్యక్తి రావడంతో సిగ్గు అనిపించినా చేసేదిలేక అలాగే ఒకమూల చతికిలబడి కూర్చు న్నాను.

"ఎవరు ఈ అమ్మాయేనా?" అతనడిగాడు. నేను కొంచెంగా తలెత్తి చూశాను. తాతయ్య మాటాడకుండా మంచంవాల్చి కూర్చు న్నాడు. అతనూ మంచంమీద కూర్చుంటూ "నేను నమ్మలేను" అన్నాడు.

నడుము వాల్చబోయిన తాతయ్య రివ్వున బాణంలా లేచాడు.

"కుక్కా! బయటికిపో ముందు. నీ మొహం చూసినా పంచ పాతకాలు చుట్టుకొంటాయి. నడువు. నా ఇంట్లోంచి బయటికి నడు" అని తాతయ్య ఉగ్రుడై ఊగి పోతున్నాడు. నాకు ఆశ్చర్యం వేసింది. తాతయ్యకేమైనా పిచ్చి పట్టిందా? ఇంటికొచ్చిన చుట్టాన్ని పట్టుకుని అందులో పిల్లనివ్వాలని పిల్చుకొచ్చి కుక్కా నక్కా అంటాడేమిటి?

"పోరా! పాలుతాగి తల్లి రొమ్మును గుద్దేబాపతురా! విశ్వాస ఘాతకుడా! పో. మళ్ళీ నీ మొహం చూపెట్టకు."

ఈ మాటలతో అతనూ రెచ్చిపోయాడు. మెడకు బిగించుకున్న ఎర్ర తువ్వాలును గుంజుకుంటూ లేచి "ఎవరు ఘాతకులు? నువ్వా నేనా? ముసలికుక్కా" అని పట పటా పండ్లు కొరికాడు.

నేనా క్షణంలో మగవాడినై వుంటే ఏమి జరిగేదో చెప్పలేను. అప్పటికీ, వచ్చిన ఆవేశాన్ని బలవంతంగా అణగద్రొక్కుకున్నాను.

"నిజమే. నాకెవరూ దిక్కులేని కాలంలో దగ్గరకు తీసి కాపాడావు. నీ బిడ్డతో పాటు నన్నూ పెంచి పెద్దచేశావు. ఆ విశ్వాసంతోనే అంత దూరంనుంచి మళ్ళీ నిన్ను వెతుక్కుంటూ వచ్చా.... నన్ను కాదని వెళ్ళగొట్టినా జీవితంలో మరచిపోకుండా వుండేట్టుచేసి వెళ్ళాను.... నేనూ మీ అమ్మాయీ ఒకరినొకరు ప్రేమించు కుంటున్నామని నీకు తెలుసు."

"చెప్పకు. మానిపోయిన గాయాన్ని తిరిగి రేపకు. మమ్మల్ని నాశనం చేశావు. దుర్మార్గుడా! ఇంకా చచ్చామో లేదో చూసిపోదామని వచ్చావా?.... నీవు ఎవరికోసం వచ్చావో అది ఏనాడో పోయిందిరా. అదిగో నీతాలూకు పాపం! ఆ పాపం మిగిలింది" అంటూ తాతయ్య వణికి పోతూనే నావైపు వేలెత్తి చూపాడు.

"నన్నింకా మోసం చేయాలని చూస్తా వెందుకు? మీ ముసలి తత్వాలతో మేము నాశనమై పోయాము. ఇంకా ఈ పాపం గూడా నాకు అంటగడతావు దేనికి? తీసుకువెళ్ళి నేను పోషిస్తాననా?"

తాతయ్య ఇక ఆగలేకపోయాడు. వెళ్ళు వెళ్ళమంటూ అతను వెళ్ళేంతవరకు బయటికి నెట్టాడు.

చెట్టుమీది చల్లగాలి బెదురుతూనే నన్ను తాకింది.

"చూశావుగామ్మా. వాడే నిను గన్న తండ్రి. గుర్తుంచుకో. తండ్రికి గూడా నమ్మకంలేని బిడ్డవు."

• • •

ఇల్లంతా చీకటి పరచుకుంది. చీకటి పడిందన్న విషయమే మాకు స్ఫురించలేదు. ఉండుండి ఎందుకో తాతయ్యవంక చూడాలనిపించి తలెత్తితే అంతా చీకటి. అప్పుడు గమనానికొచ్చి, లేచి బుడ్డి వెలిగించాను. నీళ్ళ పడ్డాయేమో దీపం చిటపటలాడుతూ వెలుగలేక, ఆరిపోలేక కొట్టు మిట్టాడుతున్నది. తాతయ్య కళ్ళుమూసుకుని నిశ్చలంగా పడుకుని వున్నాడు. సంజెవేళ అరిచే కీచురాళ్ళ ధ్వని తప్ప మరేమీ వినిపించడం లేదు. దూరాన్నుంచి కుక్క ఏడుపు మాత్రం మధ్య మధ్య చెవిని పడుతున్నది.

ఘోరమైన నిశ్శబ్దం. ఆ నిశ్శబ్దాన్ని చీల్చుకుని మాట్లాడాలంటే నాకు ధైర్యం లేకపోయింది....కాని ఆ దారుణమైన చీకటి, నిశ్శబ్దం గుండెల్ని చీల్చి వేస్తున్నది. అలాగే తల వంచుకుని ఒకసారి నా వైపు చూసుకున్నాను. సబ్బుతో ఉతికిన తెల్లని ఓణీ పాము కుబుసంవలె నన్ను చుట్టుకుంటున్నట్లనిపించింది. అసహ్యంతో ఆ బట్టలన్నీ విడిచిపారేసి మామూలుబట్టలు వేసుకున్నాను.

మనసులో పుట్టిన పుండుకు మోకాటికి మందేస్తే లాభమేమిటి? పెళ్ళికొడుకొస్తున్నాడని కూర్చుంటే కన్నతండ్రి వచ్చి హృదయాన్ని చీల్చి పోయాడు. ఈ లోకంలో ఏస్త్రీ అయినా ఇంతటి దారుణమైన సంఘటన నెదుర్కొని వుంటుందా? తండ్రిని చూసి, అతడే తన భర్త అని ఏ స్త్రీయైనా భ్రమించి వుంటుందా?

"తాతయ్యా! ఇక పెళ్ళిమాట తలపెట్టకు." ఆయన విన్నాడో లేదో గమనించకుండానే మనసులో వున్న మాట అనేశాను. తాతయ్య ప్రక్కకు ఒత్తిగిలి పడుకున్నాడు.

* * *

జీవితంలో అసంతృప్తి అంటూ పుట్టనే కూడదు. ఒకవేళ పుట్టినా మొక్కలోనే తుంచివేయగల ఆశాజనకమైన ఒక తృప్తి నేర్పరచుకోవాలి. లేకుంటే అది అసంతృప్తిగానే వుండిపోక, చిలవలు పలవలేసుకుని అనేక రకాలైన పరిణామాలకు దారి తీస్తుంది. ఈ అసంతృప్తినుంచే ద్వేషం వెలువడుతుంది. ద్వేషాన్ని పోషించి పాలుపోస్తే అది అమానుషత్వం, రాక్షసత్వందాకా ఈడ్చుకెడుతుంది.

నాకు కలిగిన ఈ అసంతృప్తిని ఒక చిన్న చిట్కాతో పోగొట్టుకున్నాను. ఏమంటే పై సంఘటన జరిగిన మరునాడే మా తాతయ్యపేర ఒక ఉత్తరం వచ్చింది. సమయానికి ఆయన ఇంటివద్దలేడు. నేను చించి చదివాను.

"ప్రియమైన మామయ్యకు నమస్కరించి వ్రాయునది.

ఇక ఎన్నటికీ నిన్ను కలుసుకోను. ఈనాడు ఇక్కడుంటే, రేపు ఎక్కడుంటానో నాకే తెలియదు. నా బ్రతుకంతా గాలిబ్రతుకై పోయింది. కారణం నీవే ననుకుంటాను. అయినా అంతా అయిపోయిన తర్వాత, ఇప్పుడు తగాదా లెందుకుగాని, ఆ బిడ్డ నాకు పుట్టినబిడ్డే నంటున్నావు. నీవు యిష్టపడితే వెంటనే నా బిడ్డను నాదగ్గరకు పంపు. రేపటి వరకూ చూస్తా. లేకుంటే ఎవరిదారి వారిదే.

మర్చిపోయా. నీ కొనకోపం నాకు తెలిసే, ముందుగా జాగ్రత్త పడి, మనం సంభాషణలకు దిగక ముందే ఒక వందరూపాయల నోటు నీ ప్రక్క దుప్పటిక్రింద పెట్టాను. తిట్టుకున్నా సరే వాడుకోండి.

ఇట్లు,
రామసుబ్బయ్య."

నిజంగా ఉత్తరం చూశాక నాతండ్రి, తాతయ్య అన్నంత దుర్మార్గుడు కాదనిపించింది. మెడబట్టి గెంటినా నన్నాహ్వానిస్తున్నాడంటే-ఇక నా తండ్రిని చూసి నేను సిగ్గుపడనక్కరలేదు. దానితో మనసు తేలిక పరచుకుని, నాలో కలిగిన అసంతృప్తిని పూర్తిగా తొలిగించుకున్నాను.

తాతయ్య ఇంటికి రాగానే ఉత్తరం వంద రూపాయలనోటు కలిపి చేతి కిచ్చాను.

"నీ యిష్టమమ్మా. వెళ్ళదలచుకుంటే వెళ్ళు"

తాతయ్యను క్రిందినుంచి పైవరకూ పరీక్షించిచూశాను....కడ బట్టిన ప్రాణం. నిన్నటి కంపనం ఇంకనూ చేతి వ్రేళ్లనుంచి దిగనే లేదు....ఇంకెంతకాలం బ్రతగ్గలుగుతాడు? నేను పోయిన వారంరోజుల లోనే పోతే!

"వెళ్లను తాతయ్యా! ఏపరిస్థితులలోను ని న్నొదిలి వెళ్ళను."

తాతయ్య నన్ను తన ప్రక్కనే పడుకోబెట్టుకున్నాడు. తలంతా చేతులతో నిమిరాడు.

ఆ సాయంత్రమే నాన్నకు ఉత్తరం వ్రాశాను.

"తాతయ్య వున్నంతవరకు నే నెక్కడికీ కదలలేను. ఆయన పోగానే నిన్ను వెతుక్కుంటూ వస్తా. ఏమీ అనుకోవద్దు."

  

తిరిగి జీవన గమనం. జీవిక కోసం ఏదో చేయాలి. నాన్న యిచ్చివెళ్ళిన వందరూపాయలతో ఏం చేస్తే లాభముంటుందని ఆలో చించాను. ఆలోచిస్తూ ఆలోచిస్తూ గడిపేస్తే అవి చక్కా ఎగిరిపోతాయి. అందుచేత త్వరలో ఏదో నిర్ణయించుకుని, మార్గం ఏర్పరచుకోవాలను కున్నాను. స్వతంత్రంగా ఆలోచించి చేసే శక్తి వున్నా చిన్నతనాన పైవారి అభిప్రాయాలు కూడా తీసుకునేదాన్ని. ఈ మంచి అలవాటు జీవితాంతం వుంటే కొంత బాగుపడేదాన్నేమో!

ముందు తాతయ్యను కనుక్కున్నాను. ఆపై మరికొందరి అభిప్రా యాలతో కుట్టుపని అన్నివిధాల తగినపనిగా తేలింది. కాని వందరూపా యలతో కుట్టుమిష నెలా వస్తుంది? ముందు ఏ పాతమిషనుతో ప్రారం భించినా పని జరిగిపోతుందని తాతయ్యకు చెప్పాను. ఆయన తిరిగి తిరిగి ఒకబేరం పట్టుకొచ్చాడు. ఎవరో ఒకావిడ ఒక్కత్తే పని చేసుకోలేక వందరూపాయలకు సగభాగ మిస్తానన్నదట. భాగాలు పంపిణీలు నాకు

నచ్చవు. ఈ విషయమై గట్టిగా హెచ్చరించినమీదట, ఎలానైతేనేం తాతయ్య ఒక పాతమిషను బేరంవేసి వచ్చాడు.

మనం నవల్లోనో, నాటకాల్లోనో, మరే సినిమాల్లోనో చూస్తుంటాము. అయిపోయిందదిగో పెళ్ళి. బాజాభజంత్రీలు మ్రోగుతున్నాయి గదా-అనుకున్న పెళ్ళి పుస్తె కట్టబోయే సమయానికి ఛటుక్కున తెగి కూర్చుంటుంది. అష్టకష్టాలుపడి కొనప్రాణంతో ప్రేయసిని చేరుతున్న ప్రియుడు "అమ్మ. ఇక కల్సుకుంటారు" అని సంతోషంతో నిట్టూర్చే సమయానే వాకిటిదాకా వచ్చినవాడు పడి చనిపోతాడు. చాలా అసంబద్ధంగా వున్నదనిపిస్తుంది. నిజమే. వాస్తవికజగత్తులో అది అంతగా సహజమనిపించదు.... స్వీయానుభవంలో చూడనిదే కొందరు ప్రతిదాన్నీ నిరాకరిస్తారు. తమ అనుభవంలోకి రానిదైనాసరే అబద్ధమని, అసంబద్ధమనీ త్రోసివేస్తారు. ఇంత ప్రపంచంలో తామెంత? తమ అనుభవమెంత? అని కూడా యోచించలేరు.

ఇంతా ఎందుకు చెప్పానంటే జీవితం స్థిరపడిపోతున్నదనుకున్న సమయానే హఠాత్తుగా తాతయ్య చనిపోయాడు. కుట్టుమిషనుకు ఇరవై రూపాయలు బయానా యిచ్చి ఇంటికి తిరిగి వచ్చాడు. ఒంట్లో బాగుండలేదని, లంకణం పరమౌషధమంటూ తిండి తినకుండా పడుకున్నాడు. ఎర్రటెండలో తిరిగినమీదట అలసిపోయాడనుకున్నానేగాని అకస్మాత్తుగా ఇలా సంభవిస్తుందనుకోలేదు. ఆనాటి అర్ధరాత్రి ఎవరో పిలుస్తున్నట్లు కలగా అనిపించింది. లేచి కూర్చున్నాను. తాతయ్య ఒకరకమైన గురక పెడుతున్నాడు. దీపంకూడా కొండెక్కిపోయింది. లేచి దీపం వెలిగించి తాతయ్య మంచందగ్గరకు వెళ్ళాను. కళ్ళు విప్పి చూశాడు. పాలిపోయిన కండ్లలో జీవంలేదు. కూర్చోమని సైగ చేశాడు. కూర్చున్నాను. కొద్దిసేపటివరకు మాట పెగిలిరాలేదు. ఎలుక గీరినట్లు సన్నని గురకమాత్రం వినవస్తున్నది. అతి ప్రయత్నంమీద తాతయ్య మాటాడ్డం ప్రారంభించాడు.

"అమ్మా సుబ్బులూ! ఒకనాడు నేను ఒంటిగా కూచుని ఏడుస్తుంటే నువ్వు అడిగావు, ఎందుకు తాతయ్యా ఏడుస్తున్నావని. నువ్వూ కంటనీరు పెట్టుకున్నావు.... ఇప్పుడు చెపుతున్నాను తల్లీ! నువ్వు పెద్దదానివైనావు

గనుక ఇక చెప్పొచ్చు. వినమ్మా విను. నేను కుంటివాడ్నిగా ఎందుకైనా ననుకుంటావు?"

ఇంటివెనుక చెరువులోంచి కప్పల బెకబెకలు వినిపిస్తున్నవి. కొద్ది తడవు నిశ్శబ్దం వహించిన తాతయ్య మళ్ళీ మాటాడ్డం మొదలెట్టాడు.

"నే నప్పుడు రామచంద్రపురంలో ఒక ధనవంతుల ఇంటిలో జీతానికుంటున్నాను. నేను పుట్టిందీ అక్కడే. మా అయ్య మాట్లాడి నన్నా యింట్లో జీతానికి కుదిర్చాడు. తొమ్మిదోఏటనుండి నేనా యింటిలో పనిచేస్తూ ఏపుగా పెరిగాను. తలిదండ్రులనుంచి వచ్చిన అందం ఆ పోషణలో వన్నెకెక్కింది. ఒకనాటిరాత్రి గొడ్లకు రెండోమాటుకూడా మేత వేసి, ఆ గొడ్ల చావడిలోనే గడ్డివేసుకు పడుకున్నాను. మంచి నిద్రలో వుండగా ఎవరో నా ప్రక్కనే పడుకుని నడుమ్మీద చేయివేసి బలవంతంగా నన్ను తిప్పుకుంటున్నారు. పగిలిపోయిన ఒక గాజుముక్క నా నడుమున గుచ్చుకుంది. కళ్ళు నులుపుకుని చూశాను. "అమ్మగారూ!" అనే మాటలు ఆశ్చర్యంతో నా నోటినుండి వెలువడ్డాయి. సుకుమారమైన చేతితో అమ్మగారు నా నోరు మూసింది.... నా కిక నిద్రపట్టలేదు.... రేపు ఏమవుతుందన్న ఆలోచనే.... ఊరొదలి పారిపోదా మనుకున్నాను. కాని ఉదయం లేస్తూనే అమ్మగారు కనిపించి "భయపడకు. ఎవరికీ తెలియనివ్వను" అని చిన్న నవ్వు నవ్వి వెళ్ళిపోయింది.... ఈనాడు తెలియకుంటే ఏనాటికైనా తెలియక దాగుతుందా అని దొంగమొహంతో బిక్కుబిక్కు మంటూనే గడిపాను. ప్రతి ఆదివారం అమ్మగారొచ్చి నన్ను లేపేది, కొంతకాలమయ్యాక రోజు విడిచి రోజు రావడం మొదలు పెట్టింది. ఒకసారి కోపమొచ్చి "ఇకనేం వీలుపడదు. మధ్య మీరు బాగానే వుంటారుగాని తెలిస్తే మా కొంప లంటుకుంటాయి. వెళ్ళిపోండమ్మగారూ, నేరాను" అని మొండికెత్తాను. బుజ్జగించింది; బ్రతిమాలింది. నేను వినలేదు. చివరికామె మండిపోయి "ఏం చేస్తానో తెలుసా? ఇప్పుడు కేకవేశానంటే అందరూ లేచి నిన్ను చితకపొడుస్తారు" అని బెదిరించి నన్ను లొంగదీసుకుంది.... వెనుక నుయ్యి ముందు గొయ్యి. తన్నుకులాడిపోయాను.... కాని పాపమెంతకాలం దాగుతుంది? ఒకనాడు గొడ్ల చావిడిలోనే మేము ఉండగా మా పైని పట్టపగల్లాంటి వెలుతురు

పడింది. నలుగురు జీతగాళ్ళు నన్ను రెక్కలు విరిచి పట్టుకున్నారు.
నోటికి గుడ్డ కట్టేయమన్నాడు యజమానిగారు. కట్టి నన్నొక స్తంభానికి
బిగించారు. జీతగాళ్ళ నవతలకి పిల్చి యజమాని ఏమేమో మాట్లాడాడు.
అప్పటికప్పుడు బండి సిద్ధం చేయబడింది. నన్నందులో పడేసి ఎడ్ల నది
లించారు. బండి ఎక్కడికి పోతుందో, నన్నేమి చేయ సంకల్పించారో
నా కేమీ అంతుపట్టలేదు. ఒక గంట నడచిన బండి ఒక్క కుదుపుతో
ఆగిపోయింది. ఇద్దరు మనుషులు పట్టి నన్ను బండిలోంచి క్రిందకు
దొర్లించారు. నడుములు కదబడ్డాయి. నలుగురూ నన్ను మోసుకుని నీళ్ళ
లోంచి నడుస్తున్నారు. మధ్యకు తీసుకెళ్ళి వాగులో పడుతారేమో నను
కున్నాగాని అదికాదు. ఊబి తగిలినంత వరకు నడిచి, నన్ను పైకి ఎగ
రేశారు. అసలే సర్వావయవాలు బంధింపబడి వున్నాయి. ఊబిలో
కూరుకు పోతున్నాను. అంత ఊబిలో కూడా ఒకడు నాపైకెక్కి తొక్క
తున్నాడు. ఎగిరెగిరి తొక్కారు. వంతులేసుకుని చచ్చి వుంటాడన్నంత
వరకు తొక్కారు. నిజంగా నేను బ్రతికి బయటపడతా ననుకోలేదు.
కండలుబ్బిన వయసుప్రాయం గనుక కుంటికాలితో బయటపడ్డాను.... ఇక
ఆ వూరు చూసేందుకే మొహం చెల్లలేదు. ఎటు దారి కనిపిస్తే అటువైపు
నడిచాను.... చివరకు ఈ వూరుచేరి జవాను ఉద్యోగం సంపాదించుకుని,
ఇంటికి ఉత్తరం వేశాను.... అక్కడెవరుంటారు? మా అమ్మా అయ్యను
గూడా ఆ వూరినుంచి తరిమేశారట. వెతికాను;- తెలిసినవా రందరినీ
అడిగాను. కాని నాజన్మలో తిరిగి వాళ్ళను చూడలేకపోయాను. ఎక్కడ రాలి
పోయారో పోయారు. ఇంత జరిగీ, అమ్మగారు నన్ను వదిలిపెట్టలేదు.
ఎలా తెలిసిందో ఏమో ఇక్కడికి నాపేర ఒక వందరూపాయలు మని
యార్డరు పంపించారు. నేను తిరగ్గొట్టేశాను. ఇంకో నెల పోయిన తరు
వాత మళ్ళీ వంద రూపాయలొచ్చాయి. అప్పుడు నేను నా పెళ్ళి సందడిలో
వున్నాను. ఏదో అక్కరకొస్తాయి లెమ్మని ఆశించి చేయిజాచాను....
అప్పటినుంచి పన్నెండేండ్లవరకు ప్రతి నెలా ఎంతో కొంత మొత్తం
పంపిస్తూనే వుండేది. ఒకనాడు రిజిస్టరు కవరొకటి వచ్చింది. విప్పి
చూశాను. ఒక ఫొటో, యాభై రూపాయలూ, చిన్న చీటీ కనిపించాయి.

ఆతురతతో చీటీ చదివాను. వానాకాలం చదువు గనుక ఆ జిలుగురాత సరిగా అర్థం కాలేదు. అయినా మళ్ళీ మళ్ళీ చదివాను.

"ఈ ఫొటోలో కనుపించేది నీ కుమారుడే. వాళ్ళ తండ్రిగా చెలామణి అవుతున్న మా ఆయన సరిగా వాడ్ని దగ్గరకే తీయడు. వీలుంటే ఒకసారి చూసివెళ్ళు. నిన్ను మరచిపోలేను"

అని వ్రాసింది అమ్మగారు....... నిజంగా ఎప్పుడైనా వెళ్ళి చూద్దామా? బిడ్డ నొక్కసారి ముద్దుపెట్టుకుని వద్దామా? అనిపించేది.... అంతలోనే ప్రతినెలా వచ్చే పైకం ఆగిపోయింది. చాలా కాలానికి ఆ వూరివారెవరో కనిపించి అమ్మగారు చనిపోయిందనీ, ఏదో పెద్ద వ్యాపారం పెట్టుకుని అయనగారు పట్నానికి తరలిపోయారనీ చెప్పారు. చేసిన ద్రోహానికి మీ తండ్రి నీ కెలా వందరూపాయ లిచ్చివెళ్ళాడో, ఆ యమ్మగారుకూడా నా కలాగే పంపింది. తాము చేసిన మోసానికి ఈ దగా ఎత్తు ఎత్తుతారు. కండ్లనీరు తుడిస్తే మనం క్షమిస్తామని ఈ ఎరవేసి మనల్ని వంచిస్తారు........ నా తలిదండ్రులు దిక్కులేకుండా ఏ చెట్టు క్రిందో, ఏ పుట్టక్రిందో కనీసం బిడ్డను చూసేందుకైనా నోచుకోక పోవడానికి కారకు లెవరు? కాలు విరిగి ఊరూరు తిరుగుతూ బిచ్చమెత్తుకునే గతి నాకు పట్టించిం దెవరు? నే నా దినమే అంతమైపోయివుంటే అందుకు బాధ్యు లెవరు?.... నీ తల్లి పెళ్ళి కాకుండానే నిన్ను కని, లోకానికి ముఖం చూపలేక చనిపోయిం దెందుకు? ఎవరు కారణం?"

  

నా ఆవేశం తాతయ్య చితివలె మండుతున్నది. ఆ మంటలారినా గుండె మంట లారలేదు. ఎన్నటికీ ఆరవేమో?

మిగిలిన ఎనభై రూపాయలు చావు సంతర్పణలకే ఖర్చు చేశాను. నా చేతిలో చిల్లిగవ్వ లేదన్న భయంగాని, నా కిక ఎవరూ లేరన్న శంకగాని నాలో తలెత్తలేదు. తాతయ్య కడపటి మాటలే నా గుండె మంటలై నన్ను నడిపిస్తాయి.

పిండాకూడు తినడానికొచ్చిన పెద్దలు నన్నుచూసి విస్తుపోతున్నారు. నాకు వినబడేలా ఒక అమ్మ అననే అంది: "అదేమి విడ్డూర

మన్నమ్మా! తాతయ్య చచ్చాడన్న దిగులైనా లేదు?...." విరుచుకు పడదా మనుకున్నాగాని ఎందుకులెమ్మని సంబాళించుకున్నాను. హృదయంలో ద్వేషాగ్నులు మండుతుంటే కంటివెంట కన్నీరు కారుతుందా?.... ఏనాటి కైనా నా కండ్లు రక్తాన్ని ఓడ్చవలసివుంది. ఆ దిన మెప్పుడు వస్తుందో మహాదినం!

తాతయ్య నా కొప్పగించి వెళ్ళిన కార్యమేమీ చిన్నదికాదు. లోకాన్నే పగబట్టాలంటే ఒక అందమైన ఆడపిల్లకు సాధ్యమయ్యే పనేనా? ఎంత శక్తి కావాలి? శక్తివంతు లెందరు ఈ లోకపు టిరుసులో పడి తల ముక్కలు చేసుకోలేదు?.... ఏమిటి సాధనం? ఎందుకొచ్చిం దని, అన్నింటినీ మరచిపోయి కళ్ళు మూసుకుంటే వెళ్ళిపోదా?........ అన్యాయాన్ని రెండుచేతులా తిన్నదానివి, నీవే ఎదిరించకపోతే నీ కెవ రైనా వకాల్తా పడతారనుకున్నావా?.... లేదు లేదు.... నేను చేయగలిగి నంతా చేస్తాను.... నాశనం చేస్తాను.

"ఓసి పిచ్చిపిల్లా! అన్యాయ మన్యాయమని గుండెలు బాదు కుంటావుగాని, నీ కొకత్తెకే అన్యాయం జరిగిందా? లోకంలో నిన్ను మించి దగా పడినవా రెందరు లేరు? వారంతాఎందుకు చేతులు చచ్చి వూరుకున్నారు ? .. ...." వారంతా వూరుకోబట్టే యీ అన్యాయం నాదాకా ప్రాకి వచ్చింది. నేనూ భయపడి వూరుకుంటే, రేపు నా బిడ్డలు బిడ్డల బిడ్డలు అంతా దీని పాలిట పడతారు....నేనీ ప్రయ త్నంలో నాశనమైపోయినా విచారించను. సంతోషంతో స్వీకరిస్తాను.

"కొందరిని నీ కందినంతవరకు నాశనంచేస్తా వనుకో! దానితో లోకమే నాశనమై పోతుందా?లోకంలోవున్న అన్యాయాన్నంతా నీ రెండు చేతులతోనే తుడిచివేయ గలుగుతావా? ...బ్రతుకులో శాంతిలేకుండా నీవు సాధించేదేమిటి?"

పెళ్ళి చేసుకుని నలుగురి బిడ్డల్ని కని పడేసి, వారిపాపాన వారిని వదలిపెడితేనే శాంతి లభించినట్లా?అలాంటి శాంతి నా కవసరంలేదు.... ఎదురు తిరుగుతాను. ఈ లోకపు టన్యాయానికి తూట్లుపొడిచి, కృశించి

నశించిపోయేలా చేస్తాను. నా సర్వశక్తులను దీనికై ధారవోస్తాను. అంతే వెనుదిరిగేది లేదు.

♦ ♦ ♦

"బులావ్" అంటే నా పాదాలను తాకి ముద్దు పెట్టుకునేవారున్నారు. మావార్డు మునిసిపల్ కౌన్సిలరు ఆరు మాసాలక్రితమే ఒక ముసలిముండతో నన్నడిగించాడు. వాడ్నీ, ఆ ముసలినీ పుచ్చిపోయేలా తిట్టిపోశాను. వాడేమిటి? ఒక్క నవ్వు విసిరితే ఎందరు నా పాదాల కడకు రారు?....ఆడపిల్ల కనుపిస్తేనే అదెంత అందవికారంగావున్నా, దానివైపే చూస్తూ మనిషిని మనిషి ఢీకొనేవారు, సైకిల్తుచేత మోచేత్తో పొడిపించుకునేవారు, కారు డ్రైవరుచేత నెట్టించుకునేవారు కోకొల్లలు. అటువంటప్పుడు, కావాలని నేనే కోరి కవ్వించితే, ఏపాము బుట్టలోకి రాకుండా పోతుంది?—

అయితే రేపటినుంచి ఇదే కార్యక్రమమా? కాదు. ముందుగా ఆ మునిసిపల్ కౌన్సిలరును జోకొట్టి తిరిగి చదువు ప్రారంభిస్తాను. బి. ఏ. ఏమిటి ఎం. ఏ. పూర్తి చేస్తాను. ఆ చదువుకునే కాలంలో ఎందరినో ఆడించి, వారి చదువులూ సంస్కారాలను చట్టుబండలు చేస్తాను. ఆస్తి పాస్తులను మంటపెట్టిస్తాను. నా చుట్టూ తిరిగి తైతక్కలాడే తోలు బొమ్మలను చేస్తాను.

కౌన్సిలరును కలుసుకోక ముందే కొంత తర్ఫీదు తినవలసివుంది. ఏమంటే—ఇంతవరకూ నే నెవరినీ ప్రేమించి ఎరుగను. ప్రేమ ఎలా వుంటుందో, ఎలామాటాడిస్తుందో, ఏమేమి చేయిస్తుందో తెలియదు. అప్పు డప్పుడు సినిమాలలో చూడటమేగాని ఆ సినిమాప్రేమ మనకు వెగటుతోస్తుంది. కాబట్టి ఏమిటి చేయటం?....ప్రస్తుతానికి ప్రేమ నటించడం నేర్చుకోవాలి....వయసులోనున్న ఆడదానికి ప్రేమ తెలియక పోవడమేమిటని అనుకోవచ్చు. కాని వయసులో వున్నా, మనసులో ప్రేమ వుంటేనేగాని అది పుట్ట దనుకుంటాను.

మరునాడే చీకటిపడిన తర్వాత, "రాయల్ హోటల్" చేరాను. రాయల్ హోటల్ స్టేషనుకు దగ్గరలోనున్న పెద్ద భవనం. మూడంత

స్థులలోను మూడు రకాలైన వ్యాపారాలు సాగుతుంటాయి. క్రింద కాఫీ ఫలహారాలు, పై అంతస్థులో భోజనం; మూడో అంతస్థులో పడకా మున్నగు సదుపాయాలు.

రిక్షాలోంచి దిగగానే హోటలుముందే ముక్కాలిపీటలా ముడుచుకు కూర్చున్న ఒకతను అదోరకంగా చూశాడు. సరాసరి నేను ఫలహారాలశాలలోనికి వెళ్ళాను. అక్కడ స్థితిగతులేమిటో, ఎలావుంటాయో తెలియదుగదా! బల్లదగ్గర కూర్చుని డబ్బువసూలు చేసుకుంటున్న స్ఫోటకం మచ్చలవాడు ఎగాదిగా చూస్తున్నాడు. నేనలాగే నిలబడ్డాను. ఒక కుర్రవాడొచ్చి ఏమి కావాలన్నాడు. నోరుజారి భోజనం అనేశాను. బయలుదేరి వచ్చేముందే భోజనం చేసి వచ్చానుగదా!

"ఇక్కడ కాదండి. పైకి వెళ్ళండి. సెకండ్ స్టేర్"

"దారి చూపించరా.... ఇలా రండిలారండి. నే చూపుతాను" అని స్ఫోటకం ముఖంవాడు లేచి నాకు దారిచూపించాడు. నేను మెట్లెక్కుతుండగా 'థాంక్స్' అని అతనే అన్నాడు. ఈ నవనాగరిక లక్షణాలు ఇంకా మన కలవడలేదని అప్పుడు గ్రహించాను.

తీరా యిక్కడికి కొచ్చి భోంచేయకపోతే బావుండదు. తిరిగి కాఫీ చాలునని క్రిందికి దిగితే అనుమానించబోతారేమో? ఏం చేసేట్టురా భగవంతుడా అనుకుంటూ 'సరే. ఒక భోజనం పట్రా నాయనా' అన్నాను లోలోన తిట్టుకుంటూనే. రిక్షా చార్జీలకని నేను తెచ్చిందే ఒక్కరూపాయి. ఒక చార్జీపోతే ఇక మిగిలింది పదమూడణాలు మాత్రమే.

భోజనం వడ్డించే కుర్రాడితో ఏదో ఉబుసుపోకకు అడిగినట్లు మెల్లిగా అడిగాను. "భోజనం ఎంతబాబు?"

"పెరుగుతో పధ్నాలుగణాలు; మజ్జిగతోనైతే ముప్పావలా"

రక్షించావు తండ్రీ అనుకుంటూ 'మజ్జిగ చాలు బాబూ' అన్నాను.

రకరకాల కూరలేవో వడ్డించారు. గంటక్రితమే భోంచేసి వచ్చిన దాన్ని ఇప్పు డేమి తినేది? మూడుపావలాలు ముట్టచెప్పుకుంటూ తినకపోతే దండుగ పడతామని కొద్దికొద్దిగా పట్టించాను. ఎక్కడెక్కిచస్తుంది? కలిపిన అన్నమంతా ఒక ప్రక్కకు నెట్టివేస్తూ "చాలుగాని

ఇక మజ్జిగ పట్రా" అని మొహం చిట్లించుకుని అనేసరికి వడ్డనచేసే కుర్రాడు వింత మృగాన్ని చూచినట్లు చూశాడు.

"ఏమమ్మగారూ! బాగోలేదా?"

"సరేలే మజ్జిగ పట్రా!" సమాధానం చెప్పకుండానే అనేశాను.

అతను బిత్తరపోయి ఒక గ్లాసునిండా. మజ్జిగ పట్టుకొచ్చాడు.

"ఏయ్ కుర్రాడా! ఇలారా. ఈ మజ్జిగ తాగేందుకేనా?"

"అందుకే పెరుగు వేయించుకోండమ్మగారు"

"మజ్జిగ ఇలా తగలడ్డట్టున్నాయి. ఇక పెరుగు" అని లేచి వెళ్ళి చేయి కడుక్కున్నాను.

చేయి కడుక్కుంటుంటే అక్కడ భోజనంచేసే నలుగురూ నా వైపే చూస్తున్నారు. ఒకతని మొహంలో కొంత సిగ్గుకూడా తొంగి చూస్తున్నది....ఆవిడకు పనికిరాని భోజనం మనం తింటున్నామే అని వెలవెల బోతున్నాడు.పాపం! నా స్థితి వారికేంతెలుసు? నేనేదో గొప్పింటి బిడ్డననీ, ఇలాంటి చౌకబారు భోజనం మాయింట కుక్కలుగూడా గతకవు కామోసుననీ వారనుకుని వుండవచ్చు.

ఠీవి ఉట్టిపడేలా నడచి క్రిందికి తిరిగివచ్చాను. బల్లపై డబ్బుపెడు తుండగానే వడ్డన కుర్రాడు వచ్చి "తీసుకోకండిసార్! అమ్మగారేం భోం చేయలేదు. అంతా వదిలేశారు" అన్నాడు.

నాకు నవ్వు వచ్చింది. "ఫరవాలేదు-తీసుకోండి. మీరు దండగ పడ్డందేనికి?" అన్నాను.

"నో. థాంక్స్" అని స్ఫోటకంవాడు డబ్బు తీసి నా చేతిలో వుంచాడు.

"సరే, పోనివ్వండి. మీ హోటల్లో మంచి వసతేనా వున్నదా?"

"లేకేమండి. కావాలంటే మీకు మంచిగది ఏర్పాటు చేయిస్తాను. ఒరేయ్! రాములూ!" అప్పటికప్పుడే కేకలు పెడుతున్నాడు.

"అక్కరలేదులెండి. నేనే వెళ్ళి అసలు గదులెలా వున్నాయో, గాలేమైనా వస్తుందో లేదో చూసివస్తాను."

అతని సమాధానం వినకుండానే మెట్లవైపు దౌడు తీశాను. మూడవ అంతస్థు మొదట్లోనే అడా మగాకాని ఒక మానవాకారం లేచి నిలబడి

"రండి రండి" అన్నది. ఆవేషానికీ, చొరవకూ నాకు నవ్వువచ్చి "వస్తున్నానుగా" అన్నాను.

"నాకిక్కడి గదులన్నీచూపెట్టాలి, మంచి గదిచూసి తీసుకుంటాను" అనగానే వరుసగా గదులన్నీ తిప్పి చూపించింది. అప్పటికీ తొంగి తొంగి చూస్తూ కనిపెడుతూనే వున్నాను. కాని మనకు కావలసిం దెక్కడా కనుపించలేదు. ఇక ఇలా లాభంలేదని ఆమెనో (అతన్నో) కొంచెం మచ్చికచేసుకోవాలనుకున్నాను.

"క్రిందికి వెళ్ళి రెండు కిళ్లీలు పట్టుకొస్తావా?"

డబ్బు తీసుకోకుండానే గబగబా ఆమె మెట్లు దిగిపోయింది.

నా కంతా వింతగానే వుం దీ వాతావరణం.

రెండు నిముషాలలో కిళ్ళీలతో ప్రత్యక్షమై "ఈ గది నీకు నచ్చిందా?" అన్నది.

క్రింది ఫలహారాలశాల నుండి సన్నని సంగీతం వినవస్తున్నది. కొంచె మటు చెవిపారేసి "సరే చెపుతాను కూర్చో" అన్నాను.

ఒక కిళ్ళీ నేను నములుతూ, రెండోది ఆమె కిచ్చాను. అక్కరలే దంటూనే అందుకుని నోట కుక్కుకుంది.

"నీ పేరేమిటోగాని నాకు బాగా నచ్చావు" అని మొదలేశాను. ఆమె కొంచెం కులుకుపోయింది. ఇంకొంచెం దగ్గరకు రమ్మని పిలచి "ఇక్కడ వ్యాపారం లేదా?" అని మెల్లిగా అడిగాను.

"అదీ. నాకు తెలుసు. నాకన్నీ గమనమే." మరికొంచెం విరుచుకున్నది.

నాకు చిరుకోప మొచ్చినా తొక్కి పట్టాను.

"అట్టా దారికొచ్చిరా. నే నప్పుడే అనుకోలా.... అయితే నాతో రా."

నేనా మానవాకారాన్ని వెంబడించాను, మూడో అంతస్థులోనే మరో ముఖద్వారంనుంచి వెనుక గదుల్లోకి వెళ్ళాము. గాజుల గలగలలు చెవి సోకుతున్నాయి.

నన్నొక గదిలోకి తీసుకెళ్ళి "ఇది స్టోర్ రూమ్. ఇక్కడ కూచో" అన్నది. ఆ గదిలో కూర్చునేందుకైనా ఏమీ లేవు. ఒకమూల విడిచిన చీరె, చిరిగిపోయిన చాప, రెండు గోతాము పట్టాలున్నాయి.

మా అలికిడి వినడంతోనే లోపలి గదిలోంచి ముగ్గు రమ్మాయిలు బయటి కొచ్చారు, ఆ ముగ్గు రమ్మాయిలలో ఒకావిడ సగం చెల్లిన ముసలమ్మ. ధరించిన దుస్తులు మాత్రం పాలు గుడిచే పిల్లలు వేసుకు నేవిలా వున్నాయి. నన్ను చూడ్డంతోనే ఆ సగం చెల్లిన అమ్మాయి చిన్న నవ్వు నవ్వింది. మిగతా యిద్దరూ కండ్లప్పగించి చూస్తున్నారు.

"ఇక్క డెక్కడ కూర్చోవాలి?" అన్నాను.

మన గదిలో కూచుందాం రా" నా చేయి పట్టుకుని ముద్దుగా లాక్కెళ్ళిం దా ముసలావిడ. నలుగురం లోపలి గదిలోనికి వెళ్ళాము.

ఆగదిలో ఒకే ఒక మంచం. అదయినా పనికిరాకపోతే వీళ్ళ ముఖాన పారవేశా రన్నట్లుంది. చిన్న కొవ్వొత్తిలాంటి విద్యుద్దీపం గోడ కొకమూలన వెలుగుతోంది. బయటకి చూస్తే పట్టపగల్లా వెలిగి పోతున్న హోటలు. ఈ గదికింత అన్యాయ మెందుకు చేసిందో ఊహించ లేము. నేనూ, ముసలమ్మాయీ మంచంమీద కూర్చున్నాము. ఆడపిల్ల లిద్దరు నిలబడే నన్ను తనవితీరా చూస్తున్నారు.

"ఏ ఊరమ్మా? పేరేమిటి?" నా గాజులు సవరిస్తూ ప్రశ్నించింది ముసలమ్మాయి.

"నేనొక మహిళాశాఖలో పనిచేసే రచయిత్రిని. మన స్త్రీ జాతి ఇంతటి నికృష్ట స్థితిలో పడిపోకూడదని మా మహిళా మండలి విశ్వాసం .... .... వ్యభిచార స్త్రీల పరిస్థితులు ఆకళింపు చేసుకుని, ఒక పెద్ద గ్రంథం వ్రాయాలని మా తలంపు. అందుకే ప్రత్యక్షంగా చూతామని బయలుదేరి వచ్చాను" అని ముగించాను.

ముసలమ్మాయి కళ్ళు అదో రకంగా ఆడినాయి.

"మగవాళ్ళయిపోయారు. ఇక ఆడదానివి బయలుదేరావన్న మాట! సిగ్గులేని ముండా! పో బయటికి" అని నా చేతిని విసరికొట్టింది.

నే నెంతో ఆశ్చర్యపోయాను. అలా నాటకమాడితే తమ కష్ట సుఖాలు వెళ్ళబోసుకుంటారనీ, కళ్ళారా చూడమని పిలుస్తారనీ తలచాను. కాని కథ అడ్డం తిరిగింది.

"రాస్తాం, రాస్తామని కొమ్ములు తిరిగిన మగవాళ్ళు మాకాడికి చాలామంది వచ్చారు. ఎప్పుడూ వచ్చి పోతూనే వుంటారు. ఏమి రాస్తారో, చేస్తారోగాని డబ్బు లేకుండా మమ్మల్ని వాడుకుని పోతుంటారు.... మరీ ఒకడున్నాడు కునిష్టి సచ్చినాడు! వాడేమి రాస్తాడో మరి, ఇవ్వాళో రేపో వచ్చేట్టుంటాడు. అయినా ఆడపిల్లలుమాత్రం కావాలి వాడికి. వారానికోసారి వచ్చి "చూశావా నీ కథ రాశాను" అని ఒక చెత్త కాగితం చూపెడతాడు. "మీ జీవన మెంత దౌర్భాగ్యం?" అని ఆడ ముండలా ఏడుస్తూనే, దేన్నో వాటేసుకుంటాడు.... రెండు నిమిషాలు కాగానే ఎవరితో చెప్పకుండా పప్పులా జారిపోతాడు.... మా పాడు ముండలూ అంతే. వాడ్ని మాటి మాటికి రానిస్తుంటారు.... మా కథ అల్లవూ అని గిల్లుతుంటారు" మాటాడుతున్న ముసలమ్మాయి ఆగి పోయింది.

"ఇంకేమిటి? ఇంకేమిటి? ఇంకేం చేస్తారు?" అన్నాను.

ఆమె సమాధానం చెప్పలేదు.

"తల్లీ! మా కోసం మీరేమీ రాయనక్కరలేదు. మా బ్రతుకేదో మేము బ్రతుకుతాము.... అసలు మీరు రాసినా మాకు జరిగేదేమున్నది? మా జీవిత మేమన్నా బాగుపడబోయిందా?.... అమ్మా! దయవుంచి దిగి వెళ్ళు" అంటుండగానే స్ఫోటకం మచ్చలవాడు రానేవచ్చాడు. ఏదో సైగచేశా డనిపించింది. ఆడపిల్ల లిద్దరూ బొమ్మలవలె నడచిపోయారు. ముసలావిడ మాత్రం నా చేయిపట్టుకొని, కదలక నిల్చున్నది.

"ఊఁ" అన్నాడు స్ఫోటకంవాడు.

"కాదు" అన్నది ముసలమ్మ,

అంటూనే బరబరా నన్ను బయటికి లాక్కొచ్చి "వెళ్ళిపో, తొందరగా దిగిపో" అని మెట్లమీదనుంచి పడతానేమోనన్న అనుమాన

మన్నా లేకుండా నన్ను నెట్టింది. ఆలోచించేందుకుకూడా అవకాశం లేదు. రెండు....మూడు మెట్లకో అడుగుచొప్పున ఉరికి బయట పడ్డాను.

కనుచూపుమేరలో రిక్షాఅయినా కనుపించిందిగాదు. ఒక పోలీసు జవాను ఎక్కడనుంచి వచ్చాడో వచ్చి, ఎవరు నీవని గద్దించాడు. భయం వేసినా గట్టిగా సమాధానం చెప్పాను.

"హు ఆర్ యు ఫూల్? వై డు యు ఫామిలీన్ ఎబౌట్ రెస్పెక్టెడ్ ఫిమేల్స్? ఏయ్ రిక్షా! ఆగు ఆగు" అని రిక్షాలో పడ్డాను.

♦ ♦ ♦

ఇంటికొచ్చినా భయం తగ్గలేదు. స్నానంచేసి బట్టలు మార్చు కున్నా శరీరమింకా ఉడికిపోతూనే వుంది.

వెధవ స్వభావం. ఎప్పుడో ఈ తొందరపాటు నన్ను ముంచు తుంది. లేకుంటే ఏమైనా అర్థముందా? ప్రేమించడం నేర్చుకోవడ మేమిటి నా తలకాయ! అయినా ప్రేమ పాఠాలకు రాయల్ హోటలే దొరికిందా? తెలివిగలదాన్ననుకుంటే, నా తెలివిలా తగలడిపోతున్నది.... అక్కడా మచ్చలవాడు పట్టుకుంటే ఏమయ్యేది? ముసలిముండ ధైర్యం చేసి తప్పించిందిగాని లేకుంటే తిరిగి యిల్లు చేరేదాన్నా?....ఆ పోలీసువాడితో గట్టిగా రెండు ఇంగ్లీషు ముక్కలు అనబట్టి సరి పోయిందిగాని, తల్లిభాషలోనే నసిగినట్లయితే ఆగమని రెక్క పట్టుకునే వాడు కాదా!

ఏమైనా ఈవేళ లేచినరోజు మంచిదైపోయింది.

పెద్ద గండం తప్పించుకున్నాను. ఇలాంటి బుద్ధితక్కువ పనులు ఎన్నటికీ చెయకూడదని రెండులెంపలూ వాయించుకున్నాను.

అయినా నిద్రపట్టదే?.... ఆ సముసలమ్మాయే కండ్లలో కొస్తున్నది. ముద్దుగా చిన్నపిల్లకు తొడిగినట్లు బారుచేతుల చొక్కా బారులాగూ తొడుక్కున్నది. అలాంటి దుస్తులు వేసుకోవడం ఆమెకిష్టమా? లేకుంటే ఏటులకోసంగాను ఆలా అలంకరించుకోవాలా?... జీవిత మంటే విసిగి

వేసారిపోయినట్లు ఆ కండ్లూ, కనుబొమలే చెపుతున్నాయి—మీ గూర్చి బ్రాస్తానంటే ఎంత మండిపడింది? అంటే తనకెవరూ సాయం చేసే వారు లేరనేగా? మనుషులపై నమ్మకంపోయినా, ఇంకనూ వారిలో మాన వత్వం మాసిపోలేదే? మానవత్వమే మంటగలసివుంటే శీలంతో నే నింటికి చేరే దాన్నేనా?....వాడు-వాడా మచ్చల మొహంవాడు ఆమె నేం చేస్తాడో?.... చూడు. పైకెలా నవ్వుతూ కనబడతాడో దుర్మార్గుడు! ఆ నవ్వు వెనుక ఎంత విషం దాగివున్నదో వెలుతురులో కనుపించదుగదా! అవును. దొంగను దొంగే పట్టుకోవాలని, చీకటిలోగాని గోచరించ వా తెరవెనుక గుణాలు.... వెధవ! డబ్బిచ్చేప్పుడు చేతితో నొక్కాడు కూడాను.

నిద్రపట్టక మంచంలో పడుకనే నెమరువేస్తున్నాను. మా యింటి ముందు, తడిక దగ్గరగానే దగ్గు వినిపించింది.

"ఎవరు? దగ్గు బ్రహ్మన్నా?"

"అవునమ్మా! నేనే. దగ్గుతో నిదరపట్టక కొంచెం గాలి కొచ్చాను.... అవునుగాని ఇప్పు డొచ్చావు, ఎక్కడినుంచమ్మా?"

"సినీమా కెళ్ళాను."

"సినిమా కెడితే స్నానం చేయడమెందుకు"?

నేను స్నానం చేస్తే వీడికేం? సందెహార్చుకుంటే వీడికేం చెప్పండి? ప్రొద్దస్తమానం వీడికిదే ఉద్యోగం. ఆ దగ్గుతో చచ్చేవాడు చావక, వాళ్లేం చేస్తున్నారు, వీళ్లేం చేస్తున్నారు, వాడిపెళ్లాం ఎవరితో కులుకుతోంది. వీడు దేన్ని పెట్టుకున్నాడని ఆరాలుతీయడమే వీడికి కావాలి. కాని వాడింట్లో కథ మాత్రం వాడికి తెలియదు.... మొన్న వెంక టేశు నడిబజారులో పట్టుకుని నాలుగు తన్నినా వీడికింకా బుద్ధి వచ్చింది కాదు.

మండుకొచ్చి "ఏమీలేదు. మీ ఆవిడా నేనూ అలా అలా తిరిగి కొంచెం గాలి మేసివచ్చాము. అంతే. పోయి పడుకో వెధవా" అని గట్టిగా పెట్టాను.

పాపం మానవుడు మారుమాటాడకుండా జారిపోయాడు.

ఏమైనాగాని మనం నిర్ణయించుకున్న కార్యరంగానికి ఈ ప్రదేశ మంత అనువైనదికాదు. వాడితోను వీడితోను కలిసి నాటకాలాడు తుంటే, ఈ దగ్గు బ్రహ్మన్నగాడు ఊరంతా చాటించివస్తాడు. ఎంత వీలయితే అంత త్వరలో కౌన్సిలర్ వ్యవహారమేమిటో తేల్చుకుని, మకాం మరోచోటికి మార్చాలని అనుకుంటూ నిద్రపోయాను.

  

మా వార్డు కౌన్సిలర్ బాగా బ్రతికిన కుటుంబములోంచి వచ్చిన వ్యక్తి. చనిపోయేవరకు వాళ్ళ చిననాన్నే మా వార్డు కౌన్సిలరుగా వుంటుండేవాడు, ఆయనపోగానే, గుత్తకు తీసుకున్నట్లుగా ఆ పదవిని ఈయ నలంకరించుకున్నాడు. రాజకీయా లేమీ లేకపోయినా, రామ బ్రహ్మంగారి అన్నకొడుకూ, కాంగ్రెసు ముక్కద్ధారీ కావడంవల్ల సునాయాసంగానే గెల్చుకున్నాడు.

నేను కంట్లో పడ్డప్పటినుంచి ప్రతిరోజూ వస్తూనే వున్నాడు; మా ప్రజల సంగతులు చూసిపోదామని. కాని ఆ ముసలిదానితో కబు రంపిన రోజునుంచి, నేను పెట్టిన చివాట్లు నందుకుని పాపం మొహం చూపేందుకే సిగ్గుపడ్డాడు. అయినా ఎన్నిరోజు లుంటుందా సిగ్గు?.... ఒకసారి నన్ను కోరినవారు ఎన్నాళ్ళని నన్ను చూడకుండా ఉండగలుగు తారు?....ఎప్పుడో దిగుతాడు మహానుభావుడని ఎదురు చూస్తున్నాను. రెండు మూడు రోజులు గడిచాయి. నాలుగోదినం ఊడిపడ్డాడు.

నేను గుమ్మంలో కూర్చుని ఏదో పుస్తకం చదువుతున్నాను. కండ్లెత్తి చూచేసరికి పాపం అనామకుడు కొంచెం కంగారుపడ్డాడుగాని, వెంటనే కౌన్సిలరునని గుర్తుచేసుకుని ముట్టి బిగించాడు.

"ఏమండీ వెడుతున్నారా?" ధైర్యంచేసి అడిగాను.

కౌన్సిలరు వణికిపోతున్నాడు. మలేరియా రోగిలా తడబడుతూ "అహ....హిహి" అన్నాడు సందర్భశుద్ధిలేకుండా.

"మా వీధికి రెండు లైట్లు వేయించాలండి" అని అంతగా పడు తున్న అతని అవస్థకు వస్తున్న నవ్వును ఆపుకున్నాను.

ఇకిలించినా పాలిపోయిన ముఖం చక్కబడలేదు. కొంచెం తెప్పరిల్లి, పైపంచె సవరించుకుని, మనిషివలె నిలబడటానికి ఆప సోపాలు పడుతున్నాడు.

"మా తాతయ్యపోయాడు, తెలిసిందిగా?"

"ఆఁ.... ఊఁ"

"అవునుగాని ఆ ముసలిముండతో కబురు పెట్టడ మేమిటి చెప్పండి. దానికి తెలిస్తే ఊరందరికీ తెలిసిపోదూ? ఇంతేనా కౌన్సిలర్ల తెలివి!" ఓరకంటతో చూస్తూ అంతకుముందే వ్రాసివుంచిన ఉత్తరాన్ని అతని మీదికి విసిరాను. కౌన్సిలరు వంగి, గబగబా తీసుకుని, అటూ ఇటూ చూసి లాల్చీజేబులో పెట్టేసుకున్నాడు. మరోక్షణమైనా నిలబడ కుండా వచ్చిన దారినే వెనక్కు తొక్కాడు.

రెండు ముక్కల ఉత్తరమైనా రెండు గంటలు కూర్చుని, తిరుగ తిరుగ వ్రాసి ఘాటు చేశాను. ప్రేమలేఖలు ఎలా వ్రాయాలో తెలియక పోయినా, కొద్దిపాటి పుస్తకజ్ఞానం నాకు సాయపడింది.... మొదటి ఉత్తర మైతే మూడు పేజీలు పడరాశాను. చదివేసరికి నాకే విసుగొచ్చి, ఏమిటీ హనుమంతుని వాలమ్మని చించి కుప్పపెట్టాను. తరువాత ఉత్తరం ఒక పేజీలోనికి దిగింది. అదయినా అవాస్తవికంగా-పురాణ కాలం నాటి ప్రేయసి పలుకుల్లా వుంటే పనికి రాదనుకున్నాను. మూడు ముక్క లైనాసరే, భావయుక్తంగా హృదయాన్ని పట్టి పీడించేవిలా వుండాలని ఇలా వ్రాశాను.

"నా కౌన్సిలర్ శ్రీకి—

మిమ్మల్ని చూచిన తొలిక్షణానే నా హృదయం మీ కర్పితమైనది. ముసలిముండ దగ్గర ఎందుకు తిట్టానంటే, అందరికీ తెలిసిపోతుందనే. రేపు రెండో సినిమా వదలిన తరువాత మా యింటికి రండి. కనిపెట్టు కుని వుంటాను.

నీ........"

ఈ కాలమానంవుంది చూశారూ! బహు విచిత్రమైంది. రెక్కల గుర్రంవలె పరుగెత్తి పోతున్నదని కొందరికనిపిస్తే, కొందరికి అడుగు తీసి అడుగేనా వేయదు.... "అబ్బా! గడచిపోతున్నాయి గంటలు గంటలు!" అని ఒకరు హడావుడి పడుతుంటే, "వెధవ గడియారం కునుకుతీస్తుందేమిరా" అని మరికొందరు విసుక్కుంటారు.... ప్రియుని కొరకు వేచియున్న ప్రేయసి కాలాన్ని తిడుతూ ఆరాటపడుతుంటుంది. తిరిగి ఆప్రియుని కౌగిలిలోనే కాలం అట్టే పొయ్యిమీదివెన్నలా కరిగి పోతుంది. తెల్లవారి పోతున్నందుకు కోడినీ, కాకినీ కాలం పేరుపెట్టి తిట్టి పోస్తుంది....కాలం ఎప్పుడూ ఒకేతీరున నడుస్తున్నా మనిషి అనుభ వించే అవస్థలనుబట్టి కాలమానం కొలతకొస్తుంది.

రెండో సినిమా వదిలిన తరువాత అంటే జనమంతా సద్దు మణిగి నాకగాని కౌన్సిలర్ శ్రీని రావద్దన్నాను. కాని అంతవరకు కాచు క్కూర్చునేదెలా? కూర్చుంటే కాలం గడవదు. కునుకుపడితే వచ్చిన వాడు వెళ్ళిపోతాడేమో! వెళ్ళడనే ధీమావున్నా నిద్రపోతే బావుంటుందా? అతగాడు తడిక చప్పుడుచేస్తే, నేను మేలుకోకముందే మరెవరైనా మేల్కొని చూస్తే?

అలాగే కండ్లలో వత్తులు వేసుకుని దీపంముందు దయ్యంలా కూర్చున్నాను. ఇంత రాత్రిమీద దీపం వెలుగుతుంటే అదొక అను మానం. దొంగబతు కెప్పుడూ బిక్కు బిక్కుమంటూనే వుంటుందని ఇటు వంటప్పుడు మనకన్నీ అనుమానాలే తోస్తాయి. రివ్వుమని గాలి వచ్చినా కౌన్సిలర్ శ్రీ వచ్చినట్లే వుంటుంది. తాటాకుమీదుగా తొండ దూకినా 'అడుగో కౌన్సిలర్ శ్రీ' అనిపిస్తుంది, ఈతచెట్టు నీడను చూసి 'అక్కడ నిలుచున్నది అతనే కాదుగదా!' అనుకున్నాను. చివరకు విసుగొచ్చి, చచ్చినాడు 'వస్తే వచ్చాడు లేకుంటే చస్తాడులె'మ్మని ముసుగుతన్ని పడు కున్నాను. అబ్బే నిద్ర పడితేనా? ఊహుం. గంటెంతో తెలుసుకుందా మన్నా కొంపలో గడియారం లేదు. దుప్పటి నొక్క తన్నుతన్ని లేచి కూర్చున్నాను. కూర్చునిమాత్రం చేసేదేమిటి? ఒంటిగంట ఎప్పటికి కొడుతుందో?.... దీపం దగ్గరకు లాక్కుని కాగితం, పెన్సిలూ పుచ్చు కున్నాను. ఏదైనా బొమ్మగీస్తే? ఏం బొమ్మ గీయాలి? ... పొయ్యి,

పొయ్యిమీద చట్టి, ఆపైని వ్రేలాడే ఉట్టి, గీతామా? గదినంతా పరికించి చూశాను. చుట్టూవున్న వాతావరణంతో ప్రస్తుతావస్థలోనున్న నా బొమ్మనే గీతామని సంకల్పించాను. పీట వత్తుడు తీసుకుని, నెమ్మదిగా పెన్సిలు నాడించాను. దీపం సరిగా కన్పించకుంటే మరీ దగ్గరగా తీసుకుని మంచంకోటిపైనే పెట్టాను.... ఆఖరుసారిగా కౌన్సిలర్ వచ్చినాడు వస్తున్నాడో లేదో ఒక్కసారి చూసి కూర్చుందా మనిపించింది. తడిక తెరచి గుమ్మంలో నిలబడే పారజూచాను. ఒక కుక్క అప్పుడే కను కునికి లేచిందేమో తపతపమని చెవులు కొట్టుకుంటున్నది.... పాడు కుక్క. ఆనిక కౌన్సిలర్ శ్రీని పట్టుకోదుగదా! అరచి అందరినీ లేపితే? ఎవడ్రానువ్వని అడిగితే ఏమని చెపుతాడో? కాలుకొద్ది పారిపోడు గదా!.... దొంగ దొంగని నలుగురూ వెంటబడి పట్టుకు నాలుగు తన్నితే అబ్బాయిశ్రీని?

నా తలంపులకు నాకే నవ్వు వచ్చింది. తడిక దగ్గరకంటా వేసి తిరిగి మంచంమీద కూర్చున్నాను. ముందు బొమ్మ ఎంత స్థలంలో రావాలో, ఏయే వస్తువులు ఏయేభాగాలలో రావాలో గుర్తులు పెట్టాను. 'బొమ్మలో వ్యక్తికీ, వ్యక్తి భావాలకూ గాదు ప్రాధాన్యత నివ్వవలసింది; చుట్టూ వాతావరణం, పరిసరాలలోనున్న వస్తు సముదాయంలో మనిషి గూడా ఒక వస్తువుగానే వుండాలి' అని నాకు నేనే చెప్పుకున్నాను. గుర్తు లుంచిన చోటినుంచి ఒక్కొక్కదాన్నే పూర్తిచేస్తూ, ఎలా వచ్చిందో ఏమోనని దూరంగాపెట్టి చూశాను. కప్పల తక్కెడాయె. ఒక వస్తువుపై మరొకటి ఎక్కి సవారి చేస్తున్నట్లున్నాయి. అంటే స్థలాభావాన్ని అర్థం చేసికోగల స్థితి ఈ చిత్రకారిణికింకా సిద్ధించ లేదన్నమాట!

నిద్ర తూలుకొస్తూ, కండ్లు మండిపోతున్నా వెధవ వచ్చినాడు రాడాయె. తిట్టుకుంటుండగానే ఎవరో వస్తున్నట్లు అలికిడయింది........ ఒకరుకాదు. ఇద్దరో ముగ్గురో వస్తున్నారు. ఇంత రాత్రిలోనూ ఒకడు ఈలపాట పాడుతున్నాడు.

"ఒరే! దాని డాన్సుమాత్రం నాకు బాగా నచ్చిందిరా."

"ఆ డాన్సు లేకపోతే ఇంకా సినిమాచూసే దెవడ్రా?"

"ఆఁ. అదిమాత్రం ఏం బావుంది చచ్చిందిలే. దానికేమన్నా చన్నా చంకా చూట్టానికి?"

ముగ్గురూ పగలబడ్డారు. కుక్క భౌ మంది.

"ఈ పోరంబోకులు సినిమా చూసే దిందుకూ. పుండాకోర్లు!" అని నోట్లోనే తిట్టుకున్నాను.

అయితే రెండో సినిమాగూడా వదిలిపెట్టా రన్నమాట. ఇక దిగుతాడు కౌన్సిలర్ కుఱ్ఱాడు ... లేచి పక్కా గిక్కా దులిపి, చేతులతోనే తల దువ్వుకున్నాను. చెక్కపెట్టెలో చదివి పారేసిన నవలలూ, సినిమా పాటల పుస్తకాలూ, ఏవేవో వాటెడున్నాయి. అందులోంచి నలిగి పోనిదిగా, కొత్తగావున్న ఒక నవల తీసి ముందేసుకున్నాను.

"నేను నీ కోసమే కనిపెట్టుకుని వుండలేదు. నీ వెప్పుడొస్తావన్న ఆరాటం నాకేమీ లేదు. రోజూ ఇంత రాత్రివరకు చదువుతాను. నాకలవాటే" అని నోటితో చెప్పకుండా ఇలా తెలియచెయ్యా లనుకున్నాను. కాని వాడు రానిదే ఏం చేయను? ఎందాకని ఆ పాత పుస్తకంలో కండ్లుంచను? చదివినదే అయినా మళ్ళీ చదువుదామని యత్నించాను. తల కెక్కేట్లులేదు. వెంటనే ఒక ఆలోచన తట్టింది........ కౌన్సిలర్ శ్రీ వస్తాడు.... తడికదగ్గరే స్తంభంలా నిలబడతాడు.... చూసిగూడా చూడనట్లే నటిస్తే?.... చాల సీరియస్‌గా చదువుతున్నట్లు, ఈ లోకంలో లేనట్లు నటించనా?.... చదువు మధ్యలో కొంచెం గంభీరం దాల్చడం, ఆ వెనుక నవ్వు వచ్చినట్లు ఓ చిన్న చిరునవ్వు పారేయడం, ఇలా- ఈ తీరున అభినయిస్తూవుండా లనుకుంటూ గుమ్మంవైపు చూడగానే ఆశ్చర్యం! మరి ఎంత సేపటినుంచి నిల్చుని వున్నాడో కౌన్సిలర్ శ్రీ పరీక్షగా నావంకే చూస్తున్నాడు. మెడచుట్టూ వేసుకున్న పై పంచెను రెండు చేతులతోను పట్టుకుని అదోరకమైన భంగిమలో నిలబడ్డాడు. నేను చూసేసరికి నవ్వలేక నవ్వినట్లు నవ్వాడు. నేనూ నవ్వకుండా ఉండలేకపోయాను. లోనికి రండని సైగచేసి, తలుపు తడిక గట్టిగా కట్టి వచ్చాను. కౌన్సిలర్‌శ్రీ కూర్చుని మంచంపట్టెపైవున్న దీపాన్నీ, దానిచుట్టూ తిరుగుతున్న పురుగునూ పరిశీలిస్తున్నాడు. పుస్తకం మధ్య పేజీలో వేలునుంచే దీపాన్నితీసి క్రిందపెట్టాను.

"సినిమాకు వెళ్ళారేమిటీ?" నేనే సంభాషణ కుపక్రమించాను.

అతను సమాధానం చెప్పకుండా నా వంకా, నా పుస్తకంవంకా చూస్తున్నాడు.

"ఇంకా చదువుతున్నారా?" గౌరవ వాచకంతో నోరు తెరిచాడు.

ఇంత రాత్రయినాకకూడా చదువుతున్నారా అని అతనడుగుతున్నట్లు తెలిసినా "అబ్బే లేదండి. చదువుమానేసి చాలాకాలా మైందిగా. ఏదో నవల చదువుతున్నా నంతే" అన్నాను.

"నించున్నారేం? ఇలా కూర్చోండి" మంచంమీదనే తనో ప్రక్కకు వత్తుకున్నాడు.

"ఇస్, మెల్లగా. దొరలు పెద్దగా మాటాడరాదు" అని ప్రక్కింటి వైపు చూపించి, నేను క్రిందనే కూర్చున్నాను. అతనేమీ అభ్యంతరం పెట్టలేదు. ఊరికే తాగేద్దామా అని క్రిందినుంచి పైవరకు చూస్తున్నాడు. నేను పాదాలకుకూడా చీరె కప్పుకున్నాను.

"ఏమిటి చెప్పండి?" గుసగుసల స్వరంలో దగ్గరకుజరిగి కూర్చున్నాను. అతను ఏమిటి చెపుతాడు? మాటాడేస్థితి ఎన్నడో దాటిపోయింది. నిండు నిషాలో వున్నట్లు మూతకండ్లు వేసి చూస్తున్నాడు. నే నతని కాలి బొటనవ్రేలు పట్టుకుని గోటిపై మెల్లగా సున్నలు చుడుతున్నాను.

"సుబ్బులూ!" అని రెండు చేతులతో నా రెక్కలు పట్టుకున్నాడు.

అతని చేతులు కాలిపోతున్నాయి. ఆ వేడిమి రవికెలోంచిగూడా ప్రవహించి నా శరీరాన్ని తాకుతోంది. ఇదే నా తొలి అనుభవం. పురుష స్పర్శయొక్క సౌఖ్యాన్ని నే నిప్పుడే చవి చూస్తున్నాను. అతను చేతులతోనే పట్టుకుని నన్ను లేపాడు. ఒడిలో కూర్చోబెట్టుకునేందుకు నన్నొక ప్రక్కగా తిప్పి దగ్గరకు లాగుతున్నాడు. నే నతని ప్రక్కగానే మంచం మీద కూర్చున్నాను. అలాగే చేతులతో పొదివి పట్టుకుని, నా కండ్లలోకి

జాలిగా, వేదనగా చూస్తూ "సుబ్బులూ! రేపు చనిపొమ్మన్నా చని పోతాను" అన్నాడు.

"తప్పుగదూ" వణకిపోతున్న నావ్రేళ్ళను అతని నోటిపై వుంచాను. వ్రేళ్ళను ముద్దెట్టుకున్నాడు. మళ్ళీ-మళ్ళీ పదే పదే ముద్దు పెట్టుకుంటున్నాడు. చేతిని జారలాక్కోవాలనిగానీ. ఉడికిపోతున్న అతని శరీరంనుంచి కొంచెం ఒత్తిగిలాలనిగానీ నేననుకోలేదు. ఏం చేస్తు న్నానో, ఎక్కడున్నానో తెలియని మైకంలో నేను గూడా పడి పోయాను.

"అవును సుబ్బులూ! నాజన్మ సార్థకమైంది. నీయంత అంద గత్తెను పొందేభాగ్యం లభించినాక ఇక నేను చనిపోతేనేం....సుబ్బులూ! ఎంత అందంగా వున్నావ్?"

నన్ను బలంగా లాక్కుని మునిపంటితో నా క్రింది పెదాన్ని కొరికాడు. దానితో నేను కొంచెం తెలివిలోకొచ్చాను. ఒళ్ళంతా ఏవో తేళ్ళూ, జెర్రులూ ప్రాకుతున్నా యనిపించింది. నన్ను నేనే ఒకమాటు చూసుకున్నాను. చెదరిపోయిన పమిట, జాకెట్టుకు ఒక గుండీకూడా ఊడిపోయి వుంది. వెంటనే సర్దేసుకున్నాను,

"కౌన్సిలర్ గారూ!"

"నన్నలా పిలవొద్దు సుబ్బులూ!" నేనేమి చెప్పబోతున్నానో విన కుండానే దీర్ఘం తీశాడు.

నేను ఈ లోకంలోనికి వచ్చేశాను గనుక నవ్వొచ్చింది.

"మరి ఎలా పిలవమంటారు?"

"నీ యిష్టం. కాని కౌన్సిలరని మాత్రం అనకు." ఎందుకో మహా బాధ పడిపోయాడు పాపం.

"ఎలాగైనా పిలవనా? ఏ పేరుతో పిల్చినా పలుకుతా రేమిటి?"

"నువ్వెలా పిల్చినా నాకిష్టమే," అని నాచేతిని తన చేతిలోనికి తీసుకున్నాడు.

"ఏయ్ కుక్కా!" కొంచెం పెద్దగానే అన్నాను.

నిజంగా ఇంట్లోకి కుక్క వచ్చిందేమోనని చూస్తున్నాడు. నాకు నవ్వాగలేదు.

"ఓయి అమాయకుడా! నిజమైన కుక్కగాదు, నిన్నే" అన్నాను.

"నన్నా!" ఆశ్చర్యపోయి వెంటనే నవ్వులో నవ్వు కలిపాడు.

"కుక్కన్నా నాకిష్టమే....నీ నోటినుంచి ఏమన్నా అందంగానే వుంటుంది....సుబ్బులూ!"

"అయితే రేపటినుంచి కుక్క అనే పిలుస్తాను. పలకాలి. తెల్సిందా? లేకుంటే కోపమొస్తుందా? చెప్పు బాబూ ఇప్పుడే" అన్నాను.

"అబ్బే! నీమీద కోపమా సుబ్బులూ! రేపటినుంచి నన్ను కుక్కనే పిలువు. హాయిగా పలుకుతాను," అని మళ్ళీ దగ్గరకు జరుగుతున్నాడు.

చేయి అందించాను. మహా ప్రసాదమని మురుసుకుంటున్నాడు.

"మిమ్మల్ని ఒక్కవిషయం అడగాలని వుంది. అడగనా?" అతనిచేయి పుచ్చుకుని ఉంగరాన్ని చూస్తూ, తిప్పుతూ అడిగాను.

"అడుగు సుబ్బులూ! ఇంకా నా ముందు దాపరికమా?"

"నా హృదయాన్ని మీ కర్పించాను. ఎందుకని అడిగితే నేనేమీ చెప్పలేను....మీలోని ఏగొప్పతనమో నన్నాకట్టుకుంది....నిన్న వ్రాసిన ఉత్తరంలోనే మీరు చూసి వుంటారు."

"అవునవును. ఆ ఉత్తరం నాకు బాగా నచ్చింది. ఇదిగో దగ్గరే వుంచుకున్నాను." చంటిపిల్లాడివలె మాటాడాడు. అప్పుడు మాత్రం యధార్థంగాఅతనిపై జాలి వేసింది.

"కాని మీకు వివాహమైపోయింది. మనం ఎల్లకాలమిలాగే కలసి కాపురం చేయలేముగదా!"

"చేస్తాం. ఎందుకుచేయలేం?....ఇదిగో ప్రమాణం చేస్తున్నాను. నిన్నెప్పటికీ వదలను....కుక్కన్నా, నక్కన్నా నీదగ్గరే పడుంటా. నిన్నొదిలిపోను సుబ్బులూ!" అంటూ నిజంగా కుక్కలాగే ప్రవర్తించాడు. నాకు అసహ్యంవేసింది. చీదరించుకునే దాన్నేగాని తమాయించుకున్నాను.

"ఉండండి కొంచెం.... మరి ఎలా చెప్పండి? ఇక్కడేమో అవన్నీ వీలుపడవు."

"వేరే కాపరం పెడదాం. దానికేముంది? రేపే ఓ మంచి యిల్లు చూచి మాట్లాడతాను."

"మాటాడకండి.... ఇస్.... ఎవరో...."

వణికి పోతున్నాడు మానవుడు.

నేను లేచి తలుపుదగ్గర కొచ్చి కంతగుండా బయటికి చూశాను. వెంటనే వెనుదిరిగి "మీరు వెళ్ళిపోవడం మంచిది. త్వరగా. త్వరగా" అని తొందరపెట్టాను.

పలుకుగూడా పడిపోయింది. ప్రేమజ్వర మేమాయెనో, పంచె పైకెగబట్టుకుని "ఇల్లుచూసి కబురుచేస్తాను" అంటూ గబ గబా దూకి బయట పడ్డాడు.

♦ ♦ ♦

ఉన్న సామానులన్నీ రిక్షాలో వేసుకుని, చెప్పవలసిన వారితో ఏవో అబద్ధపు కూతలు చెప్పి, పుట్టిపెరిగిన తాతగారి అద్దెకొంపను వదలి పెట్టాను. కౌన్సిలర్ శ్రీ అద్దెకు తీసుకున్న ఇల్లు, ఊరికి ఆ చివరన వున్నది. అక్కడెవరూ నన్నెరిగినవారుండరనే ధీమాతో కౌన్సిలర్ శ్రీ ఆలోచించి అక్కడ తీసుకున్నాట్ట.

వెళ్ళి అందులో చేరాము. మేడ పైభాగం. చిన్నదిగా వున్నా అన్ని సదుపాయాలతోనూ పసందుగా వుంది. చక్కటి గాలి వీస్తుంది. వెనుకవైపునుంచి చూస్తే పచ్చని చేలు కనుపిస్తాయి. ముందు సరిపోను వసారా.

అంత చక్కని మేడలోకి ఈ పాతబట్టలవీ తీసుకెళ్తుంటే, నాకే సిగ్గనిపించింది. ఎప్పటిదో తాతలనాటి తలగడ మరీ మాసిపోయి వుంటే వీధిలోకి విసిరేశాను.

అంతలో ఒక ముసలమ్మ వచ్చి "నీకేనామ్మా జబ్బుచేసింది?" అని అడిగింది.

నాకేమిటి? జబ్బేమిటి? మండుకొచ్చింది.

"ఎవరమ్మా నీవు?" కొంచెం కారంగానే అడిగాను.

చెవిదగ్గరకు చేయిపోనిచ్చి "ఏమ్మా! ఏమంటా.... ఈ యిల్లు నాదేనమ్మా. అబ్బాయి చెప్పాడు. ఎవరోచుట్టాలు జబ్బుచేసి వచ్చారు; రెండు మాసాలుమాత్రమే వుంటారు అని అడ్మానిచ్చాడు. ఏమి జబ్బమ్మా?"

"కడుపులో కొంచెం కోతగా వుంటుందమ్మా!"

"ఏమ్మా! ఏమంటావు?....నాకు కొంచెం చెవుడుపడ్డింది లేమ్మా. పెద్దగా చెబితేనేగాని వినపడి చావదు." అంటూ చేతిని చెవిదగ్గరకు చేర్చింది.

"గుండెల్లోమంట" అని గట్టిగా చెవిదగ్గర అరిచాను.

"గుండెల్లో మంటా? అబ్బో! తట్టుకోలేమమ్మా. ఎప్పు డెప్పు డొస్తుందమ్మా?"

"ఇలా చెవిటివాళ్ళ దగ్గర వాగేప్పుడల్లా."

"ఏమమ్మా! ఏమంటావ్"

"దానికి ఇప్పు డప్పుడని ఏమీలేదమ్మా. దానికి కష్టం వేసినప్పు డల్లా వస్తుంది."

"అబ్బో! అయితే కష్టమేనే....ఏమోనమ్మా. మాకాలంలో ఇవన్నీ ఎరగం. ఈ పాడు సూపరెరువులు మనుషులకిన్ని చిత్ర విచిత్రా లయిన జబ్బులు తెస్తున్నాయి. ఏమోనమ్మా! ఎలా కావలసివుందో?" గొణుక్కుంటూ దిగిపోయింది.

బాగానేవుందీ చెవిటిమేళ మనుకుంటుండగానే "అమ్మా! మరో విషయం. లైటు అవసరం లేకపోతే ఆర్పేయమ్మా. కరెంటుబిల్లు నన్ను నమిలేస్తుందనుకో....గుర్తుంచుకుంటావుగా. వస్తానమ్మా."

రెండుమాసాలుమాత్రమే ఉంటానని చెప్పాడూ? అంటే ఈ రెండుమాసాలపాటు వాడుకుని, ఆపైని తోలేస్తా డన్నమాట! దొంగ కుక్క! ఎల్లకాలం కదలక వదలక కావిలించుకునే కూర్చుంటా నన్నాడే!

అయినా నాకామాత్రం బుద్ధివుండనక్కర్లా. ఏ పెళ్ళిగాని పసివాడ్నో చూస్తే ఈ తంటాలన్నీ వుండేవికాదుగా?.... లేదులే. మనం చేసిందీ మంచిదే అయింది. పెళ్ళిగాని వాడయితే వాడొక్కడే మన ఉచ్చులోపడి ఊరుకుంటాడు. ఈ కౌన్సిలరబ్బాయి అలాకాదుగా?... వీడికితోడు పెళ్ళామొకటుంది...ఈకుక్క నాపాదాల కడ పడి ఇక్కడేడుస్తుంటే, ఆ పతివ్రతాతిలకం ఇంకెవడినో వెతుక్కుంటుంది.అప్పుడుగాని నాటకం రసవత్తరంగా నడవదు! రానీ, రానీ అబ్బాయికి లాలపోసి జోలపాడతాను.

అసలు విషయం మరచిపోయా...వీడ్ని దగ్గరకు తీసిందెందుకు? అందగాడనా లేక ఇంతకంటే అనువైన మగడు దొరకడనా!...కాదు. మనం తలపెట్టిన మహాయాగంలో వీడొక కేవలమాత్రుడు; అంతే. ఇప్పుడు వీడ్ని ఉపయోగించుకోవాలి. దీని ఆసరాతో మరో ఎత్తయిన కొమ్మను -గట్టికొమ్మ నందుకోవాలి.

ఇతగాడిచేత డబ్బుపెట్టించి చదవాలి. వచ్చే మార్చిలోనే మెట్రిక్ పరీక్షకు కూర్చుని, కాలేజీ తెరవగానే అందులో చేరిపోవాలి...ఇదీ ప్రస్తుత కర్తవ్యం. అంతవరకూ ఏమాత్రం తొందరపడకుండా, వీడ్ని చిచ్చుకొడుతుండాలి. అటుపై ఆలోచించవచ్చు.

అయితే ఇంతకూ కన్యాత్వం వీడికి ధారవోయ వలసిందేగా?... కాలు నొప్పనీ కడుపునొప్పనీ ఎన్నాళ్లు చెప్పగలం? తప్పదు. భవిష్యత్తు కోసమై శీలా న్నర్పించవలసిందే. అంతకన్న గత్యంతరం లేదు.

సూర్యుడు అస్తమిస్తున్నాడు. తల్లిఒడిలోంచి ఎంతముఖం చేసుకుని వచ్చాడో, అంతముఖంతోనే ఇంటికెళ్ళాలని పాపమాతండ్రి ఉబలాటం. లేకుంటే తను పడినకష్టాలకు గుర్తుగా బక్కచిక్కిన తనమోము చూసి తల్లి గుండెలు బాదుకుంటుం దేమోనని, ఇక్కడే తయారై బుగ్గలూరించి, గాలి పూరించి మరీ తిన్నది అరగలేదన్నట్లు నడుస్తున్నాడు.

ఆయన కనుదాటగానే మా ఆయన దిగాడు.

ఒకే వస్తువుపైని అందరికీ ఒకే అభిప్రాయం వుండదు. ప్రయోజనాలు భేదించినప్పుడు కోర్కెలూ, అభిప్రాయలూ కూడా భిన్నంగానే

వుంటాయి...చీకటి పడుతోందని కొందరు చింతిస్తే, ఎప్పుడు చీకటి పడుతుందా అని మరికొందరు కాచుక్కూర్చుంటారు.

పగలల్లా పని మానేసి తీయని కలలుకంటూ కూర్చున్నాడేమో, బరువైన కండ్లతో ఊడిపడ్డాడు మా అబ్బాయిశ్రీ. వల్లెవాటు వేసుకుని వాసననూనె రాసుకుని మరీ తయారైనాడు. దసరాపండగనాటి కుర్రాడి కులుకు వళ్ళంతా పులుముకుంది.

"సుబ్బులూ! వచ్చాను" అని వెనుకవైపునుంచి నా కండ్లు మూశాడు.

మూసిన చేతులను పుచ్చుకుని ఇంత ఆలస్యం చేశావేం? నాకు కోప మొచ్చిందంటే గుంజీలు తీయిస్తాను....కొత్తయింట్లో ఒక్కదాన్నే ఉండాలంటే భయమేయదూ?" నంగనాచి కబుర్లు చెప్పాను.

" ఈ యిల్లు నీకు నచ్చిందా?" అడిగాడు.

"ఇల్లు నచ్చిందికాని, ఒంటరితనమే నచ్చలేదు."

"ఏం చేయను సుబ్బులూ! నాకు మాత్రం రావాలని లేదంటావా? పట్టపగ లొస్తే...ఒక రేడియో కొనిపెట్టనా! హాయిగా కాలక్షేపం జరుగుతుంది." గడ్డం పట్టుకుని తనవైపుకు తిప్పుకున్నాడు.

"ఎందు కనవసరంగా రేడియోలూ, ఫోనులూ? డబ్బు దండుగ కాకపోతే" అని గోడకు చూస్తూ అన్నాను.

ఆయన సంతోషానికి మేరలేకపోయింది.

"ఆ రేడియోకంటే ముందు అవసరమైనవి కొన్ని వున్నాయి. పడుకునేందుకు మంచం లేదు...బట్ట లవీనూ. నీకు తగినట్టుగా ఉండాలి గదా? ఇలాంటి చిల్లర మల్లర పద్దులు చాలా వున్నాయి." అని లాక్కెళ్ళి చాపమీద కూర్చోబెట్టాను. మానవు డప్పుడు మంచంయొక్క అవసరాన్ని గుర్తించాడు.

"దిండు కూడా లేదా?"

"అన్నీ అక్కడే వదిలేసి వచ్చాను. ఎప్పటివో తాతలనాటివి."

చేతులనే తలగడ చేసుకుని వెల్లకిలా పడుకున్నాడు. నేను లేచి బయటవైపు తలుపు మూసి, గడియవేసి వచ్చాను, గోడ కానుకు

కూర్చుని అతని తలను తొడపైకి తీసుకున్నాను. రెండుచేతులూ మెడ మీద వేసి నన్ను ముందుకు వంచుకుని ముద్దు పెట్టుకున్నాడు.

"రా పడుకుందాం."

"అప్పుడే రాత్రి అయిపోదులే!"

"కాదు సుబ్బులూ! నీ కింకా తెలియదు. కన్నుమూసి తెరిచేప్పటికి రాత్రంతా కరిగిపోతుంది.... రా.... అందుకే!" అంటూ నన్ను తన ప్రక్కన పడుకోబెట్టుకున్నాడు. చేతులు చీరెను పైకి గుంజుతున్నాయి.

"లైటుంటే నాకు సిగ్గమ్మా!" చీరె సవరించుకుని దిగ్గున లేచాను.

"అయితే ఆర్పేసిరా" గొంతుక పొడారినట్లు పెళుసుగా వినబడింది.

గదినిండా చీకటి పరచుకుంది. ఆ చీకటిలోనే ప్రథమ పర్యాయంగా నా శీలాన్ని అమ్ముకున్నాను.



మరునాటి సాయంత్రం ఇంటిముందు బండి నిలబడివుంది. ఇద్దరు కూలీలు ఒక ఇనుప మంచాన్ని లోనికితెస్తుంటే క్రింది భాగం లోని వారిదేమో ననుకున్నాను. కాని కూలీలు మెట్లెక్కి పైకి వస్తున్నారు.

"జాగ్రత్త, జాగ్రత్త. గోడను తగలకుండా పట్టుకురండి" అంటూ ఒక పెద్దమనిషి లోనికొచ్చాడు.

"నమస్తేండి అమ్మగారూ! మా గురువుగారు పంపారు" అదో రకంగా నవ్వాడు.

మంచం, డ్రాయరు, రెండు కుర్చీలు, రేడియో ఇంకేమేమో వరుసగా దిగినాయి. ఆ తెచ్చిన పెద్దమనిషి అరుకానులకోసం కూలీలతో పోట్లాట పెట్టుకున్నాడు. కొట్టుకునేదాకా వస్తే "ఇచ్చేయండి ముందు" అని గట్టిగానే మందలించాను.

ఆ పెద్దమనిషి ఒక వెధవనవ్వు నవ్వి "పొండి. తీసుకోండి" అని విసరికొట్టాడు.

"సరే. నమస్తేనమ్మా! వస్తామరి...... అప్పుడప్పు డొస్తుం టాలే!"

"మంచిది నాయనా! ఎప్పుడూ రా!" నీకంటే మించినదాన్నే నన్నట్లు బహు వెటకారంగా నొసలువిరిచాను. వాడు ముడుచుకొని జారి పోయాడు.

తలుపులు బిగించి చూశాను. ఒక కట్టలో పట్టుచీరెలు, ఒక కాగి తంలో అల్లిక గుడ్డలు; ఒక పొట్లాములో రాధాకృష్ణులు, పార్వతీ శివులు గుడ్డలుండీ లేనట్లు అర్ధ నగ్నంగావున్న చిత్రాలు. ఇంకా అడు గున ఒక పుస్తకం కనుపించింది. తెరిచి మధ్యపేజీ చూశాను. అసహ్యం. విసిరి గోడవతల చేలో పడేశాను. వెధవకుక్క! కొక్కోకం పట్టు కొచ్చాడు!

ఇక ఏ వస్తువునూ ముట్టలేక కుర్చీలో కూలబడ్డాను. ఒళ్ళంతా కంపరమెత్తి పోతున్నది. ఎంత సేపలా కుర్చీలో కునుకు తీశానో లేచే ప్పటికి కొత్త గడియారం ఆరు కొట్టింది.

ఇందాకటి కోపంగానీ, అసహ్యంగానీ నా కిప్పుడు లేవు. అంతా ప్రశాంతంగా వున్నట్టు సామానులన్నీ ఎక్కడివక్కడ సర్ది, వంట కుపక్రమించాను. బియ్యం గిన్నెలో పోస్తుంటే జ్ఞాపక మొచ్చింది. అబ్బాయిశ్రీకి నా చేతి వంటకం తినిపిస్తే?.....మరి కాసిని బియ్యం పోసి ఇద్దరికి సరిపడేలా అన్నం వండాను. క్రిందింటి వారికి కోళ్ళు న్నట్లు తెలిసి, కోడిగుడ్లేమయినా దొరుకుతాయేమోనని అడిగాను. రెండంటే రెండే వున్నాయని ఇచ్చిందా మాలక్ష్మి.

కోడిగుడ్డుఅట్టు పోస్తుండగానే కౌన్సిలర్ శ్రీ దిగాడు. కొత్త మంచంపై నడుము వాల్చుతూ "ఇంకా వంటేమిటి సుబ్బులూ! ఇంత వరకేంచేశా" వన్నాడు.

"కూర్చోండి. పావుగంట మాత్రమేనని వంటిల్లు సర్ది స్నానానికి లేచాను. తిరిగి వచ్చేప్పటికి అతగాడు రేడియో పెట్టేందుకు తంటాలు పడుతున్నాడు. అది పలుక నంటున్నది.

"దాని విషయం నే చూస్తాగాని, మీరిలా రండి" వంటింటిలోంచే కేక వేశాను.

బడి కుర్రాడికివలె చేతులు కట్టుకుని వచ్చి నిలబడ్డాడు.

"అమ్మా! ఆజ్ఞ" అన్నాడు నవ్వుతూనే.

"ఆ పీటమీద కూర్చో."

"నేనా?"

"ఆఁ నువ్వే. ముందు కూర్చో!" అనగానే శిరసావహించాడు. రెండు పళ్ళేలలోనూ వడ్డించి, ఒక పళ్ళెం అతని ముందుకు నెట్టాను.

"ఇదంతా అయ్యగారు తినటానికే? ఇప్పుడేగదా...." అంటుండగానే "ఇస్, భోం చేసేటప్పుడు మాటాడరాదని చిన్నప్పుడు చదువుకోలా? మాటాడక తినండి. ఊఁ" అన్నాను.

ఒకటొకటే కొరుకుతున్నాడు. చాలు చాలంటూనే కోడిగుడ్డట్టుతో గిన్నెడు అన్నమూ తినేశాడు.

"వద్దంటివే నాయనా! కంచంగూడా గీరుకు తినేవు" అన్నాను.

"రుచిగావండి రెండోసారిగూడా తినిపించావు" అన్నాడు.

కుంకుళ్ళ పులుసు పెట్టినా, నా చేతితో వడ్డించితే 'అబ్బ! ఏమి బాగు' అని వదలకుండా తినేస్తారు వీళ్ళు.

భోజనం ముగించి తమలపాకు తొడిమ్మలు తుంపుతున్నాను. ఎలాగైతేనేం సతవోరి రేడియోను పలికించాడు. ఏదో హిందీపాట వినవస్తుంది.

"బావుందిగదూ?" అడిగాడు.

"ఏమిటి? పాటా, రేడియోనా?"

"రెండూను" అంటూ తమలపాకు లందుకున్నాడు.

"మర్చిపోయా. నీ చీరెలు చూసుకున్నావా? ఫొటోలు తెచ్చాను; ఇంకా గోడకు తగిలించలేదేం" వరుసగా అన్నీ పేరు పేరునా అడిగేట్టున్నాడు.

"నిచ్చెన తెచ్చిపెడితే గోడకు మేకులుగూడా కొడతాను. లేకుంటే నిచ్చెనగూడా నేను తెచ్చుకునేదా?"

"అయితే రేపు వాడ్ని పంపిస్తానులే."

"ఎవరు నాయనా ఆ శిష్యాగ్రణి? గురువుకు తగినట్టే వున్నాడే" అన్నాను.

"అబ్బో! వాడిదంతా పెద్ద కథలే. మూడు సినిమాలు తీయొచ్చు.... సరేగాని లైటు ఆర్పేసి ఇలారా చెపుతాను."

"ఎప్పుడూ లైట్లార్పే పనేనా?" పెద్దగా నవ్వాను.

హెచ్చుశ్రుతిలో రేడియో మంచి పాట నందుకుంది.

నాకు పాటలంటే ఎంతో యిష్టం. జనం నన్ను మెచ్చుకున్నా రంటే నా గొంతులోని తీయదనము వల్లనే. కాని ఇప్పుడెందుకో మనసు పాటవైపుకు పోవడంలేదు.

"అందుకే. రా మరి" అంటూ కౌన్సిలరబ్బాయి గోమాడుతున్నా, ఉండమని మూగసైగచేసి అతి శ్రద్ధగా రేడియోపాట వింటున్నాను. పాట పూర్తయింది. తరువాత ఏదో ప్రసంగం. నే నదంతా వినదలచుకో లేదు. ఆ పాటే నన్ను కదలించింది. గొంతెత్తి పాడమని నాకు పిలుపు నిచ్చింది. ఉత్సాహం పొరలివచ్చి గొంతులో గరగర లాడుతున్నది.

"మీకు పాడటం వచ్చునా?" మంచంమీద చేరి అడిగాను.

"అబ్బే: అలాంటిదేమీ మనకు లేదు."

"అయితే నేను పాడతాను వింటావా?"

"అంతకంటేనా?" అని లేచి కూర్చున్నాడు.

నోటిలోనున్న తమ్మ ఉమిసి "ఏం పాడను? ఏ పాట కావాలి నీకు?" అన్నాను.

"నీ యిష్టం. ఏదైనా నా కిష్టమే."

శృతిపెట్టిన గొంతుక స్వర మెత్తుకున్నది.

"పాంథుడా దూరానా
అంధకారమ్మదిగో
నిలచిపో; నడిరేయి
పో తగదు- వేకువనే

లేచిపోదువుగాని ఆగుమో
పాంథుడా ఆగవోయి"

అని హెచ్చు తగ్గు శృతులలో భావయుక్తంగా పాడాను. కౌన్సిలర్ శ్రీ అలాగే కండ్లప్పగించి చూస్తున్నాడు. గిల్లినాగాని స్పర్శజ్ఞానం కలగలేదు.

"సుబ్బలూ! సుబ్బలూ! నువ్వేనా పాడింది?" ఇంకనూ ఇహం లోకి దిగలేదనుకున్నాను.

కిలకిలా నవ్వి "అవును. నీ సుబ్బలే" అన్నాను.

కండ్లలో కండ్లుంచి చూస్తూ "సుబ్బలూ! రేపు నే చనిపోతాను" అని నా రెక్క పట్టుకున్నాడు.

"తప్పు" అంటూనే అతనిపై వాలిపోయాను.



మనుషుల్లోవుండే బలహీనత యిదే. మనం తలపెట్టిన దొకటైతే, అది వేరువిధంగా తల కొస్తుంది. కౌన్సిలరును ఏక్షణానా నిండుహృదయంతో నేను ప్రేమించలేదు. కాని ఇప్పుడు అతన్ని చూడందే వుండలేనేమో ననిపిస్తున్నది.... అతనూ అంతే. మేము కాపురం పెట్టినాక, ఏ రాత్రీ అతను నన్నొంటిగా వదలలేదు. స్త్రీసహజంగావుండే ఈ బుద్ధిజాడ్యం నన్ను వదలి పెట్టలేదు.

కౌన్సిలరును చేరదీసిందెందుకు? వలపు ఒలకబోయటానికా? కాదే? మరి నేనిప్పుడు చేస్తున్నపని? నున్నగా తయారై, రాత్రి ఎప్పుడు వస్తుందా అని ఎదురుచూస్తున్నాను.... ఇంతవరకు చదువువైపుకే ధ్యాస మళ్ళటం లేదంటే ఏమనాలి?.... లోకాన్ని పగబట్టే తీరు ఇదేనా? "రావో ప్రియుడా! ఆవో సఖుడా" అని చేతులెత్తి చంక లందించడమేనా? బుద్ధిగల ఏ ఆడదైనా ఇలా ఆడుతుందా? ఛీ, ఛీ! ఆత్మవంచన. ఆత్మవంచన చేసుకున్నాను.... ఇకనైనా త్వరపడకపోతే మన చేతుల్లోంచి మనం దాటిపోతాం, ఆ గతిమాత్రం మనకు పట్టరాదు. మనసుకు కళ్ళెం బిగించాలి. సత్వరం అవసరం.

నే నా నాటిరాత్రే మెల్లగా కదలించాను.

"కౌన్సిలర్‌గారూ!"

"ఆమాటే అనొద్దన్నాను. కుక్కా అని పిలవరాదూ? నాకు సంతోషమే నంటినిగా?"

"అయితే ఓ నా ముద్దులకుక్కా! ఒక్క కోరిక!"

"చెల్లించుకుంటాం" నడుముపైకి చేయి పోనిచ్చాడు.

"చదువుకుందామని వుంది. ఎంతసేపని రేడియోతో కాలక్షేపం చేయను?"

"నువ్వు పెద్దదాని వవుతానంటే నేను కాదంటానా? కాని యీ యీడులో బడి కేం వెడతావు చెప్పు?"

"లేదు. ఇంటిదగ్గరే స్వంతంగా చదువుకుంటాను. ఏం, తప్పుతా ననుకుంటున్నారా నవ్వుతున్నారు?" అన్నాను.

"చూద్దాముగా! స్వంతంగా చదివి ఏమాత్రం సాధిస్తావో? రేపే కావలసిన పుస్తకాలవీ కొనుక్కో. డబ్బెంత కావాలేం?"

"ఏమో నాకేం తెలుసు?"

"అయితే నాకే తెలుసునన్నమాట! సరే జేబులోవుంది తీసుకో... రా....దగ్గరకురామరి" అని లాక్కున్నాడు. జేబులోని పైకం మొత్తం తీశాను. పాతిక రూపాయలు మాత్రం లెక్కించి పరుపుక్రిందపెట్టి, మిగతా డబ్బు అతగాడి జేబులోనే పడేశాను.

అన్నింటిలోను ప్యాసవుతానని నమ్మకముంది గాని లెక్కలే నా గొంతు పట్టుకుంటాయి. అయినా బండగా చదువుతున్నాను. చెవిటి ముసలమ్మ పెంపుడుకొడుకు ఒక డున్నాడు. అతడు హైస్కూల్లో స్కూల్ ఫైనల్ చదువుతున్నాడు. అతన్ని పరిచయం చేసుకుని, ఇద్దరం కలిసి చదువుకుందాము రమ్మన్నాను.

"నాకు లెక్కలు చెప్పేటట్టయితే వస్తానక్కా" అన్నాడా బొట్టిగాడు.

నే నసలు వాణ్ని పిలుస్తున్నదే లెక్క లొచ్చునేమోనని. నేనే వాడికి లెక్కలు చెప్పాలట.... బాగానేవుంది. దొందూదొందే.

"వద్దులే నాయనా. అమ్మమ్మ దగ్గరే చదువుకో" అనేప్పటికి పాప మా కుర్రకుంక చుక్కబొట్టంత మొహం చేసుకున్నాడు.

పట్టుబట్టి చదువుతున్నాను. వేళాపాళా లేకుండా పుస్తకంలో పురుగైపోయాను. మధ్యలో విసుగొస్తే. ఒక్క రేడియోపాట విని తిరిగి చదువు మొదలెట్టేదాన్ని. ఒకనాటిరాత్రి నేను చదువుకుంటుండగా కొంచెం ఆలస్యంగానే కౌన్సిల రబ్బాయి వచ్చాడు.

"అయిపోయింది. వుండండి. ఈ పాఠానికి నోట్సు రాస్తున్నాను. రెండు నిమిషాలలో వచ్చేస్తా" అని పుస్తకం లోనే మాటాడాను. అతని ముఖ కవళిక లెలా వున్నాయో నేను గమనించలేదు. ఏమీ మాటాడకుండాపోయి పడుకున్నాడు. పావుగంట, అరగంట, గంటకూడా గడచి పోయింది. నేనింకా నోట్సు తీస్తూనే వున్నాను. తలనొప్పి తట్టుకో లేక పోయాడేమో రేడియో పెట్టాడు. హోటల్ లో వదిలేసినట్లు రేడియో గొంతుకనంతా సాంతంగా తిప్పాడు. ఈమనిషి కేమైనా బుద్ధి వున్నదా అన్నంత కోపమొచ్చింది. పుస్తకాన్ని విసరికొట్టి కౌన్సిలరు మీదికి దూకాను.... కండ్లలో దిగులు; ఒళ్ళంతా కాలిపోతున్నది. నే నెంతో పశ్చాత్తాపపడ్డాను.

"క్షమించండి, వెధవ చదువులో పడి కొట్టుకుపోయాను."

"సుబ్బులూ! మా ఆవిడ పుట్టింటికి వెళ్ళిపోయింది. ఇక రాదనుకుంటా."

మనసులో నేనెంత సంతోష పడ్డానో చెప్పలేను, ఇది నా తొలి విజయం.

సంతోషాన్ని పంటిక్రింద నొక్కిపట్టి "రాకేం చేస్తుంది? దిగులు పడుతున్నారా?" అన్నాను.

"నీకు తెలియదు సుబ్బులూ! అది రాకుంటే మనపని పట్టిదే."

నా కీమాట ఎందుకో పోటుపెట్టి నట్లయింది.... కష్టపడి చదువుతున్నాను. మధ్యలో పుట్టి మునిగితే?

"వెంటనే వెళ్ళి బ్రతిమాలి తీసుకురండి. ఇక ఎక్కడికీ కదలనని వాగ్దానం చేయండి. ఆ తరువాత నే చెపుతాను.... నా మాట వినరూ?" అన్నాను.

"అది వినదు సుబ్బులూ! లేదు. లాభంలేదు" తల పట్టుకు కూర్చు న్నాడు.

"కాదు ఆడదాని హృదయం మీకు తెలియదు. కొండంత తప్పు చేసి, ఈ ఒక్కసారికి మన్నించమంటే నూరు తప్పులనుసైతం తుడిచి వేసు కుంటుంది. ఒక్క కన్నీటిబొట్టుతో ఎంత పాపాన్నయినా క్షమించగలిగేది ఒక్క స్త్రీ హృదయం మాత్రమే ... నా మాటవిని వెళ్ళి తీసుకురండి. తప్పక వస్తుంది" ఎవరికోసమైనా సరే బ్రతిమాలాను.

మారు మాటాడకుండా నన్ను లాక్కుని తన హృదయంలో దాచుకున్నాడు. నా కేవేవో ఆలోచనలు తెరలవలె వస్తున్నాయి.... తెల్లని గోడపై అల్లిన సాలీడు గూటిలో ఒక గండుచీమ చిక్కుని తన్నుకుంటు న్నది. లేచి చెర విడుపించుదా మనుకున్నాగాని ఎందుకో మనసు ఎదురు తిరిగింది.

"సుబ్బులూ! నువ్వు చదువు మానేయ కూడదూ?"

వెంటనే సమాధానం చెప్పలేకపోయాను. మళ్ళీ ఆయన అందు కున్నాడు.

"నువ్వు చదువుకుంటూ కూర్చుంటే నా గతేంకావాలి సుబ్బులూ?" ఏడ్చినట్లే మాటాడాడు. నే నప్పటికీ నోరు తెరవలేక పోయాను.

"సరే. చదువుకో. కాని రాత్రిపూటమాత్రం ఆ పుస్తకాలతో నన్ను వేధించకు.... సరేనా?" చీరె గుంజుతున్నాడు.

"మీరు చెప్పినదానికి నే వొప్పుకున్నాను. మరి నా మాటో?" అన్నాను.

"ఏమిటది?"

"రేపు ఉదయమేవెళ్ళి మీ ఆవిడను తేవాలి. తప్పకుండా వస్తుంది. నే చెపుతున్నాగా. వెళ్ళిరండి."

"నీ యిష్టం. నువ్వెలా చేయమంటే అలా చేస్తాను. నాదేముంది? అన్నీ నీ కర్పించాను. సర్వాధికారాలు నీవే" వరుసగా మాటాడేసు కుంటూ పోతున్నాడు. ఆగమన్నాను.

"ఒట్టి ఆడముండలా మాటాడేస్తావేం! ఆడదానికి సర్వాధికారా లిస్తే ఇక మగవాడివి నీ వెందుకు? బొమ్మకు పరువు ప్రతిష్ఠలు దేనికి? నీకు నీవే నాశనమైపోయే మాటలు మాటాడబోకు. నన్ను శాసించాలి గాని...." ఏదో గొంతు పట్టుకున్నట్లయి, వాక్యం పూర్తి చేయకుండానే ముగించాను.

"సుబ్బులూ! నా పాలిటి దేవతవు నువ్వు" అన్న కౌన్సిలరబ్బాయి మాటలు ఎప్పటికోగాని నా తల కెక్కలేదు.



ఆనాటినుండి రాత్రి చదువు మానేశాను. సాయంత్రం ఆరు కొట్టిందే ఆలస్యంగా పుస్తకాలు మూసి, అబ్బాయిశ్రీ కోసం ఎదురు చూసేదాన్ని. ఏమీ తోచక రేడియో పెట్టి వెనుకవైపు వరండాలో కుర్చీ వేసుకు కూర్చునేదాన్ని. ఆ వైపునుంచి చల్లనిగాలి వీస్తుంది. స్వచ్ఛంద మైన ప్రాణవాయువు శరీరానికి నూతన రక్తాన్ని ఎక్కించేది. కూని రాగం తీస్తూ, అప్పుడప్పుడు రేడియోతో వంతపాడుతూ సాయం సమయమంతా ఆ వైపునే గడిపేదాన్ని.

ఒకనాడు ఇద్దరు యువకులు నా వంకే చూస్తూ మాటాడుకోవడం చూశాను. ఇద్దరి చేతుల్లోను దిండ్లలాంటి గ్రంథాలున్నాయి. మేముండే మేడకూ, అవతల చేలకూ మధ్యనున్న ఖాళీ ప్రదేశంలో వారిద్దరూ కూర్చున్నారు.

అదేం చిత్రమైన మనస్తత్వమోగాని, ఒకోసారి నాకు తెలియ కుండానే చిన్నపిల్లనై పోతాను.... చాలాకాలం క్రిందటి విషయం: చాలా కాలమంటే నేనేమీ బొట్టినిగాదు. ఓణీలు వేసుకోడం ప్రారంభించిన చాల కాలానికే. ఒకనా డెక్కడికోపోయి, బస్సులో వస్తున్నాను. మార్గ మధ్యానే వర్షం జోరుగా పట్టుకుంది. మా బస్సు ఒకచోట ఆగగానే కిటికీ తలుపులు తెరచి తొంగిచూశాను. ఒక కుర్రాడు....పూర్తిగా తడిసి ముద్దయిపోయి, గజగజ వణుతూనే నన్నుచూసి ఇకిలించాడు. నేనూ నకిలించి, రమ్మని చేయి ఊపాను. బస్సు కదులుతుండగా రివ్వున పరు గెత్తుకుంటూవచ్చి అతను బస్సెక్కాడు. బస్సులో నిలబడ్డ అతగాడ్ని

చూసి హడిలిపోయాను. అప్పటికిగాని నేనుచేసినపని తప్పని గుర్తుకు రాలేదు. అతడు దగ్గరకంటావచ్చి "ఎక్కడా మనం దిగేది?" అన్నాడు. నా గుండెలు బస్సుకన్నా వేగంగా పరుగెత్తి పోతున్నాయి. ఎక్కడి నుంచి వచ్చిందో ధైర్యం—ఎవడురా నువ్వని లాగి లెంపకాయ కొట్టాను. బస్సును ఆపారు. నా మాట వినకుండానే మీసంగల మగవారంతా ముందుకువచ్చి, నేనంటే నేనని తన్నుకుంటూ అతన్ని తన్నారు. అప్పటికి నవ్వొచ్చినా, నా చిలిపి తనానికి ఇప్పటికీ సిగ్గుపడిపోతాను. అతనెప్పుడైనా కనుపించడం జరిగితే తప్పక క్షమాపణ వేసు కుంటాను.

అది తప్పన్న విషయమే ఆ క్షణాన గుర్తుకు రాకపోవడం తప్పు. ఏదో గాలిలోవుండి, తలా తోకాలేని ఇలాంటి వ్యవహారాలను కొని తెచ్చుకుంటాను. సరిగ్గా ఈనాడూ అదే జరిగింది.

ఆ ఇద్దరు యువకులను చూసి, ఎందుకో నవ్వాలనిపించి చిలిపిగా నవ్వాను. దానితో ప్రతిరోజూ వారు హాజరు వేయించుకుని వెళ్ళేవారు. మొదటినాడు నేను పాడిన పాటను ఉభయులూ కలసి పాడేవారు. అంటే దానర్థం— మేము వచ్చామని ఎరుకపరచడం.... నేను వరండాలోకి రాగానే పాట ఆగిపోయేది. అక్కడే పుస్తకాలను తలగడ చేసుకుని శేషశాయిలా పవ్వళించేవారు.

మరి కొన్నాళ్ళకు రద్దీ ఎక్కువ కాజొచ్చింది. అనుకోకుండా బాడ్‌మింటన్‌కోర్టు ఒకటి వెలిసింది. నాకు తెలుసు. ఈ తంతగమంతా నా కోసమేనని. కుర్రాళ్ళు రోజుకో వేషం వేసుకొచ్చేవారు. ఒక్కొక్క డుగా దొరికినప్పుడు, పైనుండి వారిని ఆటలు పట్టించేదాన్ని. కాలం గడచిపోదన్న భయమిప్పుడు లేదు. చిన్నసైజు సర్కసు — అందు రక రకాల వింతగొలిపే పనిముట్లు— నా కండ్లముందు ఆడుతుండేవి. ఆది వారాలలో మరీ సందడి. ఆ ప్రదేశమంతా ఒక సంతగా మారిపోయేది.

ఒకనాడు రబ్బరు బంతి నా గదిలోకి దూకింది. ఇక ఎవరో వీర శూర బాల కుమారుడు రానున్నాడని తలంచి, బంతిని ఒడిలో పెట్టుకు

కూర్చున్నాను. గడియారం తిరుగుతున్నా మెట్లెక్కిన చప్పుడేమీకాలేదు. ఏం చేస్తున్నారాఅని కిటికీగుండా ఒక కంటితోచూశాను. అంతా మందపడి మల్లగుల్లాలు పడుతున్నారు. నేను పోనంటే నేను పోనని మగధీరు లంతా వెనుకంజ వేస్తున్నారు. అప్పుడే జబ్బుపడిలేచినట్లున్న ఒక సిల్కులాల్చీవాలా "నే వెడతానుండండి" అని లేవలేక చేతులమీదలేచి రొమ్ము సాచాడు. అంతా ఆ సాహస విక్రమార్కునివైపు చూశారు. అతగాడు బలంగా ఒక అడుగుతీసి ముందుకు వేశాడు.

"కాదు. నే వెళతాను."

"నే తెస్తాను."

"లేదు. నేనే వెళ్ళాలి" అంటూ చివరకు అంతా సిద్ధమైనారు. ఒక యువకుడు సాహస విక్రమార్కుని రెక్కపట్టుకుని నిలిపాడు.

"నీవేమీ వెళ్ళనక్కర్లా. నేనే పోతున్నా" అప్పుడే రెండడుగులు ముందుకు దూకాడు.

"ఆగండి!" అంటూ కథానాయకునివలె ఒక కుర్రాడు కేక పెట్టాడు.

అంతా ఆగిపోయారు.

"ఏ ఒక్కడు వెళ్ళినా ప్రమాదమే. కనుక అందరం కలసే వెడదాము. పదండి" అనగానే బొబ్బలు పెట్టుకుంటూ, విజయంచేసినట్లు వస్తున్నారు.

"ఎక్కడికి? ఎక్కడికీ గుంపంతా?" అని క్రింద గుమ్మంలోనే నిలవేసింది చెవిటి ముసలమ్మ.

"మా బంతి మీ మేడగదిలో పడింది" అంతా అరిచారు.

"ఒక్క బంతి పడితే మీ రింతమంది దేనికి? ఒక లారీ తోలుకు రాకపోయారా? కష్టపడ్డారుగాని ఉండం డిక్కడే. నే తెచ్చిస్తాను" అంటూ నా గదిలోకి వచ్చింది ముసలమ్మ.

ఆవిడ వస్తున్న ధ్వని విని, బంతి అవతల పారేసి నేను నిద్ర నటించాను.

"అమ్మా సుబ్బులూ! నిద్రపోతున్నావా సంజెవేళప్పుడు?" అని నన్ను లేపకుండానే గదినంతా వెదకి చూస్తోంది ముసలమ్మ.

ఒళ్ళు విరుచుకుంటూ నేను లేచాను.

"ఆ కుర్రగాడిదల బంతి పడిందట.... ఇదిగో ఇక్కడే వుందిలే" అని చేతపుచ్చుకుని మెట్లు దిగింది.

ఎందువల్లనో కౌన్సిలర్‌శ్రీ ఆ దినం పెందలకడనే వచ్చేశాడు. ముఖంలో ఏవేవో భావాలు నాట్యమాడుతున్నాయి. అతని వెంటనే చెవిటి ముసలమ్మగూడా పైకొచ్చింది.

"ఎవరమ్మా ఆ కుర్రాళ్ళంతా?"

"ఎవరో నాయనా! ఒక గుంపు చేరిం దిక్కడ. ఒకటే ఇకయికలు, పక పకలూను; రాత్రిలేదు, పగలులేదు. ఆ కోమటి దుర్గయ్య స్థలంలోపడి ఆడుతుంటారు."

ముసలమ్మ ఫిర్యాదు చేసినట్లు చెప్పింది.

"ఎంతకాలంనుంచి వస్తున్నారేం?"

"ఏమంటావు నాయనా?"

"ఎంతకాలనుంచి .... వీళ్ళు.... ఆడుతున్నారంటాను?"

"ఎప్పటినుంచి అంటావా? ఉదయం లేచిందిమొదలు ఆడుతూనే వుంటారు."

"అదికాదమ్మా. ఎన్ని రోజులనుంచి వస్తున్నారని?"

"మీరు అద్దెకొచ్చిన మాసంలోనే మొదలయింది."

"అయితే ఇక్కడ ఆడకూడదని మీరు వెళ్ళగొట్ట కూడదూ?"

"ఆ స్థలం మందికాదుగా నాయనా! కోమటి దుర్గయ్యదిగా."

"అయితే ఇండ్లమధ్య ఆటస్థలాలు పెట్టుకోమని వుందా? కాపురాలు చేసే మనకు ఎంత కంగారుగా వుంటుంది?" ఆయన కాపురమేదో మునిగిపోతున్నట్లు మాటాడాడు.

"అదిగో చూడు నాయనా! ఎలా పగలబడుతున్నారో!" చెవిటి ముండయినా బ్రద్దలుగొట్టుకు పోతున్నట్టు చెవులు మూసుకుని, గొణుక్కుంటూ దిగిపోయింది.

"ఏమిటండీ మరీను. కుర్రాళ్ళేదో ఆడుకుంటుంటే మీ కభ్యంతర మేమిటి?" అన్నాను.

అదోరకంగా ఓరకంటితో చూసీ చూడనట్లు చూశాడు.

పాపం! అర్భకుడు! నన్నెత్తుకు పోతారని అనుమా నిస్తు న్నట్లున్నది.

"మీరేమీ దిగులు పడనక్కర్లా. నన్నెవరూ మీనుంచి ఎత్తుకు పోరు. ధైర్యంగా నీళ్ళు తాగండి" అని దగ్గరకు చేరాను."

"అదికాదు సుబ్బులూ!....అబ్బే! నాకేం అనుమానం?....అయినా ఈ కుర్రకారు అంత మంచిదికాదు చూడూ!" తనేదో పాతకారు అయి నట్లు మాటాడేశాడు.

నాకు నవ్వు వచ్చి బుగ్గపట్టి లాగాను.

"పోనీండి. ఏమీ ఫరవాలేదుగాని.... మీ భార్యామణి ఏమంటు న్నది?" ప్రస్తావన మార్చి వేశాను.

"వచ్చిన దగ్గరనుంచి అదోరకంగా వుంటున్నది సుబ్బులూ!ఎంత నమ్మించినా నమ్మటంలేదు."

"ఆడదాన్ని నమ్మించలేక పోయారంటే మీరెందుకు పని కొస్తారు చెప్పండి? అయ్యో! నా తెలివి తక్కువ కుక్కా!" అని నవ్వాను.

"నాతెలివి ఒక్క ఆడంగులదగ్గరే పనిచేయడంలేదు" అన్నాడు.

"పొరపాటు. తెలివి తక్కువవారైతే నన్ను మీ వలలో ఎలా వేసుకో గలిగారు?"

"నువ్వే నన్ను వలలో వేసుకున్నావు" అని నన్ను చిక్కించు కున్నాడు.

"కనబడుతూనే వుందిగా. ఎవరు ఎవరిని వలపన్ని చిక్కించు కుంటున్నారో" అని కౌగిలిలో కలిసిపోయాను.

"ఒక్క విషయం"

"ఏమిటి?"

"మీరు కొంతకాలం వరకు ఇక్కడకు రావడం తగ్గించాలి."

"ఎందుకు?"

"మీ సతీమణిని నమ్మించాలి. బుద్ధిమంతుడవైనట్టు కొన్నాళ్ళు కనుపించాలి" అన్నాను.

"అది నమ్మదుగా? సరిగదా! కుక్కతోక ఎంతతిప్పినా వంకరే నన్నది."

అతని అమాయకత్వానికి నవ్వకుండా ఉండలేకపోయాను.

"అంటే అనవచ్చు. కాని బుద్ధికీ, కుక్కతోకకూ సంబంధంలేదు. స్వతహాగా వంకరై పుడుతుంది కుక్కతోక. బుద్ధి మాత్రం అలా కాదే?....బుద్ధిని మనం మలచుకుంటాం. మనకు నచ్చిన పద్ధతులలో బుద్ధిని మనం వంచుకుంటాము."

"అవును. నా బుద్ధి నీమీదికి వంగింది. ఏం చేయను?"

గట్టిదెబ్బ తీశాడు. నాకు సమాధానం దొరకలేదు.

"అయినాగాని కొన్నాళ్ళపాటు అలా వుండటం మంచిది. రాత్రంతా మీరిక్కడ గడుపుతుంటే, ఆమె అక్కడేం చేయాలి?" అన్నాను.

"నిజమే. నిన్నొదిలి వుండలేను. నేనేం చేయాలి?"

"మనసు నిగ్రహించుకోవాలి....అకస్మాత్తుగా నేను చనిపోతాననుకో. అప్పుడు మీరూ నా వెంట తరలివస్తారా? మనసును నిలుపుకోరా?"

"చస్తే ఏమవుతుందో చెప్పలేను. బ్రతికుండగా మాత్రం నిన్నొదిలి వుండలేను."

"ఒకవేళ నేనే నిన్ను వదిలేస్తే?"

"ప్రపంచాన్నే వదిలేస్తాను." నిండైన ఆ పలుకులు చీకటి గోడలనంటుకుని పలవరించాయి.

♦ ♦ ♦

ఫస్టుక్లాసులో వస్తాననుకున్నదాన్ని మామూలు మూడోతరగతిలో మెట్రిక్ ప్యాసయినాను. ఎప్పుడు కాలేజీలో అడుగుపెడతామా అని

మనసు ఉవ్విళ్లూరుతున్నది. మాటిమాటికీ పత్రికలో ప్రకటించిన నా నంబరు చూసుకుంటూ మురిసిపోతున్నాను. ఈ శుభవార్తను కౌన్సిల రబ్బాయికి చెప్పాలి. ఎప్పుడు వస్తాడో?

క్రింద చెవిటి ముసలమ్మ పెంపుడుకొడుకు ఈసారి గూడా పరీక్ష తప్పాడు. "చదువుమీద ధ్యాసవుంటే గదట్రా నీకు? తూనీగలు పట్టుకోవడమే సరిపోయె. ఇక కప్పల్ని పట్టుకో. పోదువుగాని. ఆడది పాసయింది. నువ్వు తప్పావు. ఎందుకురా బ్రతుకు? దాన్ని చూసయినా సిగ్గు తెచ్చుకోరాదురా?" అని పిల్లవాడ్ని సాధించి పోస్తున్నది.

ఆ మాటలు వింటుంటే వాడ్ని చూసి జాలి చెందవలసింది పోయి ఆనందిస్తున్నాను. కెరటాలవలె ఉరకలు వేసుకుంటూ ఉత్సాహం తన్నుకొస్తున్నది. కులుకుతో పాడుతూ, రేడియోతో పోటీ పడుతున్నాను.

"నాకు తెలుసులే ఈ కులుకంతా దేనికో" అంటూ కౌన్సిలర్ శ్రీలోని కొచ్చాడు.

"జ్ఞాపకముందా ఒకనాడు నీవన్నమాట?" ఎగిరిగంతేసి రెండు చేతులతోను అతగాడి మెడ పట్టుకుని వంచాను నాకు కష్టం కలగకుండా అతనే వంగి నిప్పులాంటి ఒక ముద్దు వేశాడు.

తీసుకెళ్ళి మంచంమీద కూర్చోబెట్టాను.

"ఎలా సాధిస్తానో అన్నావుగదూ. చూసుకో" అని పత్రిక అందించాను. పత్రికఅంతా తిరగవేసి "ఇందులో నీ ఫొటో ఎక్కడా లేదే?" అని ముసిముసి నవ్వులు నవ్వాడు.

"ఏమైనాగాని ఇద్దరం కలసి ఈ రోజు సినిమా కెడదాముండి. సరేనా?"

"ఇద్దరం వెడదాంగాని, నీవొకచోట నే నొకచోట కూర్చోవాలి. సరేనా?"

సరేనంటే సరేనని ఇద్దరం బయలుదేరి సినిమాకు వెళ్ళాము.

ఏ సినిమాకు వెళ్ళాలని అనుకోకుండానే దారిలో తగిలిన ఒక హాలులోకి దారితీశాము. హాలులో కూర్చున్నాకగాని ఇదేమి సినిమాయో

నన్న అనుమానం కలగలేదు. ప్రక్కనున్న ఆవిడతో "ఇదేమి సినిమామ్మా? దీని పేరేమిటి?" అన్నాను.

ఆమె నేదో కించపరుస్తున్నానని, మొహమంతా చిట్లించుకుని "నేనేమీ నిశానీ కాదు. పల్లెటూరు దాన్ననుకుంటున్నావేమో, ఒళ్లు దగ్గర పెట్టుకుని మాట్లాడు" అని ఒళ్ళంతా నోరు చేసుకున్నది.

ఆడ గుంపంతా నా వంకేచూస్తూ "ఈమెకే గావాల్ను రెండక్షరం ముక్క లొచ్చింది? .... దేశమంతా గొడ్డుపోలేదుతల్లీ" అని ఎవరి నోటి కొచ్చినట్లు వారు రాగాలుతీయడం ప్రారంభించారు.

రక్కి పెడదా మన్నంత కోప మొచ్చిందిగాని, వెంటనే ఏడుపొచ్చింది.

అంతలోనే హాలు చీకటయింది. తాతయ్య చనిపోయిననాడుకూడా ఏడ్చెరుగని నేను, ఆ చీకటిలో గ్రుడ్లనీరు కుక్కుకుని ఏడ్చాను. వచ్చిన కోపమంతా కన్నీటిరూపంలో కారిపోయింది.

ఎంత దిగమ్రింగుకుంటున్నా ఏడుపు ఉపశమించేట్టు లేదు. 'నేనే మన్నానని ఆడంగులంతా నాపై విరుచుకపడ్డారు!' పమిటచెంగు తడిసి పోతున్నది.... ఉత్సాహంతో సినిమాకు రావడమేమిటి? ఉత్త పుణ్యానికి తిట్లుతిని, ఇక్కడ ఏడ్వటమేమిటి?

పాడుసినిమా, వెళ్ళిపోదా మనిపించింది. కాని వెంటనే నాలోని ప్రతీకారం లేచి 'ఆడముండలకు జడిసి సినిమా వదలి పోతావా? సిగ్గు' అని అరచింది. ప్రాణాన్ని బిగపట్టి కూర్చొబెట్టాను.

వినిపించకుండానే పాటలు పూర్తయి పోతున్నాయి. బొమ్మ లేవేవో వస్తూ పోతున్నాయేగాని నాకేమీ కనుపించడంలేదు. బుద్ధి కథను అందుకునే స్థితిలో లేదు. తల పగిలి పోతున్నది.

ఇక భరించలేక బండిలోపడి ఇంటికొచ్చేశాను. అయినా స్థిమితం చిక్కలేదు. పరుపుమీదపడి దొర్లుతున్నాను.... ఎప్పటికి నిద్రపట్టిందో "సుబ్బులూ," అంటూ అబ్బాయిశ్రీ కావిలేసుకుంటేనేగాని మెలకువ తట్టింది కాదు.

* * * *

మహా మేరువునుచూసి జంకనివారుసైతం, ఒకోసారి చిన్న గడ్డి పరక దగ్గరే బెదిరిపోతారు. ఎంత కష్టాన్నయినా ఓరిమితో భరించగల పెద్దమనిషి, కాలి వ్రేలుకు కురుపులేచిందని అమితంగా బాధపడిపోతాడు. బడిలో ఎన్ని బెత్తం దెబ్బలుతిన్నా నోరెత్తని కుర్రవాడు- ఇంటిదగ్గర తన చెల్లాయి చిన్న మాటన్నందుకే మూడు రోజులు భోజనం మానేసి ముక్కి ముక్కి ఏడుస్తాడు. ఎందుకేడ్చాడంటే సమాధానం చెప్పలేము. ఒకోసంఘటన ఒక్కొక్కరి నలా కదిలిస్తుంది. అంతే. అంతకంటే సమాధానం లేదు.

సినిమానుంచి ఎందుకొచ్చావంటే కౌన్సిలరబ్బాయికి సమాధానం చెప్పలేకపోయాను. గంటక్రితం లేని తలనొప్పి సినిమా చూసేందుకే వీలులేకుండా బ్రద్దలుగొట్టుకు పోయిందంటే ఎవరు నమ్ముతారు?

దీనిలో వింతరకమైన జబ్బేదో పుట్టిందని కౌన్సిలర్‌శ్రీ తలంచి వుండవచ్చు. ఆ రకమైన మనస్థితినుండి బయట పడకముందే నే నడిగేశాను, "కాలేజీలో చదువుకుంటాను. ఏమంటావు?"

"నిన్ను ఉంచుకుంది చదువులు చెప్పించిటానికీ, చక్కగా ముస్తాబుచేసి వీధులు తిప్పడానికీ కాదు."

ఇలాంటి మాట లంటాడనీ, అనగలుగుతాడనీ కలలోనైనా నే నూహించలేక పోయాను. ఆ కోపావేశంలో నా నిజస్వరూపం బయట పడిపోయింది.

"ఫో కుక్కా! నీకంటే నాకు దిక్కులేదనుకున్నావా? 'కో' అంటే కోటిమంది వచ్చి నా పాదాలముందు వాలతారు. తోక ఊపుకుంటూ దొంగ కుక్కలా నీవే నా వెంటబడి తిరిగావు.... నన్ను ఉంచుకున్నావా? ఆ మాత్రం మగతనమైనా నీలో ఏడ్చిందా? లేదు. నేనే నిన్ను ఉంచుకున్నాను" నా ఆవేశానికి అంతులేకపోయింది.

కౌన్సిలరబ్బాయి తలవంచుకుని దబదబా మెట్లుదిగి దాటిపోయాడు. నేనుకుర్చీలో కూలబడ్డాను. తలపోటు నన్ను తరిగేస్తున్నది. అయినా ఆలోచిస్తూనే వున్నాను.

నేనుచేసిన పనేమిటి? ఏమిటి నేను చేసినపని?

తల గోడకేసికొట్టినా తలనొప్పి తగ్గేట్లులేదు. "నేను చేసిన పనేమిటి?" ఇదే ఆలోచిస్తున్నాను. ఈ ప్రశ్నకే నాకు సమాధానం కావాలి.

"నేను చేసిన ఈ దౌర్భాగ్యపు పనికి ఇక కౌన్సిలర్ రాకుంటే?"

"ఏం? కౌన్సిలర్ రాకుంటే ప్రొద్దు పొడువదా? ఈ భూమండలంలో ఎంతమందిలేరు?"

"అయితే ఎందరిని మార్చుతావేం?"

"ఎందరినైనా మార్చుతాను. చేతి కందినవాళ్ళల్లా ఉపయోగించుకుంటాను."

"దేనికి?"

"వాళ్ళ నాశనానికి."

"ఇప్పుడు కౌన్సిలర్ శ్రీని ఏం నాశనం ఏవేశావ్?" వాడి పెళ్ళాం వాడిదగరే వుంది. వాడి ఆస్తిపాస్తులేమీ చెక్కు చెదరలేదు. వాడేమీ చెడిపోయి ఊళ్ళు పట్టలేదు.... కాకుంటే కొద్దిరోజులు కాసుల గలగలలో నిన్ను మురిపించాడు. వాడికి కావలసింది అనుభవించాడు. పోయాడు.... ఇప్పుడు చెప్పు ఎవరు నాశనం చేయబడ్డారు?"

ఏడ్చాను. నేనే నాశనం చేయబడ్డాననీ, నన్ను చెరిచి పోయాడు దుర్మార్గుడనీ ఏడ్చాను....ఏం లాభం? తొందరపడ్డాను. చేతికి దొరికిన దాన్ని చెప్పుకాలితో తన్నాను....ఇక కౌన్సిలరబ్బాయి రాడు. రాడనుకుంటుండగానే వచ్చాడు. కాళ్ళపై బడ్డాను. విదిలించుకున్నా వదలలేదు. వదలను.

• • •

వదలనని ప్రమాణం చేయమన్నాడు కౌన్సిలర్ శ్రీ. చేశాను.

"ఏమో నాకింకా అనుమానమే. కాలేజీ చదువులతో నా మొహం చూడవేమోనని నా భయం....నిన్ను చూడంటే నేను బ్రతుకలేను.

అందుకే నాకిష్టం లేకున్నా, కష్టమైనాసరే ఒప్పుకుంటున్నాను.... నన్ను వదలకు.... నీ కోసమే బ్రతికుంటాను" అని కంటనీరు పెట్టుకున్నాడు కౌన్సిలరబ్బాయి.

ఎవరి ప్రయోజనాలువారివి. ఒక రకమైన ప్రయోజనం కొరకు నే నతన్ని కోరుతున్నాను. మరో రకమైన ప్రయోజనంకొరకు నన్నతను వదలలేదు.

కాలేజీలో కాలు మోపడంతోనే ఏదో మహాసింహాసనాన్ని అధిష్ఠించానన్నంత ఆనంద మొందాను. విద్యార్థులేగాక విద్యార్థినులు సైతం నా చుట్టు చేరేందుకు తపనపడుతున్నారు. తాకలేక, తాకకుండా వుండలేక తహతహ లాడిపోతున్నారు.

నేను చేరేప్పుడే కాలేజీ ప్రొఫెసరుగారు పరీక్షగా చూశారు. నేనొక మంత్రగత్తె ననుకున్నారో, లేక మాణిక్యాన్ననుకున్నారో రెప్ప వాల్చకుండా చూశారు. ఏమిటి చూస్తున్నారని నన్నొకమారు నేనే చూసుకున్నాను. నిండైన అవయవాలతో తీర్చిదిద్దినట్లున్న నా శరీరభాగాలు నాకే అందమనిపించాయి. చేయితిరిగిన చిత్రకారుడు, ఇక చనిపోతానను కుని తన పనితనమంతా చొప్పించిన ఊహాసుందరివలె ఉన్నానని నాకే అనిపించింది.

మా క్లాసు రూము యెదుట వరండాయే కాలేజీ హాస్టల్ అయిపోయింది. గంటకొట్టిన తరువాత గూడా నిల్చుని, వదలలేక వదలలేక వెళ్ళిపోతున్నట్లు విద్యార్థులు నిట్టూర్చి వెళుతుండేవారు. కండ్లన్నీ నావైపే ఉండటం నా కెంతో గర్వాన్ని కలిగించేది. కాని పైకి మాత్రం పట్టీపట్టనట్లు, చూసీ చూడనట్లు వుండేదాన్ని. లెక్చరర్లవద్దగూడా నీవెంత అన్నట్లు అహం నటించేదాన్ని.

ఒకే ఒక ప్రాణి నన్నసహ్యించుకొంటున్నట్లు కొన్నాళ్ళకు నా కర్థమైంది. ఎవరంటే బ్యాంకు ఏజంటుగా రమ్మాయి సుజాత. సుజాత కూడా అందంలో తీసిపోయిందేమీకాదు. కాకుంటే చదువులో కాస్తంత రాచ్చిప్ప. ఒకనాటి చర్చలో విద్యార్థినులంతా ఏకమై సుజాతకంటే సుబ్బులే అందమైనదని నిర్ణయించారట. అప్పటినుంచి ఆమెకు నిద్రపట్టడంలేదు. నా పైన ద్వేషం ఏర్పరచుకుంది. కొరకొరలాడుతూ ఆమె

చూస్తుంటే నాకు నవ్వొచ్చేది. సహజంగా వున్న అందాన్ని చిటపట లాడించుకుంటూ చిన్నబోతుండేది.

అదేం పాడురోగమోకాని అందరికి వున్న జబ్బే యిది. ఒక ఆట గాడంటే ఒకఆటగాడికి గిట్టదు. ఒకపాటగానినీడయే మరోపాటగానిపై పడకూడదు. కవిని చూస్తే కవికి మంట. అందాన్ని చూస్తే ఆడదానికి మంట.

సుజాతనుమాత్రం నేనెన్నడూ ద్వేషించలేదు. పైగా ఎంతో ప్రేమించా లనిపించేది. నే నెంతదగ్గరకు పోయేందుకు ప్రయత్నించే దాన్నో, సుజాత అంత ఎడంగా, దూరంగా జరిగిపోయేది. ఒకనాడు ఒంటరిగా కలవడం తటస్థించింది. ఎన్నాళ్ళనుంచో ఆ సమయంకోసం వేచి చూస్తున్నాను. దించిన తల యెత్తకుండా సుజాత ఏదో చదువుకుం టున్నది. వెళ్ళి భుజంమీద చేయివేశాను. ఉలికిపడినట్లు చూసింది. నేనూ కూర్చుని "సుజాతా!" అని గడ్డం పుచ్చుకున్నాను. నా చనువుకు తలెత్తి కొంచెం ఆశ్చర్యంతో చూసింది.

"నా పైని కోపమా?"

మాటాడకుండా చదువుకుపోతూనేవుంది.

"చూడవ్? నన్నుచూస్తే నీకెందు కింత కోపం?"

"నాకేం కోపంలేదు."

"కోపం లేకపోతే నాతో మాటాడవేం!"

"ఏం మాటాడాలి?" అంటూ కోపంగా నావైపుకు తిరిగింది.

"అమ్మా! దొరికింది దొంగ" అన్నాను నవ్వుతూ.

"నీకంటే నే నందగత్తెనని ఎవరన్నారు?....ఆ అన్నవారిక అందమంటే ఏమో తెలియదు. పై మెరుగును చూచి అందమంటే నే నొప్పుకోను."

సుజాత కండ్లువిప్పి చూస్తున్నది.

"అవును సుజాతా! నేనన్నది నిజం....పైకి నే నెంత అందంగా వున్నానో నాలోన అంతటి చీకటి గుయ్యారముంది. ఎన్నో వికారాలు

నాలో దాగివున్నాయి." నేను మాటాడుతుంటే సుజాత ఆశ్చర్య పోతున్నది.

"అవన్నీ నీకు చెప్పడం అనవసరం. కాని నేను పైకగుపించేంత అందకత్తెను మాత్రం కాను. నా మనస్సు పూర్తిగా వికారమయి పోయింది. నీకేం? బొడ్డూడని గండుమల్లెలా వున్నావు. నన్ను చూచి నీవెందుకు సిగ్గుపడాలి?....నాకంటే ఎన్నోరెట్లు అందమైనదానివి నువ్వు. ఏ కోణంనుంచి చూసినా ఇది సత్యం....సుజాతా! ఇకనైనా నాతో మాటాడవ్?" అతిదీనంగా బ్రతిమాలాను.

సుజాత పూర్తిగా నాకు వశమైపోయింది. నేను లెమ్మంటే లేవడం, కూర్చోమంటే కూర్చునే స్థితిదాకా వచ్చింది. నేను కావాలని పన్ను గడతో మాత్రం సుజాతను వశపరచుకోలేదు. ఎందుకో ఆ ముఖం చూడగానే ఆప్యాయత వెలికి వచ్చింది. మనసు విప్పి మాటాడాను. ఆ మాటలే సుజాతను నాలో కలుపుకున్నాయి.

  

కాలేజీ పరిసరాలుదాటి కౌన్సిలరబ్బాయి ఒడిలోకి జేరడమంటే నాకిప్పుడు ప్రాణానికొస్తున్నది. కాదు గూడదని ఎంత మొరాయించినా మనసు విననంటున్నది. కాలేజీలోని ఆ సందడీ నవ్వులే నా కానందం.

ఎంతమంది అందమైన యువకులు నా చుట్టూ తిరుగుతుంటారు? ఒక్కసారయినా కన్నెత్తిచూస్తానేమోనని ఎంద రెన్నివిద్యలు చేస్తుంటారు? ఒకడు పాటపాడుతుంటే, ఒకడు బల్లపై దరువేస్తుంటాడు. ఒకడు ధైర్యంగా లేచి మాటాడితే, మరొకడు వెనుకనేజేరి పిల్లికూతలు కూస్తాడు. ఆడవాళ్ళముందు మగవాడి ననిపించుకోవాలని, ప్రక్కవాడితో పోట్లాట వేసుకుంటాడొకడు. అసలు లెక్చరరునే నిలదీసి, నీవెంతో యు అని తమిళంలో మాటాడుతాడు మరొకడు.

ఇలాంటి శతకోటివిద్యలు చేస్తూ, పడరానిపాట్లు పడుతుంటారు దాన్నవన్నీ వన్నీ నాకు కోపాన్ని కలిగించవు సరిగదా ఎంతో ఆనం

దాన్నిస్తాయి. వాటి నన్నింటినీ వదలి కొంపకు వెళ్ళడమంటే కష్టంగాదా మరి!

కొంపకెళ్ళి కూడూ కుమ్మూ వార్చేలోపుగానే కౌన్సిలర్శ్రీ తయారయ్యేవాడు.

"ఇవాళ కాలేజీ కబుర్లేమిటి?" ఇదీ రోజువారీ ప్రధమ ప్రశ్న.

నే నే కాలేజీ పోగ్గాడితోనో లేచిపోతానని మా ఆయనకు చెప్పలేనంత భయం. నేను కొంచెం కులాసాగా కనుపించితే, ఆ నాడేదో కాలేజీలో జరిగిపోయిందనే. కాని వెంటనే చేరదీసి, వీపు చరిచి ధైర్యం చెప్పేదాన్ని.

సుజాతతో మాటాడిన సాయంకాలం గంతులేసుకుంటూ ఇంటికి చేరాను. ఆడుతూ పాడుతూ అన్నం వార్చుతుండగానే అబ్బాయిశ్రీ దిగాడు. అతగాడ్ని చూసి నేను మరికొంచెం పురివిప్పాను.

"ఏమిటి–ఇవాళ కాలేజీలో ఏదో జరిగిందే?" తన కంతా తెలిసినట్లే అన్నాడు.

"అవును. ఒక మంచి నేస్తం దొరికింది."

కౌన్సిలరబ్బాయి నోరు పడిపోయింది.

"నిజంగా చాలా మంచి నేస్తం. కావలసినంత డబ్బు, దానికితోడు అందం, అన్నీ వున్నాయి. ఇక నేనంటేనా ప్రాణాలు విడిచేయడమే" అని ఉడికించాను.

కోపం, ఏడుపూ రెండూ పేనుకుని వచ్చేట్టున్నాయి. చిన్నపిల్లల్ని ఆట పట్టించినట్లు ఎదుటవారి నలా ఏడ్పించడమంటే నా కదో సరదా. అయినా అట్టేకాలం దాన్ని నిలుపుకోలేను.

నవ్వుతూ "పుంలింగం కాదులే. భయపడబోకు నాగన్నా!" అని దగ్గరకు లాక్కున్నాను. కౌన్సిలర్శ్రీ ముఖముపైని సున్నా కాండిల్ అంత చిరునవ్వు వెలిగింది.

క్రమేణా ముఖాన్ని వెలిగించుకుంటూ "ఎవరా అమ్మాయి? నాతో చెప్పవూ?" అన్నాడు.

నాకు మండుకొచ్చింది. "ఎవరైతే నీకేం? ఆడవాళ్ళ స్నేహాల జోలి నీకెందుకు?" అన్నాను.

"చెప్పినంతమాత్రాన కొంప మునుగుపోయే దేముంది? నిన్ను వదలేస్తాననా?" తనకున్న తెలివినంతా ప్రదర్శించాడు. నాకు అసహ్యం వేసింది. ఇక మాటాడేందుకుగూడా మనసొప్పక, అతన్ని వదలించుకుని మంచంమీదినుంచి లేచాను.

"సుబ్బులూ!" అంటూ చెంగు పట్టుకున్నాడు.

"కోప మొచ్చిందా?"

నేనేమీ మాటాడలేదు.

"కావాలంటే రేపే యింటికి తీసుకొచ్చి పరిచయం చేస్తాను."

ఒక్క నవ్వు నవ్వి "వద్దులే సుబ్బులూ! నీవుండగా కొదవేమిటి నాకు?" అన్నాడు.

వెంటనే మెరుపులాంటి ఒక ఆలోచన నా తలలో కొచ్చింది.

"వీడికి పరిచయంచేసి సుజాత గీతను కూడా చెరిపివేస్తే?"

నా సర్వావయవాలు పట్టుతప్పి వణికిపోతున్నాయి. స్పృహ తప్పి పడిపోతానేమో నన్నంతగా నరాలు గుంజుతున్నాయి....ఎంత పాపిష్టిదాన్ని! ఎంతటి పాపపుటాలోచన! ఇక కన్నబిడ్డను మాత్రం మోసం చేయననే నమ్మక మేముంది?....ఈనాడు ప్రేమించే ఒక హృదయాన్ని పాడుచేస్తాము. రేపు కన్నబిడ్డనే నడివీధిలో నిలబెట్టి నాశనం చేస్తాము.....ఎందుకు? ఎంతకాలమిలా చేయాలి? ఈ పాపం నన్నెంతదాకా ఈడ్చి కొడుతుంది?"

ఇక ఆలోచించలేను. నా మనసు నన్నొదిలిపెట్టి, ఒక ప్రత్యేకమైన గదిని ఏర్పరచుకుంది. దాని ఛాయలకే నేను పోలేను. నా శక్తి చాలడంలేదు. భగవాన్! అదేమిచేసినా బాధ్యురాలను మాత్రం నేను కాను. దానిలో నాకేమీ ప్రమేయంలేదు. దయయుంచి ఆ పాపమంతా నా పైని మోపవద్దు.

మరునాడు సుజాతతో కలసి మాటాడలేకపోయాను. ఆ ముఖం వంక చూసేందుకే సిగ్గుపడుతున్నాను.

కాలేజీలో చేరినపిదప అంతఖిన్నురాలనై ఎన్నడూ విద్యార్థుల కంట పడలేదు. విద్యార్థినులుగూడా నా ముఖాన్ని చూసి మాటాడించ లేక పోతున్నారు.

సుజాత నన్నొంటరిగా పిలచి అడిగింది. "సంగతేమిటి?"

ఏమీ లేదన్నాను.

"నమ్మను. ఏదో జరిగింది." చెప్పితీరాలని పట్టుబట్టింది. ఎంత తప్పించుకుందామన్నా వదిలేట్టు లేదు.

"ఏమీలేదు. మానాన్న పోయాడు."

సుజాతకండ్లు చెమ్మగిల్లినాయి. నన్ను ఓదార్చేందుకుగాను తన కొచ్చిన వేదాంతాన్నంతా వప్పచెప్పింది. ఆనాడు నన్నొంటిగా ఎక్కడికీ కదలనివ్వలేదు. ఒకటికి వెళ్ళినా, నా వెంటనే వచ్చింది. నన్నంతగా ప్రేమించుతున్న సుజాతతో అబద్ధం చెప్పానే అన్న బాధ నన్ను వేధిం చుతూనే వుంది.

కాలేజీ వదిలారు. మామూలుగా అందరాడపిల్లలూ గుంపుగా కలిసి బయటి కొచ్చి, ఎవరిదారిని వారుపోతారు. గాంధీచౌక్ రాగానే సుజాత తమ ఇంటివైపు వెళ్ళిపోతుంది. కాని చౌక్ దాటిన పదినిముషా లకు, సుజాత ఇంకా నా వెంటనే వున్నదని గ్రహించాను.

"ఎక్కడికి సుజాతా?"

"అవైపువరకూ వస్తాను. అక్కడో కొట్లో కొంచెం పనుంది." నడుస్తూనే మాటాడింది సుజాత.

నాకు తెలును. ఆమె నాకొరకే వస్తున్నది.

"మాయిల్లు చాలాదూరం సుజాతా!"

"మీ యింటితో నాకేంపని? నాదారిని నే పోతాను" నవ్వుతూనే అన్నది.

"అయితే రిక్షా చేసుకుని వెడదాం పద."

గడపలోనే చెవిటిముసలమ్మ ఎదురై, "సుజాతను పారజూచింది. నేను తిరిగి ఎదురు చూసేసరికి "ఎవరమ్మా! ఈమె?" అని నోటిదాకా వచ్చిన ప్రశ్న నోటిలోనే వుండిపోయింది.

తాళం తీస్తుండగా "ఇక మీయింట్లో ఎవరూలేరేమిటి?" అడిగింది సుజాత.

నేను సమాధానం చెప్పకుండానే "రా! కూర్చో" అన్నాను.

కుర్చీలో కూర్చుంటూ గదినంతా ఒకమారు పరిశీలించింది. ఒక్కొక్క చిత్రాన్నే పరీక్షగా, తీక్షణంగా చూస్తున్నది. రామప్ప గుడి లోని రాధాకృష్ణుల బొమ్మను కేంద్రీకరించి చూస్తూ, అబ్బో! నీవు రసికు రాలివి కూడానే!" అన్నది.

నేను నవ్వి ఋగ్గలాగాను.

"సరే, ఇక నే వెడతానమ్మా! ఆ కొట్టుపని చూసుకుని ఇంటికి పోవాలి. మళ్ళీ ఆలస్య మవుతుంది" నవ్వుతూనే సుజాత లేచి నిల బడింది.

ఇంటికి వచ్చినదాన్ని వెంటనే పంపడం యిష్టంలేక "కొంచెం కాఫీ చేస్తాను కూర్చో" అన్నాను.

"బాగానేవుంది. మాకేమీ మర్యాదలక్కర్లేదమ్మా. మేమేమీ అను కోము.... ఇప్పుడు కాదులే సుబ్బులూ! బ్రత్కకాల్సినరోజులు యింకా చాల వున్నాయిగా" అని గడ్డం పుణికి, నామాట వినిపించుకోకుండానే గబగబా మెట్లుదిగి దాటిపోయింది. నేను మేడపైనుంచే "రిక్షా చేసుకు వెళ్ళు" అని కేకేశాను.

* * *

మా యింటి వెనుక ఆటస్థలం దినదినాభివృద్ధి చెందుతూన్నది. కౌన్సిలర్ శ్రీ మింగలేక నమలలేక చస్తున్నాడు. ఒకవేళ గట్టిగా మాటాడితే, అసలే కాలేజీ కుర్రాళ్ళు - ఏమిచేసి పోతారోనన్న భయం. అప్పటికీ ఒక కుర్రాడు ఏదో సందర్భములో చెవిటి ముసలమ్మను ఒక మొట్టికాయ గూడా తినిపించాట్ట. మూడురోజులు సాధిస్తూ, మూలుగు తూనే వుంది ముసలమ్మ.

కుర్రాళ్ళు ఒక కొత్త పల్లవి పట్టుకున్నారు.

"చూడచక్కని చిన్నది - ఆ
మేడ గదిలో నున్నది"

అని పాడుతూ, పైగా తమ సొంత కవిత్వాన్ని గూడా జోడిస్తుండేవారు.

కాలేజీ విద్యార్థులు సుజాతకూ, నాకూ కలిపి ఒక పసందైన పేరు పెట్టారు. ఏమంటే "జోడుగుండ్లబారు" అని. నిజంగానే ఎక్కడకి వెళ్ళినా జంటగానే వెళ్ళేవాళ్ళం. మాటాడితే ఇద్దరమూ మాటాడతాం, లేకుంటే ఇద్దరమూ గమ్మున కూర్చుంటాం. కాలేజీ ఆవరణలో నున్నంతకాలం ఉభయులం ఒకేచోట ఒకే పనిచేస్తుండేవారం.

మా జంటకు తగిన పేరేపెట్టారు. కాని సుజాతమాత్రం ఈ పేరు వినగానే మండిపడిపోయేది. ఏ వైపునుంచి వినవచ్చిందో ఆవైపుకు గురి పెట్టి చూసేది.

ఒకనాడు నేను రావడం ఆలస్యమయ్యేసరికి, సుజాత ఒక్కతే క్లాసురూములో కాలు పెట్టిందట. అంతకుముందే లెక్చరరుగారు కూడా వచ్చి కూర్చున్నారట. ఆయనక్కడ వుండగానే, ఒక కుర్రకుంక వుండ బట్టలేక "అయ్యో! సింగిల్ బారల్" అని పెద్దగా అరిచాడట. సుజాత కలుగచేసికోకముందే లెక్చరర్ కన్నెర్రచేసి, ఆ కుర్రవాడ్ని పిలిపించారట. క్షమించమని అతను వేడుకున్నా వినక, ప్రొఫెసరుగారికి ఫిర్యాదు చేసి కాలేజీనుంచి గెంటిస్తానన్నారట. అంతలో క్లాసునాయకుడు లేచి అసలువారికి పట్టనిదే, తమకెందుకింత కోపమని వాదన మొదలు పెట్టాడట. వాగ్వివాదాల మధ్యలో హడావిడిగా నేను ప్రవేశించాను. ఏడ్వ క్కటే తక్కువగా ఆ కుర్రవాడు చేతులు కట్టుకుని లెక్చరరుగారి ముందు నిలబడి వున్నాడు. నన్ను చూసేసరికి నాయకుడు మరికొంత గొంతు పెంచాడు.

"అతను కుర్రవాడు. తెలియక చేశాడు. తప్పని ఒప్పుకుంటూ, క్షమించమని కోరుతున్నాడు.... అతను చందాలతో చదువుకుంటున్నా

డని మీకూ తెలుసు. అటువంటి ఒక దిక్కు లేని నిరుపేద విద్యార్థిని ఒక చిన్న కారణానికి "డిబార్" చేయిస్తానని బెదిరించుతున్నారంటే ఏమ నాలో అర్థం గాకుండావుంది ...మరో మారు సానుభూతితో ఆలోచించ మని విద్యార్థు లందరి తరపున లెక్చరరుగారిని వేడుకుంటూ నేను కూర్చుంటున్నాను" అని గొప్పగా కూర్చున్నాడు.

సంగతేమిటని సుజాత నడిగాను. కండ్లు నలుపుకుంటూనే చెప్పింది. నేను వెంటనే లేచాను.

"క్లాసు లీడరుగారు బాగానే మాటాడారు. కాని నాదొక ప్రశ్న.... అతను కుర్రవాడే కావచ్చు; చందాలతోనే చదువుకుంటూ వుండవచ్చు. చందాలిచ్చే దాతలు చక్కగా చదువుకోమనిగాని, ఇలా ఆడపిల్లలను గోల చేయమని కాదే యిస్తుంట."

క్లాసంతా నిశ్శబ్దంలో జలకమాడింది.

"వెనుక తలిదండ్రులు సంపాదించిపెట్టిన ఆస్తి పాస్తులుంటే, అతను నిర్లక్ష్యంగా చదువుకున్నా, అసలు చదువుకోకపోయినా మన కెట్టి అభ్యంతరం లేదు. కాని ఈ కుర్రవా డలాకాదే? ఎంత శ్రద్ధగా చదువు కోవాలి? అతన్ని కించపరచాలనే అభిప్రాయంతో నేను మాటాడ్డం లేదు. అతనిపై సానుభూతితోనే నే నిలా అంటున్నాను. ఇకనైనా జాగ్రత్తగా మెసులుకోమని ఆ మిత్రునికి నా సలహా." ఎప్పుడూ క్లాసులో మాటాడి ఎరుగనిదాన్ని నేను మాటాడి కూర్చున్నాను.

లెక్చరరుగారు ఇంకా వదలిపెట్టలేదు.

"ఇది సుజాత తేల్చవలసిన విషయం. సుబ్బులు చెప్పినంత మాత్రాన పోయేదికాదు" అని సాగదీశాడు.

క్లాసులో గోల బయలుదేరింది.

నేను మళ్ళీ లేచి "సుజాత తరఫున నేను చెపుతున్నాను. అతన్ని వదిలేయండి" అన్నాను.

లెక్చరరుగారి అభిమానం దెబ్బతిన్నది. "సుబ్బులూ! నీ వెందుకు మాట్లాడుతావు?" అని గద్దించాడు.

"నేను మాట్లాడమంటేనే మాట్లాడింది" అని వెంటనే సుజాత అందుకున్నది.

లెక్చరరుగారికి కొంత బాధ కలిగించినా, ఈ సంఘటన విద్యార్థులలో మా పలుకుబడిని పెంచింది. ఆనాటినుంచి మేము లేనప్పుడేమైనా అనుకునే వారేమోగాని. మా యెదుటమాత్రం "జోడు గుండ్ల బారు" అన్న పదమే వినిపించలేదు.

ఇది జరిగిన మూడవరోజున మేడం నన్ను పిలచి "ఏం సుబ్బులూ! లెక్చరర్లను గూడా అదరగొట్టేస్తున్నావే!" అన్నది. నేను సమాధానం చెప్పక, నవ్వి వూరుకున్నాను.

"మన హిస్టరీస్ నీపై మోజు పడ్డాడు."

ఆశ్చర్యంతో నా నోటివెంట మాట రాలేదు. వెంటనే "నీవు ఆడదానివి కాదూ? సిగ్గులేదూ?" అన్నాను. ఆవిడ బిత్తర పోయి చూస్తున్నది.

"పైగా పిల్లలకు చదువు చెప్పడానికి వచ్చావా? నీ చదువు చట్టుబండలుగాను" అని నాల్గు చివాట్లుపెట్టి చకచకా దాటివచ్చాను.

ఈ విషయమై సుజాతకు చెపుదామా, వద్దా అని తర్కించుకుని, చివరకు చెప్పగూడ దనుకున్నాను. హిస్టరీస్ లెక్చరరుగారు దొంగ పిల్లివలె క్లాసులో కూర్చుంటున్నాడు. ఏమీ జరుగనట్లే, నా కేమీతెలియదన్నట్లే నేను నటిస్తున్నాను. రెండు మూడు రోజులలో ఆయనలోని బెరుకుకూడా సద్దు మణిగింది. మామూలు పెద్దమనిషిగానే కుర్చీలో ఠీవిగా కూర్చుంటున్నాడు. ఆ హంగు చూసినప్పుడు మాత్రం "అబ్బో! అంతా పెద్దమనుషులే!" అనిపించేది.



ఎవరు పెద్ద మనుషులో, ఎవరు చిన్నమనుషులో నిర్ణయించడం కష్టమైనపని. అంతా పెద్దమనుషుల్లాగే కనిపిస్తారు. న్యాయ సూత్రాలు, ధర్మ పన్నాలు వల్లిస్తుంటారు. సమయమొచ్చినపుడుగాని అసలు రంగు తేలదు.

సుజాత తమ ఇంటికి తీసుకెళ్ళి, వాళ్ళ నాన్నగారిని నాకు పరిచయం చేసింది. దారిలోనే చెప్పింది-కొంచెం గలగల మాటాడే స్వభావమైనా స్వతహాగా చాలా మంచివారని.

నన్ను చూడ్డంతోనే అడిగారు. "ఈ అమ్మాయేనా సుబ్బులంటే?"

అవునన్నది సుజాత.

"అమ్మాయి సుబ్బులూ! నిన్ను గురించి చాలా చెప్పింది మా సుజాత. ఆ చెప్పినవన్నీ నిజమేనని, నిన్ను చూసిన పిదప నమ్ముతున్నాను. కుర్చో."

"నిన్ను చూస్తుంటే మహాబలిపురంలో నేను గడిపిన దినాలు గుర్తు కొస్తున్నాయి" అనగానే నేను నవ్వకుండా వుండలేక పోయాను. సిగ్గుతో తలవంచుకుని సుజాతను ఆసరా చేసుకున్నాను.

"ఒక్క సౌందర్యమేగాక, నీలో తెలివితేటలుగూడా బహుళమట?"

"అదేం లేదండి" తలవంచుకునే సమాధానం చెప్పాను.

"అదిగో? అలా అంటేనే నాకు కోపం. తెలివితేటలులేని వెధవలంతా, రొమ్ము విరుచుకుని రోడ్లనిండా తమ తెలివిని ప్రదర్శిస్తుంటారు. స్వతహాగా తెలివైనవారేమో అవునన్నా కాదనుకుంటూ తప్పుకుపోతారు. ఈ స్వభావంమాత్రం నాకు సుతరాము గిట్టదు....నీకేమైనా కోపంరానీ, నాకు మాత్రం చెడ్డకోప మొస్తున్నది. చెపుతున్నా నమ్మాయ్" లేచి అటూ యిటూ తిరుగుతున్నారు.

అసలు మనిషి చూడ్డానికే అదో రకంగా వుంటారు. ఎర్రతేలుకు మల్లే సన్నగా ఉండటం మూలాన వున్న పొడవుకంటే మరీపొడుగన్నట్లు కనిపిస్తుంటారు. ఆయన తిరుగుతూ మాటాడుతుంటే క్రొత్తవారెవరైనా నవ్వకుండా వుండలేరు. స్థిమితంగా ఒకచోట కూర్చోరు. బూటుకు లేస్ కట్టుకుంటున్నాసరే తిరుగుతూ కట్టుకోవలసిందే.

"సరే ఇప్పుడు మాట్లాడుకుందుకు టైములేదు. సావకాశంగా కూర్చుని మాట్లాడుకుందాం....ఇదిగో సుబ్బులూ! చెపుతున్నాను. ఇక

నుంచి రోజు కొక్కసారయినా ఇక్కడి కొచ్చి, నాకు కనిపించి పోతుండాలి. సరేనా?" అంటూనే చెప్పే మాటయినా వినిపించుకోకుండా చక్కాబోయారు.

"బలే విచిత్రమైన వ్యక్తి" అనుకుంటుండగానే సుజాత వాళ్ళ అమ్మగారు లోపలి గదిలోంచి బయటికొచ్చింది. సూర్యప్రకాశరావుగారు ఎంతసన్నమో, ఆవిడంత లావుపాటి మనిషి. వస్తూనే ఏవేవో ఫలహారాల వాగన్ పట్టుకొచ్చింది.

"ఇంతవరకు లోపలిగదిలో కూర్చుని తింటోంది కామోసు" ననుకుని లోలోనే నవ్వుకున్నాను.

"ఏమిటమ్మా నవ్వుకుంటున్నావ్? నేనింతలావుగా వున్నాననేనా?" పసిగట్టినట్లే మాటాడింది.

నేను కంగారు పడుతూ "అబ్బే లేదండి. అందుకుగాదు" అన్నాను.

"నిన్ను చూస్తే ఎవ్వరికీ నవ్వురాదులే" అని సమర్థించ జూచింది సుజాత.

"ఏం చేయమంటావు తల్లీ! నే నేం కావాలని పెంచుకున్నానా?" బాధపడుతూనే అంది వాళ్ళమ్మగారు.

"శరీరం లేనివారేమో, అయ్యోనేనింత బలహీనంగా వున్నానని బాధ పడిపోతుంటారు. ఉన్నవారేమో నలుగు రేమనుకుంటున్నారోనని, ఇలా దిగులుపడిపోతారు. సహజమేగదా!"అని నాకు తోచింది. అనేశాను.

ఆమె సంతోషించింది.

"అంతేనమ్మా! ఉన్నా దిగులే; లేకున్నా దిగులే....ఇదిగో ఇవి తినండమ్మా" అని ఫలహారాలు బల్లపై వుంచుతూ ఒకముక్కతీసి తనూ నోట్లో వేసుకుని, తిరిగి వెళ్ళిపోయింది.

సుజాత ఫలహారాల నందుకుంటూ "మర్చిపోయా సుబ్బులూ!చాల దినాలనుంచి అడుగుదామనుకుంటూనే మర్చిపోతున్నా....మీయింట్లో నీవు తప్ప మరెవరూ లేరా? మీ నాన్నగారు చనిపోయారన్నావు. ఇక నిన్ను చూసేవారే లేరా?" అడగరాని ప్రశ్న అడిగింది.

ఏమిటి చెప్పాలి? అబద్ధమాడేయనా? నిజం చెప్పనా? నిజం చెపితే నా కిప్పుడున్న గౌరవం దక్కుతుందా? చిన్నచూపు చూడరా? అసలు అసహ్యించుకుంటా రేమో? నా అందం, జ్ఞానం పనికిమాలినవై కొరగాకుండా పోతాయేమో.... కాదు. ఎన్నటికీ కాదు. నన్నిప్పుడు గౌర విస్తున్నారంటే నాలోని బుద్ధికుశలత, దేహ సౌందర్యం వల్లనేగాని, నా గత చరిత్రను గురించి కాదే! మా పరిచయాలు మా మా మంచితనాల వల్లగాని, నా వంశవృక్షాన్ని చూచి కాదే!....మనిషిగా నన్ను గౌర విస్తారు. అంతేగాని కుల గోత్రాలను బట్టి మనిషిని నిర్ణయించరు. నా కుండే గౌరవం తప్పక నాకుంటుంది. నా వ్యక్తిత్వాన్ని అనుమానించరు. అవమానించబోరు.... అందులో సుజాత యెదుటనా దాపరికాలు? లేదు. సుజాతఎదుట అబద్ధ మాడలేను. నిజమే చెప్పేస్తాను.

"ఏమిటి సుబ్బులూ ఆలోచిస్తున్నావు?"

"నా కథ వింటావా?"

తేరి చూసింది సుజాత. "విషాదాంతమైతే వినలేను."

"మాకు సుఖాంతా లెక్కడినుంచి వస్తాయి సుజాతా?"

"అయితే వుండు. ఈ ఒక్క పకోడీ తిననివ్వు. తర్వాత తీరిగ్గా కూర్చుని ప్రశాంతంగా విందాం" అని ఉన్న నాలుగు ముక్కలు నోట్లో వేసుకుని బొక్కుతున్నది.

నా కప్పుడు ఎంత అసహ్యం పుట్టిందో చెప్పలేను. కాని వెంటనే నవ్వు తెచ్చుకున్నాను.

"ఊఁ ఇక గ్రంథం విప్పు"

"ముందుమాట కొంచెం చెప్పాలి. కథలో ప్రవేశించకముందే తొలిపలుకు చెప్పకిపోతే విషయాన్ని-సరిగా గ్రహించవలసిన విధంగా మనం గ్రహించలేము....నే నా నాడు నీకు చెప్పాను. నేను పైకి కనిపించేంత అందగత్తెను కాను....నామనసు పూర్తిగా వికలమైపోయిందని."

"అవును నాకు గుర్తున్నది."

"ఎందువల్ల నా మనసు వికలమైపోయింది? చిన్న వయసులోనే, నాలో కల్గిన ఈ వైకల్యానికి కారణమేమిటి?....నేను జన్మించిందే అంత

నికృష్టంగా జన్మించాను సుజాతా! నాతండ్రి ఎవరో తెలుసుకోలేనంత నీచస్థితిలో నేను జన్మించాను. పుట్టగానే పూవు పరిమళిస్తుంది అన్నట్లు, పుట్టుకతోనే నేను తల్లిని పోగొట్టుకున్నాను. నా తల్లినిగన్న తల్లి-నన్ను పెంచింది. ఆమెనూ పొట్టన బెట్టుకున్నాను. తాతయ్య నన్ను పెద్దదాన్ని చేసి, తన పని తీరినట్లు పోయాడు.... ఒంటరిదాన్ని. తండ్రి ఎక్కడ ఏం చేస్తుంటాడో తెలియదు ...ఇంక నే నేం చేయాలి?"

"మీనాన్న చనిపోయాడన్నావుగా?" మధ్యలో ఆపింది సుజాత.

"అబద్ధమాడాను. నీ ముఖంచూస్తూ ఆడలేకనే అబద్ధమాడాను. నా తండ్రి ఎక్కడున్నాడో నాకు తెలియదు. నే నిప్పుడు ఒకడికి ఉంపుడు గత్తెను. శీలాన్ని అమ్ముకుని చదువు కుంటున్నాను. రేపు వాడొదిలి పెడితే...."

"ఆపు. ఇక నీకథ నా కక్కరలేదు. నే వినలేను." లేచి గబగబా వెళ్ళిపోయింది.

"సుజాతా! సుజాతా!"

ఆగమన్నా ఆగకుండా మేడమెట్లెక్కి పోయింది.



ఇదీ సమాజంలో నాకున్న స్థానం. ఇదీ నాకిచ్చే గౌరవ సత్కారం. ఇకీ ప్రపంచంలో ఎవరిని నమ్మేట్టు? ఎవరిని ప్రేమించేట్టు? అబద్ధ మాడలేక నిజం చెబితే, నా మొహానే పట్టుకు ఉమ్మేస్తారా?.... అంతే. ఈ లోకానికి కావలసింది అబద్ధం, దగా, మోసం. ఎంత అన్యాయం చేయగలిగితే వారంత మంచివారవుతారు. ఎంతకుళ్ళుతో కపట నాటక మాడితే వారంత బుద్ధిమంతులవుతారు.... కాకపోయినా నేను చేసిన ఘన కార్యమేమిటి? ఒక ఆడముండ దగ్గర అన్నీ చెప్పేయడమా? అసలు నే పెట్టుకున్న ఆదర్శమేమిటి? అందరినీ వంచన చేయడంగాని ఒక ఆడ ముండకు లొంగిపోవడం కాదే? వయసొచ్చి మీద పడుతున్నా బుద్ధి వికసించదేం భగవంతుడా! ఎన్నిసార్లు లెంపలు వాయించుకున్నా నాకు బుద్ది రాదేమిరా!

రెండురోజులవరకు కాలేజీకి వెళ్ళలేక పోయాను. కౌన్సిలర్ యిప్పుడు పగటిపూట కూడా రావటం మొదలు పెట్టాడు. ఎవరికీ ముఖం చూపించకుండా, యింట్లోనే పడి కుమిలి చద్దామంటే పగలు పదిగంట లకే తయారై, కౌన్సిలరు కులకబోతాడు.

ఆ బాధనుండి తప్పించుకుందామనే, మూడోనాడు బయలుదేరి కాలేజీకి వెళ్ళాను. మామూలుగా వుండాలని ఎంత ప్రయత్నించినా ముఖం చెపుతూనే వుంది. "సుజాత ఇక నాతో మాటాడదు. తమ యింటి లోని వారందరికీ నాకథ వినిపించి వుంటుంది" అనుకుంటూ కాలేజీ ఆవ రణలో అడుగు పెడుతుండగానే "మేడం" ఎదురయింది.

"ఏం సుబ్బులూ! జ్వర మొచ్చిందా?"

"అవును. వచ్చింది మాయరోగం" అని కసిరికొట్టాను.

"ఎంత అందమైన ఒళ్ళయినా అంతగా క్రొవ్వకూడదు."

హడలిపోయాను. పెద్ద బండెత్తి మాడుమీద కొట్టినంత పనయింది,

"క్షమించండి. ఏదో ధ్యాసలో వుండి...." పూర్తి చేయకుండానే అక్కడ నిలబడలేక వచ్చేశాను. క్లాసు రూములో కాలు పెట్టేందుకే భయం వేస్తున్నది.

ఇక కాలేజీ పరిసరాలలోనే నిలబడలేక చకచకా నడచి బయటి కొచ్చాను....ఎక్కడికి పోయేట్టు? కుతకుతలాడుతూ లావాద్రవంలా ఉడికిపోతున్నది తల....నడుస్తున్నాను. సందులూ, గొందులూ దాటి పోతున్నాను విశాలమైన వీధులూ, భవనాలూ వెనుకబడి పోతున్నాయి. చేతిలోని పుస్తకాలపై విసుగొచ్చింది. వెధవ గాడిదబరువని విసరబోయే సరికి, ఎవరో నావంక చూస్తున్నట్లయి సిగ్గుపడి దాచుకున్నాను.

త్వరత్వరగా కొంత నడిచేదాన్ని. అలసిపోయి కొంతసేపు అడు గులో అడుగు వేసేదాన్ని. అలా నడచి నడచి, నే నెక్కడున్నానో చూసుకున్నాను. ఎదురుగా స్టేషన్ కనిపించుతోంది. వెళ్ళాను. అప్పుడే సంతర్పణ జరిగిపోయిన సత్రంవలె స్టేషను బోసి కొడుతున్నది.

సోడాకొట్టులో కూర్చున్న కుర్రవాడు నావంకే చూస్తున్నాడు. ఒక్క సోడా తాగుదా మనిపించింది.

"అబ్బాయ్! ఒక్క సోడా యిస్తావూ?"

కొట్టనే కొట్టేశాడు. తాగి, వస్తానని చెప్పి వచ్చేస్తున్నాను.

"డబ్బు. డబ్బు .... డబ్బివ్వలేదు" గొంతు పిసుకుతున్నట్లు అరిచాడు.

అంత అలసటలో వున్న నాకే నవ్వు వచ్చింది.

వెనుదిరిగి వెళ్ళి "డబ్బంటే నిన్నెందుకు అడిగేదాన్ని" అన్నాను.

కుర్రాడికి సగం పిచ్చెక్కింది.

"వస్తా. ఎప్పుడైనా కలుస్తాలే" అని స్టేషన్‌నుంచి చక్కా బయటికొచ్చాను. ఇప్పుడే ఈ లోకంలో దిగినట్లు నలుదిక్కులా కలియ చూశాను. ఎక్కడికో వెళ్ళిపోయిన నామనసు తిరిగి నా వద్దకు చేరుకుంది. ఇంటినుంచి బయలుదేరిన క్షణంనుంచి ఏమేమి చేశానో, ఒక్కమాటు స్ఫురణకు తెచ్చుకున్నాను. నా పిచ్చితనానికి నేనే నవ్వుకుని ఇంటిముఖం పట్టాను.

  

కడుపారా ఏడిస్తే ఎంత హాయిగావుంటుందో చాలమందికి తెలియదు. ఏ కష్టమొచ్చినా దివ్యౌషధంలా గుణమిస్తుంది ఏడుపు. మురిగి మురిగి చావకుండా కడివెడు కన్నీటితో ఎంతలావు కష్టాన్నయినా కడిగి శుభ్ర పరచుకోవచ్చు.

నా కిప్పు డలాగే తలంటి స్నానం చేసినట్లున్నది. నిశ్చల మహా నదిలో తెరచాపగూడాలేని తొట్టిపడవలా తొణుకు బెణుకు లేకుండా వున్నాను. కౌన్సిలరబ్బాయి ఎంత త్వరగావస్తే అంతమంచిదనిపిస్తున్నది.

వీధివైపు వసారలోకొచ్చి తొంగిచూశాను. మళ్ళీ నాతల చెదిరి పోయింది. కౌన్సిలరబ్బాయినిఊహించుకుంటుంటే సుజాత కండ్లబడింది. పెద్దముత్తయిదువులా రిక్షాలోంచిదిగుతున్నది. ఆముఖంచూసేందుకే మన సొప్పక, చకచకాలోనికెళ్లి తలుపు మూసివేశాను. మంచమీద కూర్చుని

'ఇంకా వస్తుందా? పిలుస్తుందా పాడుచచ్చినముండ' అనితిట్టుకొంటున్నాను. తలుపుగొడుతున్న చప్పుడు చెవినపడుతున్నది. నోరెత్తి పిలవక, తలుపు మీదే తన బలం చూపెడుతున్నది.

తల నొప్పివచ్చినట్లయి "ఎవరమ్మా నీవు ?" అంటూ తలుపు తెరిచాను.

ముఖంచూడగానే నోటిమాట పడిపోయింది. "నాన్నగారు నిన్నొకసారి రమ్మన్నారు."

"రానని చెప్పు. ఎన్నటికీ మీ గుమ్మం తొక్కనన్నానని చెప్పు. పో. వెళ్లు." ముఖం చూడకుండానే దభేలున తలుపుమూసేశాను.

ఆ తరువాత ఏమి జరిగిందో నాకు తెలియదు. ఆలోచించేశక్తినే కోల్పోతున్నాను. ఏదైనా ఆలోచన మొదలుపెడితే ముందుగా తలనొప్పి తయారంటూ వస్తున్నది. దానితో సర్వేంద్రియాలు సమ్మెకట్టినట్లు శరీరం బిగుసుకు పోతున్నది.

బద్దలై పడిపోతుందేమో నన్నంత బలంగా తలుపు బాదితేగాని. నిద్రనుంచి నాకు మెలకువ రాలేదు. కన్ను తెరిస్తే తలనొప్పి ఊడిపడేట్టుంది. అరకన్నులతోనే లేచి తలుపుతీశాను.

కౌన్సిలర్ శ్రీ పళ్లు పటపటలాడించుకుంటా "సాంతం చచ్చావను కున్నాను. లేచావేం? బజారంతా లేస్తేగాని నీకు మెలకువరాదేం?.... ఏ మొగుడు ఒళ్లో పడుకుని కలలు కంటున్నావ్ ..." ఏవేవో మాటలు ఎక్కడో దూరాన్నుంచి వస్తున్నట్లు వినవస్తున్నాయి.

నేను నోరువిప్పి మాటాడేస్థితిలో లేను. కంటివెంట నీరుకారి పోతున్నా తుడుచుకోవాలన్న జ్ఞానమే నాకు కలుగలేదు అలాగే ఏడుస్తూ నిలబడ్డాను.

"ఇంకా ఏడుస్తావు దేనికి? ఒంటరిగానే పడుకోలే. నే నిక్కడ చాపమీద చస్తాను."

కౌన్సిలర్ కాళ్ళపైబడ్డాను.... కౌగలించుకున్నాను.... నీవే దిక్కని నా సర్వస్వాన్నీ అర్పించి వేశాను.

♦ ♦ ♦

గడియారం నడచిపోతున్నది. గంటలు, దినాలు, వారాలు గడచిపోతున్నాయి. గడియారం వలెనే నేనూ. పన్నెండు గంటలూ చుట్టివచ్చి బయలుదేరిన బిందువు నెలాచేరుకుని తిరిగి ప్రయాణం కడుతుందో అదే తంతు. ఉదయమైంది కాబట్టి లేవడం, ఆకలవుతోంది గాన తినడం, నిద్ర వస్తోంది గనుక నిద్రపోవడం, ఏదో చేయాలిగనుక పనిచేయడం. ఆ యంత్రంవలెనే నేనూ దొర్లిపోతున్నాను.

సుజాతపై నా కిప్పుడు శతృత్వంగానీ, మిత్రత్వంగానీ లేదు. ఏదైనా పెన్సిలు అడిగే పనిలాంటిదుంటే పలుకరిస్తాను; లేకుంటే లేదు. కాలేజీలోని అందరు విద్యార్థులెంతో, సుజాత గూడా నా కిప్పు డంతే.

సుజాతగూడా క్లాసులో వున్నదా లేదా అన్నట్లే వుంటున్నది. మాలో కలిగిన ఈ పరిణామానికి ఎవరేమనుకున్నారో నాకు తెలియదు. లలితమాత్రం ఒకసారి అడిగింది: "ఏమిటి, మీ రిద్దరు పోట్లాడుకున్నారా?"

"లేదే? మాటాడుకుంటూనే వున్నామే. ఏం సుజాతా?" అని పలుకరించాను.

"అవును" అని వూరుకుంది సుజాత.

ఇక మా ఉభయుల మధ్య ఎలాంటి సంభాషణా జరుగలేదు.

ఒకనాటి సాయంత్రం కాలేజీ వదలిపెట్టారు. ఒంటరిగానే నేను బయటి కొస్తున్నాను.

"ఏమ్మా సుబ్బులూ! సుజాత వెళ్ళిపోయిందా?"

తలెత్తి చూశాను. సూర్యప్రకాశరావుగారు! ఎన్నో లంకణాలు చేసి ఈదినమే బయటి కొచ్చినట్లు తెల్లగా పాలిపోయి వున్నారు. మామూలుగానే బలహీనంగా వుంటారు. ఇప్పుడు మరీ గుర్తించ లేనంతగా మారిపోయారు.

నేనేమీ సమాధానం చెప్పకుండానే, అలాగే నిలబడి విస్తుపోయి చూస్తున్నాను.

"సర్లే, వెడదాం రామ్మా! నీకొరకే వచ్చాను."

నా కాశ్చర్యం వేసింది. మారు మాటాడకుండా వారి ననుసరించాను. గేటు దాటగానే జట్కా పిలిచారు. ఇద్దరం కూర్చున్నాము. మూల మలుపు తిరగగానే సుజాత కనుపించింది. జట్కా నాపి సుజాతను గూడా ఎక్కమన్నారు.

సుజాతకూ నాకూ మధ్య సూర్యప్రకాశరావుగారు కూర్చుని,కండ్లు మూసుకుని ఏదో తలపోస్తున్నారు. గుర్రపుడెక్కల చప్పుడు తప్ప మరేమీ వినిపించడంలేదు. బండివాడు కూడా నిశ్శబ్దంగానే పోతున్నాడు. నే నొక్కమాటు ముగ్గురి ముఖాలవైపు చూశాను. పైకి మాటాడకుండా మౌన ముద్రలో వున్నారన్న మాటేగాని, లోలోన ఏవో ఘోషలు భీకర యుద్ధం చేస్తున్నాయని తెలుస్తూనే వుంది. ఎవరికీ ఆ నిశ్శబ్దాన్ని చీల్చే శక్తిలేకపోయింది. రోడ్డుమీద గోలకాదుగదా రవ్వంత గాలియైనా మా బండిలోకి జొరబడలేకున్నది. అప్పు డప్పుడు ఒకరి శరీరా లొకరికి తగులుతుండటంవల్ల ప్రపంచజ్ఞానం మమ్మల్ని పూర్తిగా వదలి పోలేక వుంది.

"బాబుగారూ? ఇక ఎటుపోవాలి?"

బండివాని ప్రశ్నకు మేమందరం కండ్లు తెరిచాము.

"అదిగో ఆ కనుపించే మేడ. రంగువేసివున్నదే. అదే."

జట్కా ఆగింది. దిగి సూర్యప్రకాశరావుగారి వెంట మేడపైకి నడిచాము. చేతిలోవున్న పుస్తకాలతోపాటు సుజాతా, నేనూ కోర్టులో ముద్దాయిలవలె కూర్చున్నాము. సూర్యప్రకాశరావుగారు లోపలి గదిలోకి వెళ్ళి, వెంటనే తిరిగి వచ్చారు. ఒకరి ముఖాలొకరు చూసుకునే ధైర్యం కూడా మాలోలేదు. అటువంటప్పుడు పిల్లిమెడలో గంట కట్టేదెవరు?

జగదాంబగారు మూడు గ్లాసులతో పండ్లరసం తెచ్చిపెట్టి సద్దు చేయకుండానే వెళ్ళిపోయారు. సూర్యప్రకాశరావుగారు ఒక గ్లాసు అందుకుంటూ, మిగతావి తీసుకొమ్మని కండ్లతోనే సైగ చేశారు. గాజుల చప్పుడైనా లేకుండా గ్లాసులు నిండుకున్నాయి. మృత్యువు అడుగుల చప్పుడువలె గోడ గడియారం టిక్కుటిక్కుమని వికృత శబ్దం చేస్తున్నది.

సూర్యప్రకాశరావుగారు లేచి అటూ ఇటూ తిరుగ నారంభించారు. అంటే ఇకేదో ప్రళయ మున్నదన్నమాట!

"సుజాతా! సుబ్బులుతో నువ్వు మాట్లాడ్డం లేదుకదూ?"

సుజాత మాటాడలేదు.

"నీవూ మానేశావుగా సుబ్బులూ?"

నేనూ సమాధానం చెప్పలేదు.

"అయితే మీరిద్దరూ నాతో మాట్లాడరా?"

ఇద్దరం మాటాడలేదు.

"మాట్లాడాలి. మాట్లాడాలనే నే నీవేళ లేచాను." గద్దించినట్లు మాటాడారు సూర్యప్రకాశరావుగారు.

మే మిద్దరం సర్దుకు కూర్చున్నాము.

"సుబ్బులూ! ముందు నిన్నడుగుతున్నాను.... ఈ గడప తొక్క నన్నావు- ఎందువల్ల? మే మేం పాపం చేశాము?"

పాపమనే శబ్దం వినబడగానే నాకు శివమెత్తి నట్లయింది. కసి బట్టిన పాములా బుసపెట్టాలనిపించింది.

"నీ కూతురు నన్నవమానించింది. ఇంటికి తీసుకొచ్చి బయటికి నడవమన్నది.... అబద్ధ మాడలేక నిజం చెబితే నే నంతచెడిపోయిన దాన్నయినాను. నా మొఖం చూస్తేనే మీకు పంచపాతకాలు చుట్టు కుంటాయి" ఇక మాటాడలేకపోయాను.

"అందుకని మాకు పాపం చుట్టుకుంటుందని, ఈ గడప తొక్క నన్నావన్నమాట?"

"మీరు మంచిమనుషు లనుకున్నాను. మనసిచ్చి మాటాడినా మోసపోననుకున్నాను."

ఏడ్పు ఆగలేదు, పెద్దగా ఏడ్చేశాను.

సూర్యప్రకాశరావుగారు కండ్లనీరు కార్చుతూనే నా కండ్లు తుడిచారు.

"ఎలా అనుకున్నావు- మేము మంచి మనుషులమని? మంచిని ఈ సమాజం మననిస్తుందా? వెదకి వెదకి పట్టుకుని విషం కక్కించేవరకు

వదలి పెడుతుందా? దానినుంచి మేమెలా తప్పించుకోగలం?....చిన్న
ప్పుడు అనుకునేవాడ్ని- దాని బారిని పడకుండా ఆ విషకోరలు ఊడబెర
కాలని....కాని నేనే ఓడిపోయి దాని గులామునయ్యాను. ఇక మాలో
మంచికి స్థానంలేదు. సమాజంలోని కుళ్ళు శరీరమంతా ప్రాకి తల
కెక్కింది. మేమిప్పుడు సగటు మనుషులం. సానుభూతికి గూడా మాలో
స్థానంలేదు." ఆయాసపడుతూ మాటాడలేక కూర్చుండిపోయారు.

జగదాంబగారు లోపలినుంచి బయటి కొచ్చారు.

"ఏం ఫరవాలేదు. అప్పుడే చనిపోను....కాని సుబ్బులూ! సిగ్గు
పడవలసింది నీవుకాదమ్మా, మేము. మేము సిగ్గుపడాలి ... నీకెందుకు
సిగ్గు? నీ దుర్దశకు కారణం నీ తండ్రి ఒక్కడేకాదు. నేనూ, వీరూ, ఈ
సమాజమంతాను. నీవు పుట్టకముందే నీ దుర్దశను పుట్టించి, వ్రాసి
వుంచాము. పుట్టగానే తీసి నీ మెడలో వేశాము. అయిపోయింది.....
ఎవడినో దౌర్భాగ్యుడ్ని పెట్టుకుని నా బిడ్డ చదువుకుంటున్నదంటే సిగ్గు
పడవలసింది నేనమ్మా....నా బిడ్డకాదు....నేను."

  

ప్రపంచంలో మంచిలేదంటూనే ఒక మంచిమనిషి కనుపించాడు.
ఇలాంటి మనుషులు కొద్దిమందిఅయినా వుండబట్టే నాలాంటివారు బ్రతుకు
తున్నారనుకుంటాను. సమాజమంతా కుళ్ళిపోయిందని అనిపించినా,
ఇలాంటివారు, ప్రత్యక్షమై బ్రతుకుపైని ఆశను పోస్తారు. ఆ ఆశ
కొన్నాళ్ళవరకు గలగల పారుతూ, తిరిగి వుప్పెనగావచ్చిన మురికి
నీటితో కొట్టుకుపోతుంది.

కాలేజీ వదలిపెట్టగానే సుజాతతో కలసి సరాసరి వారి యింటికి
వెళ్లేదాన్ని. నాన్నగారితో ఒకగంట మాటాడితేగాని, ఆ దినం తృప్తిగా
వుండేదికాదు

రోజుకో విషయంపైని చర్చలు సాగేవి. ఒకనాడు అనుకోకుండా
మా చర్చ వివాహాలపైకి మళ్ళింది.

"నా అభిప్రాయంలో ప్రస్తుత వివాహవిధానం మృగప్రాయ
మైనది" అన్నారు నాన్నగారు.

"ఏం? ఎందువల్ల?" అని అడిగింది సుజాత.

"రేపు నీవు పెళ్ళిచేసుకుంటావు. ఎలాంటివాడిని? ముక్కూ మొహం ఎరుగనివాడ్ని. ఎన్నడూ చూసెరుగనివాడ్ని భర్తగా స్వీకరిస్తావు. తలిదండ్రులు ఎవరిని నిర్ణయిస్తే-వాడే నీభర్త."

"లేకుంటే నేనే వెతుక్కోవాలా?"

"నీ కర్మ. నీ కంత తెలివిలేకపోయింది. నేనేం చేయను? వెతుక్కోమని యిప్పుడు హెచ్చరించినా నీవు వెతుక్కోలేవు. ఒకవేళ ఇప్పుడా స్వాతంత్ర్యం యిచ్చామంటే పూర్తిగా చెడిపోయి కూర్చుంటావు."

"నాకు అర్థం కాలేదు" అన్నది సుజాత.

"అర్థంకాదు. ప్రపంచజ్ఞానం శూన్యమైనవారికి వరుణ్ని వెతుక్కునే తాహతులేదు. అందుకనే తలిదండ్రులు జాగ్రత్తపడి, ఆ బాధ్యతను తాము వహిస్తారు."

"అంటే ప్రపంచంజ్ఞానం కావాలనేగా మీ అర్థం?"

"ప్రపంచంలో వుండే మంచిచెడ్డలను గుర్తించే జ్ఞానం రావాలి. తెల్లగా కనుపించేవన్నీ పాలనీ, నల్లగా కనుపించేవన్నీ నీళ్ళనీ, మీ స్త్రీజాతి తేలికగా భ్రమిస్తుంది. అవునులే. మిమ్మల్నని ఏం ప్రయోజనం? మీకిచ్చిన తర్ఫీదు అలాంటిది."

"అవును. నాలుగుగోడలమధ్య బంధించివేస్తే మేమిక మంచి చెడుగులను గూర్చి తెలుసుకునే దెక్కడ?" మంచి ప్రశ్న అడిగింది సుజాత.

"గోడదాటి చూడనిస్తే చెడిపోతారని మా భయం. ఆ భయంతోనే మిమ్మల్ని చేతులారా పాడుచేస్తున్నాము.... ఆడది బయటి కొచ్చిందంటే, నలుగురూ ప్రోగై నిలబడి చూస్తుంటారు. ఎందువల్ల? ఇప్పటివరకు గుప్పిటలో కప్పి వుంచబడుతోంది స్త్రీ.... గుప్పిటలో దాచినవస్తువును చూడాలనేంత ఆతురత, పైకగుపించే వస్తువుపై వుండదు. ఇదే సర్వసాధారణమైతే ఆడవాళ్ళు త్వరలో చెడిపోవడానికిగానీ, ఇంత అవినీతికి అస్కారంగానీ వుండదు."

"నే నొప్పుకోను. ఆడది బయటికి పోయిందంటే ఖచ్చితంగా చెడిపోయిందన్నమాటే" అన్నాను నేనూ కల్పించుకుంటూ.

"నీ వేమాత్రం చెడిపోయినావు సుబ్బులూ?" అని నన్నే ఎదురు ప్రశ్న వేశారు. సమాధానం చెప్పేలోపుగానే తిరిగి నాన్నగారు అందు కున్నారు.

"నీకంటే సుజాత బాగా చెడిపోయింది, అంటే నీవుగూడా కొద్దో గొప్పో చెడిపోయావని నా భావన కాదు. సుజాతవరకు ఆలోచిస్తే ఏమీ తెలియదని నా అభిప్రాయం. తెలియని తనమనేది పట్టి అమాయకతగా జమకట్టి, ఏమీ ప్రమాదంలే దనుకుంటాము. కాని ఈ తెలియని తన మంత ప్రమాదం మరొకటిలేదని నా అభిప్రాయం. తెలియనితనం పేరు క్రింద క్షమించరానటువంటి ఘోర నేరాలు వీరు చేస్తుంటారు. చిన్న వుదాహరణకు మొన్న నీవు నిజం చెబితే సుజాత బిగదీసుకు పోయింది. నీతో మాట్లాడేందుకే యిష్టపడక నిన్ను ఏడ్పించింది. నన్నూ ఏడ్పించి, నాకు జబ్బు తెచ్చిపెట్టింది. నీవుకూడా మొండికి తిరిగినట్లయితే నాగతేం కావాలి సుబ్బులూ!....అందుకే అంటున్నాను. తెలియనితనం, పిరికితన మనేవి మహా భయంకరజాడ్యాలు. మంచి ఏదో, చెడు ఏదో నిర్ణయించు కోలేని శక్తిహీనులు తమకు తెలియకుండానే పరులకు హాని చేస్తుం టారు. తమకు తామై ముప్పు తెచ్చుకుంటారు.

తెలుసుకోగోరేవారు సమాజంలోకి దిగి నాల్గు దెబ్బలు తిన్నా, ఇక ముందైనా జాగ్రత్తపడేందుకు అవకాశమున్నది. బొప్పితిన్న తల చూస్తూనే నడుస్తుంది. ఒక రిద్దరు ఆడవాళ్ళు తిరిగి చెడిపోయినా ఆ అను భవాన్ని స్త్రీలోకమంతా తీసుకుంటుంది. అంతేగాని తిరిగిన ఆడదల్లా చెడి పోదు....చెడిపోతున్నదంతా కేవలం నాలుగు గోడలమధ్య వంటింటి పిల్లిగా కూర్చోవడంవల్లనే."

నాన్నగారు కూర్చున్నారు. నాకు పరమానందమైపోయింది. ఏ కాలేజీ లెక్చరరుగూడా మాకు కావలసిన ఈ విషయాన్ని గూర్చి, ఇంత విపులంగా చెప్పలేదు. నే నీ నాడు ఎంతో నేర్చుకున్నాను.

"నాన్నగారూ!" అని లేచి వెళ్ళి కాళ్ళకు నమస్కారం చేయకుండా వుండలేకపోయాను. ఆనందభాష్పాలు రాల్చుతూ నాన్నగారు నా తల నిమిరారు.

♦ ♦ ♦

ఇంటికి చేరగానే విషాదం. "సుబ్బులూ! మా ఆవిడ పోయింది."

కౌన్సిలరబ్బాయి నోటివెంట ఎంతో బరువుగా వెలువడిం దీవార్త.

"ఎప్పుడు? ఇంత అకస్మాత్‌గా ఎలా సంభవించింది?"

"రాత్రి నే నిక్కడకి వచ్చిన వెంటనే పోయిందట."

"జబ్బేమయినా వుందా?"

"చనిపోవడంకాదు సుబ్బులూ! ఎవడితోనో లేచిపోయింది."

కొద్దిసేపటివరకు నేనేమీ మాటాడక "తెలియనితనం" అని అతి మెల్లగా అన్నాను.

"నీకూ తెలియదు" అంటూ లేచాడు కౌన్సిలర్‌శ్రీ. మళ్ళీ చతికిలబడి, మోకాళ్ళపైని తలపెట్టి బూడిద గుమ్మడికాయవలె కూర్చున్నాడు.

"ఎవడితో పోయిందో ఏమిటో ఆరాతీయలేదా?" దగ్గరకు వెళ్ళి కూర్చుని నెమ్మదిగా, అడిగాను.

కౌన్సిలరబ్బాయి నోటినుంచి మాటరాలేదు.

"ఏం చేయను సుబ్బులూ! రేపు లేచి బజారు కెలా వెళ్ళను?.... పాడుముండ! ఏ నూతిలోనో పడి చస్తే ఇద్దరి పీడా వదలిపోయేదిగా."

"అదికాదు.... పుట్టింటికేమైనా పోయిందేమో...."

"పుట్టింటికి పోలేదు; నట్టింటికీ పోలేదు. అక్కడికి చచ్చిందేమోనని గూడా పోయొచ్చాను. సమయానికక్కడ మా మామగారు లేకపోబట్టి సరిపోయిందికాని, లేకుంటే బ్రతికి బయిటపడి నీకాడికి చేరేవాడ్నా?"

"మీ మామగారు ముసలాడుకాదా? ఇంకా చేయి జేసుకుంటాడా?" అని వెధవ ప్రశ్న వేశాను.

"ముసలాడేమిటి? ఇంకా పిల్లల్ని కంటూనే వున్నాడు. అదిపోతే పోయింది సుబ్బులూ! వీడొచ్చి నా ప్రాణం తీస్తాడుగదా అని." నిజంగానే వణికిపోతున్నాడు.

"అయితే ఈ రెండురోజులు ఇక్కడనుంచి కదలకండి." అన్నాను.

"నీకు తెలియదు సుబ్బులూ! వాడు కాలాంతకుడు.ఇక్కడికికూడా వచ్చి నన్ను పట్టుకెడతాడు....ఏంచేస్తాడో ఏమో?" గుటకలు మ్రింగుతున్నాడు కౌన్సిలర్ శ్రీ.

నా గుండెల్లోకూడా భయం పడింది. ఒకవేళ నిజంగానే వాళ్ళ మామగారొచ్చి నన్ను రచ్చకీడిస్తే?

"ఏమండీ! మీ యింటిప్రక్క కుర్రవాళ్ళెవరైనా వున్నారా?"

"లేకేం. చాలామంది చచ్చారు."

"మరి ఆ పారిపోయిన కుర్రాడెవడో చూస్తే తేలుతుందిగా."

"ఇంకా దాన్నెక్కడ వెతుకుతావు సుబ్బులూ! గతికిన కూటిని నే నాసించలేను" అని కౌన్సిలర్ ననిపించాడు.

"ఏమైనాగాని, ఇప్పుడు మా మామగాడితోనే పని."

"ఛీ, ఛీ! ఏమిటండి! పెళ్ళాంపోతే దిగులులేదుగాని మామ అంటాడేమోనని భయమా!"

అంటాడేమిటి సుబ్బులూ! వాడు అసలేమనిషికాదు, చేయవలసిందేదో చెప్పకుండా చేసిపోతాడు." ఏడ్పులోకిదిగాడు కౌన్సిలరబ్బాయి.

అంతమనిషి ఏడుస్తుంటే నాకూ ఏడుపొచ్చింది. బుజ్జగించినకొద్దీ ఎక్కువవుతున్నదేగాని తగ్గే సూచనలు లేవు.

"సుబ్బులూ! నీ కాళ్ళుపట్టుకుంటాను. నా పరువు తీయకు. నీవు బయటి వసారాలోనే కూర్చుని వాడొస్తాడేమో చూస్తుండు....నన్ను ఆ రాక్షసుడికిమాత్రం వప్పగించకు. ఇదిగో నీకాళ్ళు పట్టుకుంటాను" అని నిజంగానే పాదాలు తాకాడు.

నాకు జాలివేసింది. ఇంత పిరికి గుండెవాడికి పెళ్ళామెందుకో అర్థంకాలేదు. ధైర్యం చెప్పినా ఎక్కేట్టులేదు. నరనరాలు నీరసించి జావ

గారిపోతున్నాయి. ఈ రాత్రి శివరాత్రే ననుకుని, సరే కావలికాస్తాను లెమ్మన్నాను.

వసారాలో కూర్చుని వచ్చేమనిషినీ, పోయేమనిషినీ చూస్తు న్నాను. మధ్య మధ్యలో "ఏం సుబ్బులూ! అక్కడే వున్నావుగా? ఎవరూ రావడంలేదుగా?" అని పలవరిస్తూనే వున్నాడు అబ్బాయిశ్రీ.

రాత్రి పదిగంటలైంది. ఇక ఎవరూ రారులే, పడుకుందా మనుకున్నాను.

"సుబ్బులూ! నీ కాళ్ళుపట్టుకుంటాను. అక్కడేవుండు."

బయట చలి చంపుతున్నది. ఎంతవరకని కొరివిదయ్యంలా కండ్లు విప్పుకుని కావలిగాయాలి? మంచిమొగుడే దొరికాడని అలాగే చేరబడికూర్చున్నాను.

ఆనాడు క్రొత్తగా ఈ యింట్లో చేరుతున్నప్పుడు సామానులు తెచ్చినమనిషి, ఇద్దరిని వెంటబెట్టుకొని రావడం దూరాన్నుంచే కనబడు తోంది. కేంద్రీకరించి చూశాను. అవును. వాళ్ళే అయివుంటారు. గబగబా దూకివెళ్ళి వస్తున్నా రన్నాను. పారిపోబోయాడు కౌన్సిల రబ్బాయి. ఆగమని లోనికి నెట్టి బయట తాళం పెట్టాను.

"సుబ్బులూ! ఒసే రాక్షసీ! నిన్ను నమ్మానుగదే? సుబ్బులూ!" అని లబలబ లాడుతున్నాడు.

వసారాలోని దీపం ఆర్పివేసి, వెనుకవైపుకు వెళ్ళి తలుపు తట్టాను.

"ఎవరు? నువ్వేగా సుబ్బులూ?"

"అప్పుడే అంత కోప మొచ్చిందేం వీరకుమారా! నిన్ను బంధించి పట్టిస్తా ననుకున్నావా? పిచ్చికుక్కా!" అంటూ నేనూ లోనికి వెళ్ళి గడియ పెట్టేశాను.

"ఎందుకూ మనమిక్కడ ఉండటం? నేను పారిపోతే శుభ్రంగా వుండేదిగా" గుసగుస మంటున్నాడు కౌన్సిలరబ్బాయి.

నోటిపై చేయి వుంచాను.

బల్లిపిల్లలా కరుచుకుని కూర్చున్నాడు.

కొద్ది తడవయ్యేప్పటికి మెల్లెక్కుతున్న చప్పుడు. చప్పుడు దగ్గర పడుతున్నకొద్దీ నన్ను దగ్గరకు లాక్కుంటున్నాడు. ఒకచేయి అతని గుండెపైని, ఒక చేయి అతని నోటిపైనీ వుంచి, అదిమిపడు తున్నాను. వారు రానేవచ్చారు.

"ఇదే నటోయ్ వాళ్ళగది?"

"అవునండి బాబు."

"తలుపు గొట్టి లేపు. ఏదో పనుండి నువ్వొక్కడివే వచ్చినట్లు లేపు."

"లేస్తారో లేవరోనండి?"

"ముందు నువ్వు పిలవ్వోయ్" గద్దించింది కంఠం.

లోన కౌన్సిలరబ్బాయికి చెమటలు కారిపోతున్నాయి.

"అబ్బాయిగారూ! అబ్బాయిగారూ!"

"తలుపు తన్నవోయ్. అబ్బాయిగారట. అబ్బాయిగారు." విరిచింది కంఠం.

తలుపు చప్పుడు హెచ్చుశృతి నెత్తుకున్నది.

"చేతులు నొప్పులు పుడుతున్నాయండి."

"నేను కొట్టనా?....వాళ్ళు నిద్రపోతుంటేగదూ మేల్కొటానికి?"

మళ్ళీ శృతి పెట్టారు. ఎవరు ఎవరంటూ చెవిటి ముసలమ్మ గూడా పైకొచ్చింది.

"మీకేం వేళా పాళా లేదు. ఇవేమన్నా సంసారాలు చేసే కొంప లనుకున్నారా? సానికొంప లనుకున్నారా? ఎప్పుడుబడితే అప్పుడు...." అని నోరు చేసుకున్నది.

"అవునవును. మా మంచిసంసారాలు, అబ్బో!" పాత కంఠం చిలకలా పలికింది.

"ఎవరు నాయనా మీరు? ఇంత రాత్రప్పుడు ఏమిటి మీకూ ఆయనకూ గల పని?"

"నీకెందుకు నువ్వు పోవమ్మా. పెద్ద...."

"ఏమిటి? ఏమిటంటూంట?" లైటు వెలిగించింది.

"ఎవరమ్మా ముసలమ్మా నువ్వు?"

"బాబుగారూ! తాళం తాళం. తాళమేసిపోయారు."

"పారిపోయాడన్నమాట వెధవ!" నెమ్మదించిన కంఠం పండ్లు కొరికింది.

"తలుపు పగులగొడితే మట్టుకు ఎవరులేస్తారు? లోనవుంటేగా?"

"ఎక్కడికి పోయుంటా రబ్బా వీళ్ళు?....నువ్వు పో ముసలమ్మా!" చీదరించింది కంఠం.

ముసలమ్మకు వినపడి చస్తేగా? అలాగే మేకల్లే నిలబడి వుంది.

"పారిపోయి వుంటారు. వాడికితెలుసు మనచేతిలో పడితే ఏమవుతాడో."

కౌన్సిలరబ్బాయి సర్వేంద్రియాలూ ఒక్కక్షణం ఆగిపోయాయి. పై ప్రాణాలు పైనే పోవునేమోగాని, తొడపట్టి బలంగా మెలిపెట్టాను. అబ్బాయిశ్రీకి మళ్ళీ మెలకువ వచ్చింది.

"ఎలా వీడ్ని పట్టుకోవడం?....నాకు నిద్ర పట్టదు" మాటాడు తూన్న కంఠం మెట్లు దిగుతుంటే, అట్టగట్టిన చెమట చొక్కాను కొంచెం నళ్ళుచేశాను.

  

ఇంట్లోంచి కాలు బయట పెట్టడంలేదు. బయట వేసినతాళం వేసి నట్లే వుంటే, వెనుక వైపునుంచి మా పనులన్నీ జరిగిపోతున్నాయి. పదిహేను రోజులకు సరిపడే బియ్యం, బిల్లరసరుకులు వారంలోనే నిండు కున్నాయి.

"ఏమిటి చేయడం? రాత్రికి బియ్యంలేవు. పప్పులూ, ఉప్పులూ అన్నీ అయిపోయాయి. ఎంతకాలం మీ దొంగకాపురం?" అడిగాను.

"నేను వస్తుయుండగా నీ వుండలేవా సుబ్బులూ?....తింటే యిద్దరం తిందాం. లేకుంటే యిద్దరం చద్దాం....నిన్ను వదలిపెట్టలేకేగా సుబ్బులూ నాకీ అవస్థలన్నీ!"

నిజమేనా? నాకోసమే ఇతనిన్ని అవస్థలు పడుతున్నాడా? కర్ర పుచ్చుకుని వాళ్ళ మామయ్యవస్తే దాక్కున్నది గూడా నాకోసమేనా? అసత్యం. అంతా తన కోసమే. తన కోసమే నన్ను రాబట్టుకున్నాడు. తన కోసమే నేను పస్తులు పడుకోవాలట.... ఇవన్నీ నేను సహించనా? ఎందుకు సహించాలి? కట్టుకున్న మొగుడా? లేక ప్రేమించిన ప్రియుడా? ....చీ, చీ! నే నెంత నిర్దయురాలను. ఇంతవరకు కౌన్సిలరబ్బాయి నన్ను పూలలో పెట్టి పూజించాడు. ఏది కావాలంటే అది తీర్చాడు, చదువు చెప్పించాడు. నా కోరిక నేనాడూ కాదనలేదు. కష్టదశలో చిక్కుకున్నాడని ఈ నాడు వదిలేయడమా? ఎంత విశ్వాసఘాతుకం?

చెవిటి ముసలమ్మ సణుగుకుంటూ రెండు రూపాయలు అరు విచ్చింది. అయినా ఎన్నాళ్ళకి సరిపోను? బయటికెళ్ళి పూరీలు పట్టుకొస్తానని లేచాను.

"నా కక్కరలేదు సుబ్బలూ! నీ వక్కడే తినిరా. నాకోస మేమీ తీసుకు రావద్దు."

రెండు మొక్కజొన్న కండెలు, నాలుగుపూరీలు కాగితంలోచుట్టుకుని తెచ్చాను.

"నే నీ మొక్కజొన్నలు తింటాను.మీరు పూరీలు తినేయండి"అని అతగాడి ముందుకు నెట్టాను.

మెలవేసి నములుతున్నాడు. ఒక్కొక్క గింజనే గీరుతున్నాను నేను. ఆశ్చర్యం! వెనుకవైపు తెరిచవున్న గుమ్మంలో ఎవరో పెద్దమనిషి నిలుచున్నాడు. నిశితంగా మా వంకే చూస్తున్నాడు.నే నలాగే మంత్రించినట్లు చూస్తుండేసరికి, కౌన్సిలరబ్బాయి గూడా తల తిప్పాడు.

"ఎవరు? నాన్నా!"

"నీకోసమే వచ్చాను. వెడదాంరా."

అప్పుడు నేనిక "కూర్చోండి" అని అనలేక అన్నాను. తుచ్ఛపురుగును చూసినట్లు చూచి, కండ్లను తన కొడుకుపైకి మలుపుకున్నాడు.

"వెడదాం రా నాన్నా!" ఆ గొంతులోని ఆప్యాయత తన ప్రాణా నికి పాశం వేసినట్లు మేకపిల్లలా వెంబడించి పోయాడు కౌన్సిల రబ్బాయి. ఒక్కమాటు వెనుకకుతిరిగి చూడనైనా చూడలేదు.



ఎదురు చూశాను. గంటలూ, ఘడియలూ లెక్కపెట్టాను. కౌన్సిల రబ్బాయిరాడంటే నా మనసు ఒప్పుకు చావడంలేదు. నన్ను చూడకుండా ఒక్కదినమైనా గడపలేనివాడు ఇన్ని దినా లెలా ...?ఏమో!ఇక రాడేమో! పదిరోజుల వస్తులతో, ఇక రాడని పూర్తిగా నిర్ధరించుకున్నాను.

అప్పుడే మొదటి సంవత్సరం పరీక్షలుగూడా వచ్చాయి. సుజాతగారింట్లో నేను రాకపోవడాన్ని గురించి ఏమనుకుంటున్నారో? ఆరోగ్య మంతగా బావుండలేదని సుజాతతో అబద్ధం చెప్పాను.

అయినా ప్రస్తుత కర్తవ్యమేమిటి? ఏం చేయాలి? మొదలుపెట్టిన చదువు-చదువుమాట దేవుడెరుగు- అసలు జీవించే మార్గమేమిటి.... నాన్నగారితో ప్రస్తావించితే? వద్దు వద్దు. వా రెవరికీ ఈ విషయమై తెలియనీయకూడదు. తెలిస్తే నాకోసం వారేదో చేయబోతారు. ఒకవేళ నేను స్నేహం చేస్తున్నది-ఈ సహాయాన్ని ఆశించేనని అపార్థం చేసు కుంటే? అమ్మో! నే నసలు భరించలేను.

కాలేజీకైనా వెడితే సుశీల మధ్యాహ్నం ఇంత ఫలహారమైనా యిప్పిస్తుంది ఇంట్లోనే కూర్చుంటే కడుపుమాడి చావాలి. లేచి స్నానం చేసి, గొంతుకలో యిన్ని నీళ్ళు పోసుకుని బయలుదేరాను.

దారిలోనే సుజాత తటస్థపడి కడబట్టివున్న ప్రాణాన్ని కొంత కాపాడింది. ఆమెకు తలనొప్పి రావడం నా కడుపు కింత మేలు జరిగింది.

"ఏమిటి సుబ్బలూ! రోజు రోజుకూ చిక్కిపోతున్నావు?"

"చెప్పానుగా. ఒంట్లో బాగుండడంలేదు."

"మరి ఏదయినా మందుతీసుకుంటున్నావా?"

"మందు తీసుకునే జబ్బుకాదు" నోరు జారింది.

"అయితే మళ్ళీ మానసికవ్యాధి పట్టుకుంధన్నమాట. ఏమో నమ్మా-నేను మాత్రం దాని బారిని పడలేను."

"అదృష్టవంతురాలివి."

"అదృష్టం సరేగాని అడగటం మర్చిపోయా. కాలేజీ నాటకంలో వేషం వేస్తున్నావటగా? మాట మాత్రమైనా చెప్పలేదు" అన్నది సుజాత.

"నాటక మేమిటి? వేష మేమిటి?"

"అయితే నీ కసలు తెలియదా? నీకు చెప్పకుండానే నిర్ణయం చేశారా?"

"ఆ నిర్ణయ మేదో చెప్పు తల్లీ! నన్నెందుకు చంపుతావు? నా కసలు ఏమీ తెలియదు" అన్నాను.

"గౌతమబుద్ధ నాటకం, అందులో గౌతముని వేషం నీ కిచ్చారట. యూనివర్సరీకి ప్రదర్శించాలట."

ఇద్దరం నడుస్తున్నాము. నాకు తెలియకుండానే వరించిన ఈ యోగ్యతను చూచి నవ్వాలో ఏడవాలో అర్థంగాలేదు.

కాలేజీలో అడుగుపెట్టగానే క్రొత్తగా చేరినప్పుడు చూసినట్లు చూస్తున్నారు విద్యార్థులు. ఇది గౌతమబుద్ధ ప్రభావమో లేక పదిరోజుల పస్తుల ప్రభావమో బోధపడలేదు.

యదార్థంగా గౌతమబుద్ధ నాటకం - నా జీవితంపైన చెరిగిపోని ముద్ర వేసింది. మొట్టమొదట వేషంవేసేందుకు ఒప్పుకోకూడ దను కున్నాగాని, నాటకం చదివాక తప్పక వేసి తీరాలనిపించింది. గౌతముడు కదలించినంతగా నన్నేవ్యక్తిగానీ, చరిత్రగానీ కదిలించలేదు. నా మెద డులో పేరుకుపోయిన మాలిన్యాన్ని తుడిచి శుభ్ర పరిచిందనే చెప్పాలి. నా కీ సమయాన గౌతముని పాత్ర అందలేకుంటే ఏమై పోయేదాన్నో ఊహించడంకూడా కష్టం. రిహార్సలు అనంతరంగూడా ఆ బుద్ధదేవుని మూర్తిలోనే లీనమైపోతున్నాను. కౌన్సిలరు నన్ను వదలివేయకుంటే ఆ పాత్ర నంతగా పోషించలేక పోయేదాన్నేమో? జీవితం గూడా పాత్రతో కలిసివచ్చింది. నా స్థితిగతులే ఆ పాత్రకు న్యాయం కలిగించా యనుకుంటాను.

రిహార్సలు వేళలో రెండు మార్లు కాఫీ, కొంత ఫలహారం యిచ్చే వారు. ఇదీ ఒకందుకు మంచికే వచ్చిందనుకున్నాను. వాటితోనే ప్రస్తుతానికి బండి దొర్లిపోతున్నది. మానసికంగాను, భౌతికంగాను కూడా గౌతముడు నాకు సాయపడ్డాడు.

నాన్నగారిని చూద్దామనిపించి ఒకనాడు సుజాతగారింటికి వెళ్లాను. కాని ఆనాడే అంతా కలసి సినిమాకు పోయారట. నాకు విసుగుగాని, కోపంగాని రాలేదు.... గౌతముడే నన్నిప్పుడు ఏలుతున్నాడు. ఎవరేనా ఎదురుపడి మొహంమీద ఉమిసినా, నవ్వుతూ పమిటిచెంగుతో తుడుచుకొమ్మని గౌతముడు నాకు చెప్పేట్టున్నాడు. ప్రపంచంలో ఎవరిమీద ద్వేషంగానీ, కోప తాపాలకుగానీ నాలో యిప్పుడు తావులేదు. కళ్ళు మూసుకుంటే సిద్ధార్థుడు నాకు సాక్షాత్కరిస్తున్నాడు.

ఆనాడు ఇంటికి వెళ్లేసరికి గడపలోనే చెవిటి ముసలమ్మ ప్రత్యక్షమై అద్దెమాటేమిటన్నది. సిద్ధార్థునివలె నవ్వుతూ "ఇస్తానమ్మా. నీకివ్వవలసింది యిచ్చే వెళ్ళిపోతాను. ఋణభారంతో పోలేనుకదా" అని తీయగా అన్నాను. ఆ ముండకు చెవుడన్న సంగతి నా కప్పుడు తట్టనే లేదు.

"వారం రోజులు చూస్తాను. లేకుంటేనా...."

"అలాగేనమ్మా" అని నవ్వుతూనే నెమ్మదిగా మెట్లెక్కిపోయాను.



చూస్తుండగానే రావలసినరోజు వచ్చింది. ఆనాడే మా నాటకం. ముందేవేవో చిన్న చిన్న కార్యక్రమా లున్నాయి. ఆఖరున మా ప్రదర్శనం.

అప్పటికే జనం వచ్చి కూర్చున్నారు. గంతులేసుకుంటూ సుజాత వచ్చి "సుబ్బులూ జాగ్రత్త. నాన్నగా రొచ్చారు" అని చిందులతోనే వెళ్ళిపోయింది.

లేస్తూనే అద్ద మొకమాటు ఇవ్వండని, వేషం చూసుకున్నాను. నేనేనా అన్నంత ఆశ్చర్యం కలిగింది. జుట్టువిరిచి నడినెత్తిన కొప్పు

జుట్టారు. చెవులకు పెద్ద కుండలాలు. కనుబొమలు వెడల్పు చేసేప్పటికి నా ముఖమే మారిపోయింది. సుబ్బులుగాగాక, సిద్ధార్థునిలా నవ్వాను.

"ఇప్పుడు రెండు నిమిషాల్లో గౌతమబుద్ధ నాటకం మొదలు పెట్టబడుతుంది. ఎక్కడి వారక్కడ కూర్చుంటే వెంటనే ప్రారంభిస్తాము" అని రచయిత పేరూ, నటీ నటుల పేర్లూ వెల్లడించారు. "గౌతమబుద్ధ-సుబ్బులు" అన్నప్పుడు నా వళ్ళు జలదరించింది. లేచి నిలబడ్డాను.

మొట్ట మొదటి రంగంలోనే గౌతముడు తపోముద్రలో కనుపించుతాడు. నేను ఒక్కొక్క అడుగే వేస్తూ స్టేజీలోనికి పోతుంటే, అనుకోకుండా అవయవాలు పట్టుతప్పి పోతున్నాయి. కాని అంతలోనే "తపోముద్ర" అన్ని అవలక్షణాలను పారదోలింది.

కండ్లు మూసుకుని నిశ్చల సమాధిలో కూర్చున్నాను. వాస్తవిక ప్రపంచంతో సంబంధం తెగిపోయింది. పాత్రలు వచ్చి పోతున్నాయి. గౌతముడు నటించుటలేదు. ప్రేమిస్తున్నాడు. సర్వమానవులను తనతీయని పలుకుతో, కరుణార్ద్రహృదయంతో మంత్రముగ్ధుల చేస్తున్నాడు. రాజుల నుంచి రంగప్పలవరకు "బుద్ధం శరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి" అనే త్రివలయంలో తేలిపోతున్నారు. దొంగ-దొర, పులి-మేక అన్న భిన్నత్వమే బోధిసత్వుని సన్నిధానంలో గోచరించదు. అంతా కనుమోడ్చి తథాగతునిలో లీనమై పోయేవారే.

నాటకం పూర్తయిందనే సరికి జనానికి మెలుకువవచ్చింది. ఆడపిల్లనన్న సంగతే మరచిపోయి ప్రొఫెసరుగారు నన్ను గట్టిగా కౌగలించుకున్నారు. నాకేమీ సిగ్గనిపించలేదు. సుబ్బు లోకమాటు స్టేజీమీదికి రావాలని జనం కేకలేస్తున్నారు. నాకప్పుడు నాన్నగారు గుర్తుకొచ్చారు.

స్టేజీమీదికివెళ్ళి అందరికీ నమస్కారం చేశాను. ఒక పండు వృద్ధుడు నిండుసభలోంచి లేచి వచ్చి, కన్నీరు కార్చుతూ సాష్టాంగ పడ్డాడు. జనంకూడా నవ్వలేకపోయారు.

"నేను కొంతప్రసంగిస్తాను." అని కంటినీరు తుడుచుకోకుండానే, ఆ వృద్ధుడు వణుకుతూ మాటాడుకు పోతున్నాడు.

"నా జన్మ సార్ధకమైంది. బుద్ధభగవానుడు కండ్లారా తన్ను చూచేందుకేనేమో, నన్నింతవరకూ నిలిపాడు. మొన్న అంత జబ్బుపడీ ఎందుకు బ్రతికానో నా కిప్పుడు అర్ధమైంది. భగవానుడే నన్నుకాపాడి, నాకు సాక్షాత్కరించాడు. నేను తరించాను. "బుద్ధం శరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి" కండ్లు మూసుకుని గద్గద స్వరంలో పాడాడు.

"నాయనలారా! నేనూ వేషాలు కట్టాను. సత్యహరిశ్చంద్రుని పాత్రను, నేను బాగా నటిస్తానని ప్రతీతి. నిజమే-నాలో ఆ ప్రతిభ వున్నది కామోసు ననుకున్నాను. లేదు. నాలో ఎలాంటి ప్రజ్ఞాలేదు. నా జీవితంలో ఎన్నడూ నా భగవానునిలా నటించలేదు. నాకు చేతరాదు. అల్పబుద్ధిని. వరప్రసాద మహారాజావారు నాకు ప్రసాదించిన ఈ బంగారు కడియాన్ని, కన్నీటి కాన్కగా నా భగవానునికి సమర్పించుకొంటున్నాను." అని తన చేతి కడియాన్ని తీసి హర్షామోదాల మధ్య నా చేతికి తొడిగారు. వారి పాదాలకు నమస్కారం చేశాను.

♦ ♦ ♦

జగదాంబగారు బుగ్గలు పుణికి "నా తల్లే!" అని ముద్దు పెట్టుకున్నది. నలుగురం జట్కాలో ఎక్కి ఇంటిదారి పట్టాము. సుజాత ఒకటే పనిగా నా నటనగూర్చి పొగిడేస్తున్నది.మధ్య మధ్య మేము నవ్వనైనా నవ్వుతున్నాము, గాని నాన్నగారు ఏమీ పట్టనట్టే బయటి ప్రశాంతతను చూస్తున్నారు.

ఇంటికి వెళ్ళగానే అందరం భోజనం చేశాము. అప్పుడైనా నాన్నగారు మాటాడుతారేమో నని ఆశించాను. నాన్న నోటినుంచి పొగడ్తలు వింటే నాకు సంతోషం. ఆయ నెంతవరకు నా విషయమై పట్టించుకోకుంటే, నాకు కోప మొచ్చినమాట వాస్తవం.... సరే ఇక నే వెళ్ళొస్తానన్నాను. అప్పటికీ నోరెత్తలేదు. సుజాత చేయిపట్టుకుని నిల్చున్నానే కాని నా దృష్టి అంతా నాన్నగారిపైనే వుంది. అంతసేపటికిగాను కన్నెత్తి చూశారు. ఆ కండ్లలో చెప్పలేనటువంటి యేదో శక్తీ, తేజోకాంతులున్నాయి. చాలసేపు ఆ కండ్లలో కండ్లుంచి చూడలేము.

"వెడుతున్నావా సుబ్బులూ?" లేచి తిరుగుతున్నారు. అవునని నే ననలేకపోయాను. జగదాంబగారు లోనికి వెళ్ళిపోయింది.

"నాటకం చూశాను." తిరిగి మాటాడుదామా వద్దా అన్నట్లు ఆగిపోయారు.

"అయినా అభినయ మెప్పుడు అభ్యాసం చేశావు?"

"అభ్యాస మేమీలేదు" అన్నాను.

" ఆ పాత్ర నలా నటించమని ఎవరేనా చెప్పారా?"

"ఎవరూ చెప్పలేదు."

"అయితే నీ వూహా పోహలతో దాన్నలా చిత్రించా వన్న మాట."

నేనేమీ సమాధాన మివ్వలేదు.

"నాటకంలో గౌతముడుతప్ప ఆయన పుట్టుపూర్వోత్తరాలు నీకు క్షుణ్ణంగా తెలియవా?"

"తెలియవు."

"అక్కడే జరిగింది పొరపాటు. నీవైతే నీకు తోచినంతవరకు చక్కగానే నటించావు....కాని గౌతముడెప్పుడూ నీ పాత్రలా వుండడు. నీవు ఉచ్చరించిన పద్ధతుల్లో ఆయ నెప్పుడూ ఉచ్చరించడు....నీ నడక మరీ ఘోరంగా వుంది. గౌతముడు రాజకుమారుడన్న విషయమే నీకు గుర్తులేదనుకుంటాను. అందులో ఆయనకున్న మనోధైర్యం, విశ్వాసం ప్రపంచంలో మరేమానవునికి లేవేమో?....నీ నాటకం చూస్తుంటే అదెక్కడా గోచరించదు. పైగా మహా దుర్బలుడుగా, కాస్తంతకే కదలిపోయే స్వభావం కలవాడుగా కనిపించాడు....గౌతమునికి స్వచ్ఛందమైన మనసూ, కరుణార్ద్ర హృదయమూ వున్నది. అయితే ఆయ నెప్పుడూ విచారగ్రస్థుడనిగాని, వట్టి కన్నీటికుండగాగానీ చిత్రించటం ఆయనపట్ల నేరం చేసినట్లే....సరే ఏదో మాట్లాడేస్తున్నాను. పాత్రను నీవు సరిగా అర్థంచేసుకోలేదు....చేసుకున్నంతవరకు చక్కగా నటించావు. నీ వలా నటించగలవని నే నసలు అనుకోలేదుగూడా" అని నవ్వారు.

"పాపమా శాస్త్రిలుగారు బాగా చలించిపోయారు. ఆయన హరిశ్చంద్ర నేను చూచాను. చక్కగా నటిస్తారు. పాటలు, పద్యాలకంటే

భావానికి ప్రాధాన్యత నిచ్చేవారు, ఆయ నొక్కరే నాకు కనుపించారు."

"సరే. నేను వెడతాను నాన్నగారు. మళ్ళా ఆలస్యమైపోతుంది" అన్నాను. ఎందువల్లనో అక్కడినుంచి ఎంత త్వరగా బయట పడితే అంత మంచి దనిపించింది.

"ఇంత రాత్రిలో వెళ్ళకపోతేనేం? ఇక్కడే పడుకోరాదా ?"

"కాదులెండి వెడతాను."

ఇక బలవంతం చేయలేదు. మెట్లు దిగుతుంటే ఒక విషయం గుర్తొచ్చి, వెంటనే వెనక్కు మళ్ళాను.

"ఏం వచ్చావ్?"

"ఇది మీ వద్ద వుంచండి" శాస్త్రిలుగారు బహూకరించిన కడియాన్ని నాన్నగారి చేతిలో వుంచాను.

"తప్పమ్మా. ఎవరికీ ఇవ్వకు" అని తిరిగి తొడిగారు.

మారుమాటాడలేక వచ్చేశాను.

దారిపొడుగునా నాటకం గురించే ఆలోచిస్తున్నాను. ఒక్క నాన్నగారు తప్ప నా పాత్రను గూర్చి విమర్శించినవారే లేరు. ప్రొఫెసరుగారు మొదలుగా అంతా పొగిడినవారే. నిజంగా నాన్నగారెంతో సంస్కారం గల వారనిపించింది. అందరి అభిప్రాయాలు ఒకేరకంగా వుంటే, తన్ను తాను మార్చుకుని ఆ మందలో కలిసిపోలేరు. ఏ విషయాన్నయినా నిశితంగా పరిశీలించే జ్ఞానం నాన్నగారి కున్నది....నిజంగా గౌతముడు రాజకుమారుడన్న సంగతే మొత్తం నాటకంలో నా కెక్కడా తట్టలేదు. సాధుసత్తముడూ, ప్రతిదానికీ ప్రవచనాలు పలికే బోధకునిగా మాత్రమే నేను అర్థం చేసుకున్నాను. నాటకానికిముందే నాన్నగారి అభిప్రాయాలను తీసుకున్నట్లయితే గౌతమునికి న్యాయం కలిగించేదాన్ననుకున్నాను. ఇంకా స్పష్టపడిందేమంటే-తెలుసుకోవలసింది చాలా వున్నది. మనకున్న జ్ఞానం కొద్దిమాత్రమే. కాదు. అసలేమీ లేదు. అనుకుంటుండగానే ఇంటి దగ్గరి కొచ్చేశాను.

బయటి తలుపులు మూసివున్నాయి. అప్పుడే నిద్రకుపడ్డారు గావాలనుకుని తలుపు కొట్టాను. ఐదారు నిమిషాలకు తూరీగలు పట్టే సుబ్రాడు వచ్చి, తలుపుతీసి నిద్రమత్తుతోనే మళ్లీ పడక వెట్టాడు.

"బుద్ధం శరణం గచ్ఛామి" అనుకుంటూ నేను మెట్లెక్కు తున్నాను.

"ఆగు" అన్నది చెవిటి ముసలమ్మ క్రిందినుంచి.

ఇంటద్దెకోసం గద్దిస్తున్నదేమో నని నవ్వుతూ "రేపే యిస్తా నమ్మమ్మా. ఇవాళ సంపాదించు కొచ్చానులే" అన్నాను.

"మెట్లు దిగుముందు."

"ఏమ్మా! మర్యాదకు మర్యాద లేదేం? రేపిస్తా నంటుంటే వినవేం? పారిపోతామనుకున్నావా?"

మెట్లెక్కి దగ్గరకొచ్చింది. "ఏం మర్యాద! అబ్బో! వుంచుకున్న ముండలకుగూడా మర్యాదే? దిగు. నీ మిండగాడు సామానులన్నీ సర్దుకు పోయాడు. నీ కిక్కడేమీ చోటులేదు." చేయి పట్టుకుని గుంజుతున్నది.

నా కేమీ తల కెక్కడంలేదు. బొమ్మలా దిగుతున్నాను.

"నా చీరెలు అవీ వున్న చెక్కపెట్టె వుండాలే. అదీ తీసుకు పోయాడా?"

"కాళ్ళు తుడుచుకునే పట్టాతో సహా అన్నీ చుట్టబెట్టుకుపోయాడు. నీ కిక్కడ ఏమీలేదు. ఇంకెవడినైనా వెతుక్కో పో."

క్రిందికి దించేసింది. ఒక్కసారి పైకిపోయి గదినంతా చూసి రావాలనిపించి అడిగాను.

"అమ్మమ్మా! ఒక్కసారి పైకి వెళ్ళి చూసిపోతాను. దయచేసి ఒప్పుకోవూ?"

బొమ్మని వీధిలోకి నెట్టి తలుపు మూసుకుంది.

♦ ♦ ♦

పోతున్నాను. కాని ఎక్కడికని నన్నడగకండి. పోతాను. ఎక్కడికో వెళ్ళిపోతాను, దిక్కు లేనివారికి దిక్కులన్నీ దిక్కులే నన్నట్లు, ఏ దిక్కుకో చేరుతాను....నాన్నగారు....లేదు లేదు. ఆ మాటే తలపెట్ట కూడదు. నాకు నాన్నలేడు. నా అన్న వా రెవరూ లేరు. నాకు నేనే. ఎక్కడికో ఏకాకిగానే ఎగిరిపోతాను. తెల్లవారేటప్పటికి....ఈ ఊరి కిక ముఖం చూపలేను.

తాతయ్య తళుక్కున మెరిశాడు. పాప మా నిర్భాగ్యుడూ ఒక మారు ఇదే అవస్థ పడ్డాడు. నే నింకా నయం! కాలో చేయో పోలేదు కదా!

తిరుగుతూ తిరుగుతూ స్టేషనుకు వెళ్ళాను. కట్టుగుడ్డలు తప్ప చేతిలో కానీలేదు. అయినా నన్ను పట్టుకునే దెవరు? రైలెక్కి వెళ్ళిపోతాను. ఎక్కడదదింపితే అక్కడ దిగిపోతాను.

"బాబూ ఇప్పు డే రైలుబండీరాదా?" కునికిపాట్లుపడుతున్న సోడా కొట్టు కుర్రాడ్ని అడిగాను.

అతను తెల్లమొహం వేసి చూస్తున్నాడు.

"ఎవరు నువ్వా?"

నా కప్పుడు జ్ఞాపక మొచ్చింది, ఆనాడు–సుజాత అవమానించిన రోజు ఇతని వద్దనే నీళ్లసోడా తాగాను. ఇంతవరకా రుణం రుణంగానే వుండిపోయింది.

"ఇంకో సోడా కావాలా?" జేబుగుడ్డతో ముఖం తుడుచుకుంటూ అడిగాడు.

"వద్దులే. బండి ఎప్పుడు వస్తుందో చెప్పు."

"ఎక్కడి కెళ్ళాలి.?"

"ఏ బండి ముందొచ్చి, ఎంతదూరం తీసుకేడితే అక్కడికి."

అతను పెద్దగా నవ్వాడు. నిద్రపోతున్న కుక్క లేచి, నిద్రాభంగ మైనందుకు తిట్టుకుంటున్నట్లు మూల్గి వెళ్ళింది.

"సరే. లోపల కూర్చో. బండిరాగానే వెళ్ళిపోదువు."

చాల మంచి కుర్రాడల్లే వున్నాడని నవ్వుకుని, ఆ చిన్న కిటికీ లాంటి ద్వారంగుండా వంగి సోడా బడ్డీలోనికి వెళ్ళాను.

"పడుకుంటే పడుకో. బండిరాగానే లేపుతాను" అని పైనున్న తువ్వాలు నాపైకి విసరేశాడు.

పరుచుకుని పడుకున్నాను. పెట్టెలా మూసుకుపోయి వున్న ఆ కొట్లోకి గాలి ఎలా వచ్చి చస్తుంది? లేచి పమిటచెంగుతో విసురు కుంటున్నాను.

"గాలి కావాలా? నే విసురుతానులే. నువ్వు పడుకో" అని పైన కూర్చునే తాటాకు విసనకర్ర బయటికి తీశాడు.

నేను నవ్వి విసనకర్ర లాక్కున్నాను. పడుకుని విసురుకుంటుండగానే నిద్రాదేవత నన్నావరించింది.... నిద్రలో కల.... కలలో కౌన్సిల రబ్బాయిని ఒక స్తంభానికి కట్టివేశారు. కట్టిన తాళ్లను తెంపుకోవాలని విశ్వప్రయత్నం చేస్తూ తన్నుకుంటున్నాడు. తలుపులు బంధించి వున్నా, నేను వాయుదేవతలా ఎగిరి లోనికి వెళ్ళాను. "సుబ్బులూ! వచ్చావా? నీకోసమే....." అని ఏమేమో పలవరిస్తున్నాడు. తాళ్లను తెగనరికాను. ఇద్దరం చేయి చేయి కలిపి వస్తుండేసరికి, వాళ్ల మామ గడపలోనే తారసిల్లాడు. నేను వణికిపోయాను. నన్నుగూడా బంధించనున్న సమయంలో నాన్నగారు ఊడిపడ్డారు. నన్ను చేయిపట్టుకుని లాక్కుపోతున్నారు. నేను వెనుదిరిగి కౌన్సిలరబ్బాయికోసం చూస్తున్నాను. ఆయనకు కోపమొచ్చి-అయితే యిక్కడే చావమని-నాన్నగారు నన్ను విసరికొట్టిపోతున్నారు. నేను పట్టించుకోకుండానే పరుగెత్తిపోయి, కౌన్సిలరబ్బాయిని కావిలించుకుంటున్నాను.... మెత్తని శరీరపు వేడి నా వంటికెక్కుతున్నది. కన్ను విప్పి చూశాను.

"నేనే. నేనే. ఫర్వాలేదు పడుకో" అంటున్నాడు సోడాకొట్టు కుర్రాడు. చీరంతా పైకి గుంజుకుపోయి వున్నది. అతి అప్యాయంగా నన్ను తన వైపుకు తిప్పుకుంటున్నాడు.

"సరే, ఆ కుక్కకంటే నీవే మంచివాడివిలే" అని నా చేతిని అతగాడి నడుముపై వేశాను.

అంతా కలలోనే జరిగిపోయింది.

"బండి. బండొచ్చింది. మద్రాసుబండి" కొడుతూ నన్ను లేపాడు.

లేచి హడావిడిగా బయటికొచ్చాను. బండి నిలబడి సిద్ధంగా వున్నది. ఖాకీటోపీలవాళ్ళు కంగారుగా తిరుగుతున్నారు. వాళ్ళను చూసేసరికి భయం వేసింది. టిక్కెట్టులేకుండా ప్రయాణంచేస్తే శిక్షేమిటో?

"అబ్బాయ్! రెండు అరటిపండ్లిస్తావా? ఆకలేస్తున్నది" అడగ్గానే ఒక హస్తం కోసి చేతిలో పెట్టాడు. నిజంగా ఈ కుర్రా డెంత మంచి వాడు!

నవ్వుకుంటూ టిక్కెట్లిచ్చేచోటికి వెళ్ళాను." ఈ కడియం తీసుకుని నాకో టిక్కెట్టివ్వండి." కిటికీ సందుగుండా అతని ముందున్న బల్లపై పడేశాను.

"డబ్బుకేగాని యిక్కడ వస్తువులకు టిక్కెట్టివ్వరు."

"ఈ వస్తువు డబ్బు చేస్తుందిగా?"

"పోపో పిచ్చిముండా అవతలకి."

వీళ్ళ పిచ్చి ఇలాగే కుదర్చాలని టిక్కెట్టు లేకుండానే ప్రయాణం కట్టాను. ఆడవాళ్ళ పెట్టెలోనికి వెళ్ళి, ఒక అమ్మ పారజాపి పడుకుంటే "లే లే. తెల్లవారింది" లెమ్మని లేపి, నేనూ కూర్చున్నాను. ఒక్క కుదుపుతో "చేదుకో కోటయ్యా" అంటూ బిగిలేసి బండి కదిలింది.

[ ఒకటవ భాగం సమాప్తం ]

---

# రెండవభాగం

బండిలోవున్న వారంతా దిగిపోతున్నారు. ఒక్కదాన్నే బండిలో కూర్చుని ఇదేదో గొప్పస్టేషనే అని చూస్తున్నాను. ఒక ముసలాయన తన కున్న ఆస్తినంతా తెచ్చి పెట్టెలో పడేస్తున్నాడు.

"తాతగారూ! ఈ బండి ముందుకు పోదా?.... తింటే తినండి అరటిపండు. ఇదిగో చాలా రుచిగా వుంది తినండి" అన్నాను.

బోసినోటితో నవ్వి "మద్రాసువరకే నమ్మా బండి. తిరిగి వెనక్కు వెళ్ళిపోతుంది" అన్నాడు.

"ఛీ. తిరిగి వెనక్కు వెడతానా? ఇక్కడే దిగిపోతాను....వస్తానండి తాతగారూ! అరటిపండు తినరా?"

ఎటుచూసినా స్టేషనే. కనుచూపు మేరకు అన్నీ రైలుబండ్లే, కొద్దిసేపు గాలిపంకా క్రింద నిలబడి సేద తీర్చుకున్నాను.

బయటికి పోవాలంటే దారెటో తెలియడంలేదు. అయినా ఒక సారి స్టేషనంతా తిరిగి చూస్తే బావుంటుందని, కనుపించిన దారినల్లా వెళ్ళి చూశాను. నన్ను అభ్యంతర పెట్టిన వారెవరూ లేకపోయారు. తిరిగి తిరిగి నాకే విసుగొచ్చి బయట పడదామనిపించింది. ఆకలిగా వున్నట్లుంటే అరటిపండొకటి తిని, మద్రాసు నీరు త్రాగేను. ఫర్వాలేదు, రుచిగానే వున్నాయనుకుంటూ రోడ్డువైపు గేటునుంచి బయటికొచ్చాను. ప్రభుత్వ డబ్బు తింటూ, టిక్కట్లు వసూలుకై నియమించబడిన ఉద్యోగస్తులు ఏ మూల నున్నారో నాకు కానరాలేదు.

ఇక మిగిలినవి రెండే రెండరటిపండ్లు. చేతిలో పుచ్చుకొని బయలు దేరాను. పెద్ద పెద్ద భవనాలూ-అంతస్థులుపై అంతస్థుల-గడియారపు స్తంభాలు చుక్కల్లో చూస్తున్నాయి పల్లెటూరు దానిలా పైకి చూచుకుంటూ నడిస్తే ప్రమాదంలో పడతామని నాకు తెలుసు. అందు వల్ల చూసీచూడనట్లు, ఇవన్నీ మనకు చిరపరిచయమే నన్నట్లు నడుస్తున్నాను. అప్పటికీ కార్లూ, బస్సులూ దెబ్బతీసేట్టే వున్నాయి.

ఒక కూడలిలో కొచ్చి ఎటూ దారని యోంచిచాను. ఎటు వెళ్ళినా ఒక్కటే ననిపించింది. సరే. అటువంటప్పుడు గొప్ప బజారువెంట వెడితేనే మంచిదని, విశాలమైన వీధిపట్టాను. నడచివెళ్ళే జనంకంటే వాహనాలసంఖ్య మిక్కుటం. ఎక్కడ ఏదొచ్చి గుద్ది పోతుందోనని అతి మెలకువగా నడుస్తున్నాను. ఒకడు నావంకా అరటిపండ్లవంకా చూసి పోతున్నాడు. నిజమే, ఎబ్బెట్టుగానే వుందని అక్కడే నిలబడి నోట్లో వేసుకున్నాను. ఎంతదూరం వెళ్ళినా దారి తరిగేట్టులేదు. అసలంతదూరం వెళ్ళడం దేనికని ఒక్కచోట ఆగాను.

అయితే నాకిప్పుడు కావలసిందేమిటి?....అబ్బే! ఏమీలేదు. ఊరికే ఆగానని మళ్ళీ నడకసాగించాను. నడక సాగటంలేదు. ఎక్కడికనే ప్రశ్న ఎదురౌతున్నది. తెలుగువాళ్ళ కొంపలవైపు వెడితే కొంతమేలని ఒక పంచెకట్టుగాడ్ని చూసి "అయ్యా! తెలుగువాళ్ళు ఏవేపుంటారు?" అడిగాను.

"తెలంగి తెలంగి" అనుకుంటూ ఏవో హిందుస్తానీ కూతలు కూస్తూ నిలబడకుండానే దాటిపోయాడు. పిచ్చిముండా కొడుకని నేను నవ్వుకున్నాను. ఆ మిట్ట మధ్యాహ్నపువేళ, నట్టనడివీధిలో షికారు చేస్తున్నట్లు నేను నడుస్తుంటే కొంతమంది ఎగాదిగా చూస్తున్నారు. పోయే పోయే వాడల్లా ఆగి, ఒకడు నిలబడి చూస్తుంటే 'ఏం? ఏం కావా' లన్నాను.

"అహఁ ఏం లేదు. లేదు" అని అతగాడు జారిపోతుంటే, "అమ్మో దొరికాడు తెలుగువా"డని 'కొంచెం నిలబడు నాయనా' అన్నాను. అతగాడు కొంత ఖంగారు మ్రింగుతూనే నిలబడ్డాడు.

"నే నడుగుతున్నాను. నీవు నన్నట్టేపెట్టుకుంటావా?"

బిత్తరపోయిన మొహంతో బెదరిన గొడ్డులా దూసుకుపోయాడు. నే నక్కడే నిలబడి చూస్తున్నాను. పాపమా అర్భకుడు తిరిగి చూడ నైనా చూడలేదు.

వెంటనే ఒక విషయం తలంపు కొచ్చి ఒక పెద్దమనిషిని నిల వేశాను. బంగారమమ్మే దుకాణా లెక్కడని అంగ్లంలో అడిగాను. పాప

మా పెద్దమనిషి వివరంగా చెప్పాడు. కాని బస్సులో పోవాలట. బస్సు టిక్కెట్టుకు డబ్బులేదు. నడచిపోదామంటే దారితెలియదు. ఏమిటి చేయడం?

కండక్టరు కుర్రాడికో కన్నుగీటితే సరిపోతుందనుకొన్నాను. అంతదాకా పోనక్కరలేకుండానే, ఇక్కడే ఎవరేనా తారసిల్లుతా రేమో నని బస్ స్టాండింగులో పరిశీలించాను. ఇద్దరు వృద్ధదంపతులూ, బడి కెళ్ళే ఒక బొట్టిగాడూ తప్ప మరెవరూలేరు. సరే. నా నంబరు బస్సును రానిమ్మన్నాను. విసుగెత్తించి, ఒక అర్ధగంటకుగాను దడ దడ లాడు కుంటూ వచ్చింది.

వెంటనే ఎక్కి వెనుక సీటులో కూర్చున్నాను. అరమైలు ప్రయా ణానంతరం కండక్టరు కుర్రాడు చేయి జాపాడు. అతనిచేతిలో నా చేయి వుంచి కన్ను మలిపాను. గంటకొట్టి బస్సు దిగమన్నాడు. అప్పుడు నే నెంత అవమానంతో కృంగిపోయానో ఏమని చెప్పేది? పళ్ళు బిగబట్టినా కన్నీరు ఆగలేదు.

తోటిప్రయాణీకుల ముఖం చూడలేక బస్సులోంచి దొర్లించి నట్లు దిగాను. కాని ఎవరో నాచేయిపట్టుకున్నారు. చూడలేక సిగ్గుతో తలవాల్చుకునే చూశాను. ఎవరో తెల్లదొర. నన్ను పైకిలాగాడు. వెళ్ళ లేకపోయినా వెళ్ళాను. బస్సులోనివారంతా నావంకే చూస్తుంటే శరీరం చిల్లులు పడుతున్నది. కాని చేసే దేముంది? ఆ తెల్లదొర తొడుగుకున్న బూట్లనూ, మేజోళ్ళనూ చూస్తూ మనసులోనే హృదయపూర్వకంగా మ్రొక్కాను. నేను దిగినచోటనే ఆయనా దిగారు.

"ఎక్కడికి వెళ్ళాలండి?" అచ్చతెలుగులో ఆయన మాట్లాడేసరికి, ఇక్కడి పశు పక్ష్యాదులకుగూడా మన తల్లిభాష వచ్చునేమో నన్నంత ఆశ్చర్యపోయాను. అలాగే విభ్రాంతితోచూస్తూ "మీరు ఆంధ్రులాండి?" అని అతి ప్రయత్నంమీద అడిగాను.

"కాదు. కాని నాకు బాగా తెలుగొచ్చును. వ్రాయనూ, చదవనూ గూడ." ఉచ్చారణలో ఒక నూలుపోగు యాస వున్నదేగాని భాషలో దోషంలేదు.

నా విచారం ఒక్క నవ్వుతో కొట్టుకుపోయింది.

"మీరు చేసిన సహాయానికి నేనెంతో సిగ్గు పడుతున్నాను. నా వద్ద ఈ బంగారు కడియం తప్ప మరేమీ లేవు. దీన్ని అమ్మదామనే తలంపుతో దారి తెలియక బస్సు ఎక్కాను"

"అయితే మీది ఈవూరు కాదన్నమాట?"

"నాకు ఎవరూలేరు. కట్టుబట్టలతో ఒంటిగా ఇప్పుడే ఈ వూరిలో దిగాను."

"మీ కభ్యంతరంలేకుంటే మాయింటికి రావచ్చును. నాకూ ఎవరూ లేరు. తినటానికి దిగుల్లేదు."

* * *

మూగదానికి మూతిమీద కొడితే మాట వచ్చిందన్నట్లు, నా రొట్టె విరిగి నేతిలోపడ్డది. నా కెప్పుడూ వున్న దీ ధైర్యం: నేను చెడిపోను. ఏదైనా సాధించితీరుతాను. ఆత్మవిశ్వాసం మాత్రం నాలో సడలిపోలేదు. ఇక ఆడాలి ఆట.

"రండి. జాగ్రత్తగారండి. కొత్త మెట్లుగదా" అని నాచేయి పట్టుకుని మూడో అంతస్థులోనికి తీసుకుపోయాడు. అప్పు డనిపించింది కౌన్సిలరబ్బాయి రెండో అంతస్థు ఎక్కిస్తే, ఇప్పుడు మూడోది ఎక్కుతున్నాం.

"చూడండి. ఈయిల్లు మీకు నచ్చిందా?.... ఇలారండి ఇది నా షోరూమ్. ఈ ఫొటోలన్నీ నేను తీసినవీ, నాకు బాగా నచ్చినవీను" నవ్వుతూ అన్నారు.

"మీరు ఫొటోలుగూడా తీస్తారేమిటి?"

పెద్దగా నవ్వారాయన. ఆ నవ్వుమాత్రం మహా దారుణంగావుంది. నవ్వుతున్నారో లేక ఏడుస్తున్నారోగూడా చెప్పలేం.

"బాగానేవుంది. ఫొటోలు తీయటమే నాపని.... ఇదిగో ఈ కెమేరా చూశారా? క్రొత్త ప్రోసెస్‌లో నేను స్వయంగా తయారు చేస్తున్నాను. మామూలు కెమేరాలు మాదిరిగా ముడి ఫిలింపైని ముందు తీసుకోవటం,

అటుపైని ప్రింటులు ప్రత్యేకంగా ఎత్తుకోవటం లాంటి యాతనంతా ఈ కెమేరాకుండదు. ఇది పూర్తిగా తయారైతే....నేనే ఇందుకు ప్రథమ ప్రయత్నం చేస్తున్నాను. ఫిలిమ్ పరిశ్రమకంతగా ఉపకరించకపోయినా, వ్యాపారరంగంలో ఇది బాగా డబ్బు చేసుకుంటుంది ...డబ్బు విలువ మీకు తెలిసిందేగా?" అన్నారు.

ఎందుకో చెప్పలేనుగాని ఒళ్లు జలదరించింది.

"అవును. డబ్బు విలువ బస్సులో కండక్టరే తెలిపాడుగా" నవ్వుతూ అన్నాను.

"అంతే. ఈనాడు మనిషిని నడిపించేది ప్రాణం కాదు. ధనం. ప్రాణం లేకున్నా ధనముంటే నడచి పోవచ్చును. ఏమంటారు?"

"అవునంటాను."

"నావద్ద కొద్దో గొప్పో ధనముండబట్టేగా మీరు మా యింటికి రాగలిగారు?"

పరమసత్యమైనా కఠోర మనిపించింది.

"మీకు కష్టం కలిగితే క్షమించండి. నేను నిర్మొహమాటంగా నిజం మాట్లాడేమనిషిని....నా భార్య నన్నొదిలిపెట్టి పోయిందంటే-ఈ ధనమేగా కారణం? నా కంటే ఆ రాజాగారు మిక్కిలి ధనవంతుడు. డబ్బుతో చలి కాగవచ్చని ప్రేమించే భర్త నొదిలి పోయింది."

"అయితే మీ భార్య...."

"అవును. పదిహేనేండ్లక్రితం మేమిద్దరం కలసి ఇంగ్లాండునుంచి యిక్కడికి వచ్చాం. నేనక్కడే ఫొటోగ్రఫీ నేర్చుకున్నాను. రాగానే, నాకిక్కడ ఫిలిమ్ కంపెనీలో మంచిస్థానమే దొరికింది. ఎలా లేదన్నా నెలకు పదివందలు ముట్టేవి. మా ఆవిశామణికి, ఆ ఆదాయం సరిపోక ఒక మహారాజావారిని చూచుకుంది....విడాకులిచ్చి వెళ్ళిపోయింది."

నేనేమీ మాటాడకుండా వింటున్నాను. ఆయన మళ్ళీ ప్రారభించారు

"అప్పటినుంచి నేను బ్రహ్మచారిగానే వుంటున్నాను. ఏ ఆడదాన్ని నమ్మేందుకూ, నా మనస్సంగీకరించడంలేదు....కాని ఈ నాడు

మిమ్మల్ని తెచ్చాను. నేను ప్రేమించా ననుకుంటున్నారేమో. పొరపాటు నేనిక ఎవరినీ ప్రేమించలేను. ఒక్క డబ్బును తప్ప" కాస్తంత ఆగారు.

నేను అతిశ్రద్ధగా వింటున్నాను.

"మీ ముఖం ఫొటోగ్రఫీకి పనికి వస్తుంది. మీకంటే అందంగా పైకి కనుపించే ముఖాలు చాలా వున్నాయి. కాని ఫొటోలో వారు తేలిపోతారు. మీ ముఖం అలాకాదు. సినిమా తెరకు సరిగ్గా సరిపోతుంది. ఏ భావాన్నయినా మీ ముఖం తేలికగా తెలియపరుస్తుంది. ఇంత ప్రస్ఫుటమైన ముఖకవళికలు గల స్త్రీని, నే నిదే తొలిసారిగా చూస్తున్నాను."

నే నేదో మహాసముద్రంలో పడి కొట్టుకుపోతున్నాను.

"అయితే నన్ను డబ్బు చేసుకుంటా రన్నమాట!" భయపడుతూనే అడిగాను.

మళ్ళీ పెద్దగా నవ్వారాయన. కాదు పెద్దగా ఏడ్చారు.

"చేసుకున్న డబ్బు చెరిసగం."

  

మనం పిల్లి పిల్లని పెంచుకుంటున్నామంటే దానిపై ప్రేమవల్ల గాదు; ముద్దొస్తున్నదన్న మక్కువ కొద్దీగాదు. ఎలుకలుచేసే నష్టాలనుంచి ఎంతో కొంత లాభం పొందుదామని. అందుకే దాన్ని దువ్వి పాలు పెరుగులు పోస్తాము. అక్కడ పొందుతున్న నష్టంనుంచి మాత్రమే తప్పించుకుందామనే ప్రయోజనముంటే-ఇక్కడ నష్టమేమీ లేకపోయినా కేవలం లాభం పొందగలమనే ఆశతోనే నన్నాయన చేరతీశాడు.

పిల్లికి సహజమైన ఆహారం ఎలుకలే కాబట్టి అది ఎలుకలను పట్ట గలదా లేదా అన్న మీమాంసరాదు. నమ్మలేని నరజాతిలో పుట్టాను గనుక నకిలీయో కాదో నని, నన్ను మెరుగుపెట్టి చూడవలసి వచ్చింది.

మరునాటి ఉదయమే వస్తాదులాంటి ఒక పెద్దమనిషి కారెడు సామానులతో దిగాడు. నాకు పరీక్ష ప్రారంభమైంది. కుర్చీలో కూర్చోబెట్టి ఒకవేషం వేయడం, వెంటనే ఫొటో తీయడం... గౌను తొడిగి

పిల్లను చేశారు. లాగుకట్టి పగరాయడు మస్తాన్ వేషం కట్టారు. రాణీని చేశారు; నెత్తికో బుట్టపెట్టి ఏకులబుట్ట అవ్వగా తయారుచేశారు. వారికి కావలసిన వేషాలన్నీ వేసి చూసుకుని "ఓకే అంటే ఓకే" అనుకున్నారు. పరీక్షలో నెగ్గాను గాబట్టి బ్రతికిపోయాను.

"నేను చెప్పానుగదూ? నీవు అన్నివేషాలకూ పనికొస్తావు." చూడమని అప్పటికప్పుడు తీసినఫొటోలన్నీ నా ముందుంచారు. వేషాలన్నీ బాగానే వున్నాయి. కాని ముసలమ్మ వేషం మాత్రం నాలో లేని పోని ఆలోచనలను రేకెత్తించింది.

అలాగే ఫొటోను చేత్తోపట్టుకుని ఏమేమో యోచిస్తున్నాను.

"నేనూ ఒకనాటికి ఇలా అయిపోతానన్నమాట? ఆ ముడతలు పడిన శరీరం, డొక్కుపోయిన చెక్కిళ్ళు, గుంటలుపడ్డ కళ్లు....అయ్యో! నా అందమంతా ఏమైపోయేను?"

"ఏమిటి ఆలోచిస్తున్నావు?"

"నేను ఏనాటికైనా ఇలా మారిపోవలసినదాన్నేగా?"

ఆయన పెద్దగా ఏడ్చారు. పొరపాటు. నవ్వారు. వారి నవ్వుకూ ఏడ్పుకూ తేడా లేదని చెప్పానుగదా. ఎప్పుడు నవ్వినా నవ్వే; ఏడ్చినా నవ్వే.

"నువ్వేమిటి? నేనేమిటి? చర్చిల్ అంతటివానికే సొట్ట బుగ్గలు పడిపోయాయి" అని మళ్లీ నవ్వాడు.

నేను నవ్వలేకపోయాను.

చప్పున నాకు సిద్ధార్థుడు స్మృతిపథాని కొచ్చాడు. ఆయనా తన రథ సారథియైన చెన్నుడిని ఇదే ప్రశ్న అడుగుతాడు.

"చన్నా! ఆ మనిషి అలా వున్నాడేం? పాపం నడవనైనా నడువ లేకపోతున్నాడేం!"

"ముదుసలి యైపోయినాడు ప్రభూ! అతనూ ఒకప్పుడు కండలు మెలి తిరిగిన వస్తాదే. ముష్టియుద్ధంలో ఒక్కసారిగా నలుగుర్ని కొట్టే వాడు. కాని వృద్ధాప్యం చేతికి కర్ర నిచ్చింది. ఎవరైననూ అంతే ప్రభూ! కాలానికి తల వంచవలసినదే."

"అయితే రాజకుమారుడను-నన్ను గూడా వృద్ధాప్యం వశపరచుకుంటుందా?"

"మీరేమిటి, నేనేమిటి ప్రభూ! పుట్టిన ప్రతి జీవరాశి గిట్టవలసిందే. ఇదొక్కటే సత్యం. ప్రపంచంలో సత్యమనేది ఒక టున్నదంటే-అది మృత్యువు ఒక్కటే."

"నే నొప్పను. మానవుడు జన్మించినది మృత్యువు వాత బడేందుకంటే నే నంగీకరించలేను. చెన్నా! నీకూ నాకూ, మనందరికి అర్థంకానిదేదో వున్నది."

"ఏమీలేదు. పచ్చగా వున్నన్నాళ్ళు వెచ్చగా బ్రతకటం; ఆ పైని తనువు చాలించి అనంతంలో కలిసిపోవడం. అంతే."

"ఏమండీ అంతేనా?"

"ఏమిటంతేనా?" అన్నారాయన.

"పచ్చగా వున్నన్నాళ్ళూ జీవించడం,అటుపైని అంతరించడ మనేదేనా సత్యం?.... ఈ అందమైన శరీరానికి అంతకంటే శాశ్వతత్వం లేదంటారా!"

"నేను చేస్తున్న ప్రయత్నమంతా అదేగా. నీ అపురూపమైన అందానికి శాశ్వతత్వం చేకూర్చాలనే నా ప్రయత్నం. బెంగ పెట్టుకోకు, నీవు ముసలిదానివి కావులే" అన్నాడు.

ఆ ఓదార్పు పలుకులకు నాకు నవ్వొచ్చింది.

తీసిన ఫొటోలన్నీ షో రూములో ప్రముఖంగా అలంకరించబడ్డాయి. ఆ ముసలి వేషం మాత్రం అక్కడ వుంచవద్దని ప్రాధేయపడ్డాను. అదే అన్నిటికంటే కళాత్మకంగా వుందని, ప్రత్యేక యేర్పాట్లతో పైభాగాన అలంకరింప చేశారు.

ముచ్చెనగుంట వరకు జుట్టు కత్తిరించి జులపాల క్రాపు చేయించుకోమంటే, నే నభ్యంతర పెట్టలేదు. యెత్తుమడమల బూట్లు తొడుక్కోమంటే, సరే తెమ్మన్నాను. పెదాలకు రంగుపూసుకోమంటే, ఇక వద్దనే

దాకా దట్టంగా పులుముకున్నాను. సంగీతం భరతనాట్యం వగైరాలు అభ్య సించాలంటే నమస్కారప్రమాణ మాచరించాను. ఉదయమే లేచి కస రత్తు చేయాలని ఆజ్ఞ పెడితే, ఔ నన్నానేగాని, కాదనలేదు. వా రెంత చెబితే అంత. వారి చేతిలో నే నిప్పుడు కీలుబొమ్మను.

*   *   *

నే నిప్పుడు వెనుకటి సుబ్బుల్నిగాను. వేషభాషలన్నీ పూర్తిగా మారిపోయాయి. దానితోపాటు పేరుకూడా "సుబ్బలక్ష్మి" అయింది. ఈ పేరుకూడా అంత నాగరికంగా లేదని అయ్యవారన్నారుగాని, తెలుగు లకూ, తమిళులకూ సరిపడే పేరని వారిని ఒప్పించాను. ఇంగ్లీషు భాష తప్ప వేరొక భాషను నే నిప్పుడు నోట పట్టటంలేదు. ఇంతెం దుకు-కష్టసుఖాలలోసైతం ఇంగ్లీషునే వాడుతున్నాము.

నా పరిచయాలు. పరిసరాలు అన్నీ అలాంటివే అయిపోయాయి. సినిమా డైరక్టర్లు, సంగీత విద్వాంసులు, కథానాయకులు, నాయికలు ఇత్యాదులే మా యింటి కొస్తుండేవారు.అందరితోనూ కలుపుగోలుతనంగా మాటాడుతుండేదాన్ని. కాని మా అయ్యగారి ఉద్యోగానికి వేళా పాళా వుండేది కాదు. ఎక్కువగా రాత్రిపూటే పని తగులుతుండేది . ఒక్కో మాటు రాత్రి వెళ్ళినమనిషి మూడు రాత్రులయినా తిరిగి వచ్చేవాడుకాదు.

నే నొకరోజు నవ్వుతూ "ఇదేం ఉద్యోగమండి? పక్షిరాజావారి రాజ్యమల్లే రాత్రి పనిచేయడం; పగలు నిద్రపోవటమేమిటి?" అన్నాను.

"అంతే. మేమంతా పక్షిరాజులం. రాత్రిపూట అయితేనే మా పని సాగుతుంది" అన్నారు.

అప్పటినుంచి వారిని ముద్దుగా "పక్షిరాజా" అనే పిలుస్తున్నాను.

పక్షిరాజాగారు నన్ను ముట్టుకోరు. నాకూ వారిని ముట్టుకోవా లన్న కాంక్షలేదు. ఇద్దరం కలసి వుంటున్నామంటే కాపురం చేస్తున్నా మనే అంతా అనుకునేవారు. కాని మా ఉభయుల ప్రయోజనాలు వేరు వేరనీ, ఒకందుకు మాత్రమే కలసి వుంటున్నామనీ ఎవరు వూహించ గలరు? నా పనేదో నేను చూసుకునేదాన్ని. వారి పని వారు. అప్పు డప్పుడు మాత్రం నేనెంత దూరం సాగేనోనని పరీక్ష పెట్టేవారు.

"సంగీతపాఠం ఎందాకా వచ్చింది?"

"భరతనాట్యంలో ఇప్పటికైనా అభిరుచి కలిగిందా?"

నాపై ఖర్చుపెట్టే డబ్బుకు జమయేమయిందో చూసేవా రన్నమాట. నాట్యంకంటే సంగీతంలో నా కభిరుచి మెండు. అందుచేత సంగీతాన్ని శ్రద్ధగా అభ్యసిస్తున్నాను. ఏమి టీ రోజు పాఠమని పక్షిరాజావా రడిగితే ఒక్కరాగం కొట్టేదాన్ని. దానితో "పైమెరుగేకాదు. లోపలగూడా మంచి విలువుంది" అనేవారు పక్షిరాజాగారు.

ఒకనాడు పట్టపగ్గాలులేకుండా ఇంటి కొచ్చారు.

"ఏమిటి? ఏమిటా ఆనందం?" అన్నాను.

"మనకు మంచిరోజు లొస్తున్నాయి. ఆరోగ్యం కాపాడుకో" అన్నారు.

నేను నవ్వి వూరుకున్నాను.

"ఒక మిత్రుడు సినిమా కంపెనీ పెట్టాడు. అందులో...."

"నాయికను నేనేనా?"

"అవును. త్వరలో సెట్టుకు వెడుతుంది.సంగీతంతోపాటు నీ విక అభినయంకూడా నేర్చుకోవాలి అభినయ మనేది ఒకరు చెబితే వచ్చేది కాదు....అనుభవమే అభినయం."

"అయితే అభినయానికి ముందు ఏర్పరచుకోవలసిన సాధన సామగ్రులేమిటి?" అని అడిగాను.

"చాలావుంది. అదొక మహాసముద్రం, నీవిక ప్రతిరోజూ జనం లోకి వెళ్ళి 'స్టడీ' చేయాలి. రోజుకో పాత్రను పరిశీలించి రావాలి. ఏ పాత్ర దొరకందే ఇంటిముఖం చూడకూడదు. అంత శ్రద్ధా, ఓపికా కావాలి."

"నిజంగా అలా పరిశీలించడమంటే నా కెంతో సంతోషం. ఈ రోజే బయలుదేరుతాను" అన్నాను.

నన్నెత్తుకు గిరగిరా తిప్పి "అయితే ఇక బయలుదేరు" అని బొంగరాన్ని వదలినట్లు వదిలారు.

రోజుకో ప్రాంతానికి వెళ్లి, ఒక ప్రత్యేక తరహా మనిషిని పట్టుకునేదాన్ని. ఒకనాడు బిచ్చగత్తెను, ఒకనాడు పెరుగమ్మే ప్రౌఢ నాయికను, శ్రీమంతుల ఇల్లాలును, శీలాన్నమ్ముకునే షోకిల్లాపిల్లను పసిగడుతుండేదాన్ని. ఏ పాత్రను పరిశీలించి వచ్చానో, గడపలో అడుగు పెడుతూనే ఆ పాత్రను అభినయించేదాన్ని.

ఒకనాడొక వింత సంఘటన జరిగింది. రాత్రి ఏడుగంటలయిందేమో, ఒక పాత్రను చూచి ఇంటికొస్తున్నాను. ఆ పాత్రే నా తలలో కదిలాడుతున్నది. దాన్ని పలుకరించుకుంటూనే నడుస్తున్నాను. ఒక పోలీసువాడు ఏదో అనుమానంతో చూసినట్లు నన్ను చూశాడు. వెంటనే వాడ్ని ఏడ్పించాలనిపించి దొంగమొహం వేసి బిత్తరచూపులు చూశాను. ఇంకేం? అనుకున్నట్లే నా వెంట పడ్డాడు. నాకు నవ్వువస్తోంది. అయినా ఎంతవరకు అభినయించగలనో, నాకుగల శక్తిసామర్థ్యత ఏమిటో ఈ నాడే తేల్చుకుందామని ఒక సన్నగొందిలోకి తిరికి వెనక్కు దిరిగి చూశాను. వాడూ ఎటో చూస్తున్నట్లూ, నాకొరకు కాదన్నట్లూ నటించబోయాడు. నాలోని ఉత్సాహం మరికొంత పెరిగింది. నడక జోరు చేశాను. వాడూ అంగపంగలతో వెంబడిస్తున్నాడు.

అనుకోకుండానే ఒకయింటిలో జొరబడ్డాను. అది ఒక పెద్దభవనం. నన్ను చూస్తుండగనే కాపలావాడు "పైకి వెళ్ళండి. చాలాసేపయింది మొదలుపెట్టి" అని తొందర చేశాడు. గబ గబా మెట్లెక్కి పైకి పోయాను. అక్కడేదో చిన్న సభలాంటిది జరుగుతున్నది. ఒక కుర్రవాడు కొత్తబట్టలతో ప్రత్యేకంగా అలంకరింపబడ్డ ఒక స్థానంలో కూర్చుని వున్నాడు. ప్రక్కనే నిలబడి గుస గుస లాడినట్లు ఎవరో ఒకాయన ముక్కుతో మాటాడుతున్నాడు.

ఆ కూర్చున్నవాడ్ని చూశాను. కండ్లు నులుముకుని మళ్ళీ చూశాను ...ఎవరీతడు? నాకు మగవేషం కట్టి తీసిన ఫొటో ఎలావున్నదో, ఏమాత్రం కుడిఎడమలు లేకుండా అచ్చు అలాగే వున్నాడు. పోలీసువాడి మాటగూడా మరచ చూస్తున్నాను. ఎవరీతడు? ఎక్కడివాడు?

సభచాలించి ఎవరిదారిని వారు పోతున్నారు. నేనలాగే కూర్చున్నాను. వయసుచెల్లిన ఒకావిడ వచ్చి నన్ను పట్టిపట్టి చూసింది, వెంటనే నేను దిగి

వచ్చేశాను.పోలీసువాడు వీధి మొదట్లోనే నిలబడి బీడీకాల్చుకుంటున్నాడు. అభినయమింకచాలించవచ్చునని-నేనేఅతనివద్దకువెళ్ళిఅనుమానితురాలను కాననీ. అభినయం నేర్చుకుంటున్నాననీ ఉన్న దున్నట్లు చెప్పాను. అతను నవ్వుపుట్టించుకుని, "రొంబా కష్టం పెట్టితవి,కాఫీకైనా దుడ్డు...." అంటుండగానే ఒక రూపాయికాసు చేతిలో పెట్టి 'ఎవరికీ చెప్పకు' అని బస్సు ఎక్కాను.

♦ ♦ ♦

ఎవరీతడు? ఇంటికి వెళ్ళినా నన్నీ ప్రశ్న వేధించుతూనే వుంది.... ఎవరైతేనేం? మనిషిని పోలిన మనుషు లుండరా? అని ఎంత సరిపెట్టు కుందామన్నా వీలులేకుండా వుంది. కాదు. దీని వెనుక ఏదో కథ దాగి వున్నట్లు మనసు హెచ్చరిస్తున్నది.... అవును.

తాతయ్య ఎప్పుడో చెప్పినజ్ఞాపకం. వాళ్ళ అమ్మగారూ,ఈయనా.... అవునవును. తాతయ్య కాలు అందుకే పోయింది. తాతయ్య వూరొదిలి పెట్టినతరువాత వాళ్ళమ్మగారు కొంత పైకం, దానితో పాటు ఒక ఫోటో అయ్యయ్యయ్యో! అవన్నీ ఆ కౌన్సిలరుగాడి యెదానపెట్టానే. ఆ ఫోటో, బడిలో నాకు బహుమతిగా లభించిన ఉంగరం-అన్నీ వాడే ఊడ్చుకు పోయాడు....తాతయ్య ఇదిగూడా చెప్పాడు. వాళ్ళ అమ్మగారు చనిపో యిందనీ, మిగతావారు ఏదో వ్యాపారంమీద పట్నంపోయారనీ....అబ్బా! ఇప్పుడు గుర్తొచ్చింది... దొరికారు దొంగలు.

"ఏమిటి లక్ష్మీ! నీలో నువ్వే సంతోషిస్తున్నావు! ఈ రోజు చాలా నేర్చుకొచ్చావేం?" అంటూ ఎప్పుడూ రానివేళన పక్షిరాజా వచ్చాడు.

"నిజంగా ఈరోజు చాలా నేర్చుకొచ్చాను. ఎన్నాళ్ళనుంచో కంటి కగుపించకుండా వున్న ఒక రహస్యాన్ని ఈనాడు పసిగట్టాను. చెపుతాను వినండి."

యావత్తు కథను కండ్లకు కట్టినట్లు వివరించాను.

"దీన్ని వూరికే వొదిలిపెట్టరాదు. డబ్బు చేసుకోవాలి" అన్నారు తనకుతనే మాటాడుకుంటున్నట్లు.

"వెధవడబ్బు. మీ రెప్పుడూ డబ్బుమనుషులేం?....డబ్బుగాదు. వారిని సర్వనాశనం చేయాలి. అప్పటికిగాని నా కసి తీరదు. కసితీరదు" అన్నాను.

మళ్ళీ ఆ వెధవ నవ్వే నవ్వారు.

"లక్ష్మీ! తప్పు ఎవరిదైతేనేం? జరిగిపోయిన దేదో జరిగిపోయింది....ఒక వ్యక్తిమీదుగా కారు పోయిందనుకో. అతను చనిపోతాడు. ఆ చనిపోయినవ్యక్తి మనకు అప్తుడైనప్పుడు, నిజంగా ఆ కారు తోలినవాణ్ని గొంతు నులిమి చంపేద్దామన్నంత కోపమొస్తుంది. ఆ ఆవేశంలో వాడ్ని చంపుతామనుకో. మనకు లాభించేదేమైనా వుందా? చనిపోయిన బంధువు తిరిగివస్తాడా?....తప్పు. చంపకూడదు. బ్రతికుండ నిచ్చే వాడ్నీ, వాడి కారునూ వేలం వేయించి డబ్బు చేసుకోవాలి. అన్ని విధాల మనకిదే ప్రయోజనంగాని, పోటీపడి ప్రాణాలు తీయడం తెలివి కాదు. ఆలోచించు."

"అయితే ఏమిటిచేతా మంటారు?"

"ఆవిడ చనిపోయింది. ఆవిడభర్త యింతవరకు బ్రతికుండడు. మీ తాతయ్యకు పుట్టిన సంతానమే యిప్పుడా యింటికి పెద్దయి వుంటాడు ....ఆఁ నీవు చూచిన కుర్రాడికి ఎన్నేళ్ళుంటాయన్నావు?"

"అయితే ఆ కుర్రాడు మా తాతయ్య మనుమడై వుంటాడు" అని అందించాను.

"అవు నంతే. తండ్రిపోలిక వచ్చివుంటుంది.... ఆవిడ ఆయన కంటే ముందే చనిపోయింది కదూ?"

"అవును. ఆవిడ పోయిన తరువాతనే యిక్కడి కొచ్చారు" అన్నాను.

"మీ తాతయ్యకూ ఆవిడకూ సంబంధం వుందని ఊరందరికీ తెలుసునా?"

"ఏమో నాకేం తెలుసు? అయినా తెలియకుండా ఎలా వుంటుంది?"

"అవునులే.... ఆ వాసన ఇప్పుడు బ్రతికున్న వాడిదాకా గూడా వచ్చివుంటే, మన కింకా మేలు. మన పని సులభంగా అయిపోయిం దన్నమాటే.... నీ కెందుకు? నీవు చూస్తూ వుండు. నేను నడుపుతాను నాటకం."

  

నా తలరాత ఏమిటోగాని సమయ మొచ్చేటప్పటికి, ఏదో చిక్కు నన్ను చుట్టుకుంటుంది. అనుకోకుండా, అకస్మాత్‌గా ఏ పిడుగో కొంపమీద పడుతుంది. లేకుంటే ఏమిటి చెప్పండి. నే నిప్పుడు ఏ దశలో వున్నాను- నా కిప్పుడు నెలతప్పడ మేమిటి? ఆ కౌన్సిలరు కుక్కతో అన్నాళ్లు కులికితే రానిది, నా కిప్పుడు కడుపు రావడమేమిటి? ఇది వాడి పాపమో లేక సోడాకొట్టు కుర్రాడి పున్నెమో, నేను మాత్రం అనుభ వించాలిగదా?

తల్లి కాబోయే ప్రతి స్త్రీ సంతోషిస్తుంది. కాని దానికి సమయా సమయా లున్నాయిగా? ఎవరివద్దనో తలదాచుకుంటున్న తరుణంలో, సినిమానటి కాబోయే సమయంలో ఇదితగునా? ఏమో? ఏమీ తోచకుండా వుంది? ఆలోచించినకొద్దీ బ్రతుకులో శాంతి కనుమరుగై పోతున్నది.

"కానీయ్ లక్ష్మీ! బయలుదేరు" అన్నా డొకనాడు పక్షిరాజా,

"ఎక్కడికి?"

"డబ్బు చేసుకోడానికి. మీ పెదనాన్న నొకసారి చూసి వద్దాము."

"పెద నాన్నెవరు?"

పెద్దగా ఏడ్చి "నావెంటరా చూపుతాను" అని నన్ను చంక నేను కున్నాడు.

టాక్సీ మోతపెట్టుకుంటూ బయలుదేరి, నే నానాడు చూసిన భవనం ముందు నిలిచిపోయింది.

"ఈయిల్లు మీ కెలా తెలిసింది?" ఆశ్చర్యపోయి పక్షిరాజాను ప్రశ్నించాను.

"అంజనం. అంజనం వేశాము....చీరె తలపైకి లాక్కో."

వారి వెంటనే నేనూ నడిచాను.

కాపలావాడు నమస్కారంచేసి "అయ్యగారు భోంచేస్తున్నారు. లోనికివెళ్ళి చెపుతాను. మీ రిలావచ్చి ఈ గదిలో కూర్చోవచ్చు." అని నడవ ప్రక్కనే వున్న గది చూపాడు.

మేము గదిలోప్రవేశించాము. నవీన పరికరాలూ, పనిముట్లతో అందంగానే అలంకరించ బడివున్నది. గోడకు ఒక పెద్ద ఫొటో-ఫొటోకు తగిన పెద్ద తలపాగా, మీసాలతో నిండుగా వున్న-విగ్రహం.

"అతనే మీ తాతయ్య పోటీదారు" నవ్వుతూ మెల్లగా అన్నాడు పక్షిరాజాగారు.

వెంటనే ఆనాటి సంఘటన నా కండ్ల ముందు మెదిలింది. తాతయ్యను పట్టుకోడం, రెక్కలు విరిచి కట్టేయడం, బురదలో తొక్కడం-వరుసగా ఒక్కసారి కళ్ళకు కట్టాయి.

"ఒక్కమాట. ఆయన గదిలోకి వచ్చిన వెంటనే కాళ్లకు నమస్కారంచేయి. ఏమీ చిన్నతనంలేదు. తెలిసిందా?.... ఆపైని...." అంటూ తల ఆడించాడు.

నాకూ తెలిసింది లెమ్మన్నట్లు టైమ్‌పీస్ లోని కోడిపుంజు తల ఆడిస్తూ ఊగుతున్నది. నేను దానివంకే చూస్తున్నాను. అది ఎన్నిసార్లు ఊగిందో లెక్కలేదు. అబ్బబ్బ! ఈ ధనవంతులు ఏమి తింటారో గాని అందరూ అంతే. ఆడది సింగారించు కున్నట్లే.

ఒక గంటకు గాను నములు కుంటూ, నానుకుంటూ మూడో పడిలో పడిన ఒక దొరగారు దిగారు. ఆయన గదిలో అడుగు పెట్టగానే, మేమిద్దరం లేచి నిలబడ్డాము. కొంగు తలపైకి తీసుకుని. వంగి పాదాల నంటుకున్నాను. లేచినిలబడ్డానో లేదో రెప్పవాల్చకుండా నావంకే చూస్తున్నారు. పక్షిరాజాగారు మాత్రం నెమ్మదిగా కుర్చీలో కూర్చుండి పోయారు.

"ఎవరు? ఎవరండీ ఈమె?"

పక్షిరాజానుగూడ వారు ఎరుగరాయె.

జ్ఞాపకం లేదు. మీరెవరో...." అనగానే పక్షిరాజా అందుకున్నారు.

"ఎవరను కొంటున్నారు?.... ఆ అమ్మాయివైపు మరొక మారు చూడండి.

తలవంచుకుని వున్న నన్ను నిజంగానే మరో మారు చూశారు. నేను వారి కాళ్ళను మాత్రమే చూస్తున్నాను. ఆ కాళ్ళూ, కాలి గోళ్ళూ అచ్చం తాతయ్యవే.

"ఎవరో గాని మొత్తానికి మా ఇంటి పిల్లే."

దొరికిపోయాడనే సంతోషంతో పక్షిరాజాగారు కుర్చీ రెక్కల నొక్కసారి అదిమి కూర్చున్నాడు.

"ఎవరో చెప్పరూ? ఎవరీమె?" మాకుగూడ లేని తొందర వారికి కలిగింది.

"మీరే ఊహించండి" ముసిముసి నవ్వులు నవ్వుతున్నాడు పక్షిరాజాగారు. ఉచ్చారణను గూడ మరికొంత నొక్కి యాస పలికిస్తున్నాడు.

"నే ఊహించలేను, దయచేసి...."అంటూ ప్రాధేయ పూర్వకంగా అడిగినట్లు అడిగి కూర్చున్నారు.

పక్షిరాజా ముఖం గాలిబంతిలా ఉబ్బింది. వారుకూడా ఊపుతున్న కాలు నిల్పి, అతి శ్రద్ధతో వేచి చూస్తున్నారు.

నేనుమాత్రం దించిన తల దించినట్లే వుంచాను.....ఎంతకూ ప్రారంభించరు. అటూ ఇటూ మెసిలేందుకు గూడ వీలులేకుండ కుర్చీ నంటుకుకూర్చున్నాను.

"మీతో చాల మాట్లాడాలి. మరో గదిలోనికి వెళ్ళడం...."

"సరే, నీవు కొద్దిసేపు పైకి వెళ్ళమ్మా.... వద్దులే, మనమే పైకిపోదాము రండి. నీ విక్కడ కూర్చోమ్మా. ఇప్పుడే వస్తాం" అని నావైపు చూడకుండానే ఇద్దరూ మేడపైకి వెళ్ళి పోయారు.

పక్షిరాజా ఎత్తుగడ నాకర్థమైంది కాదు. నన్ను ప్రక్కకు నెట్టి, నాకు తెలియకుండా రహస్యంగా నన్ను గూర్చి ఏమి మాటాడాలో నాకు బోధపడ లేదు. గదిలో తారట్లాడుతూ ఆలోచిస్తున్నాను. టైమ్‌పీసు చేతికి తీసుకుని 'కీ' యిచ్చాను. అది ప్రాణంపోయినట్లు గిలగిల గంట కొట్టేసరికి, కాపలావాడు వచ్చి 'మీరాండి అమ్మగారూ?' అనుకుంటూ తిరిగి తన స్థానం లోకి వెళ్ళిపోయాడు.

ఆ రోజు కనుపించిన కుర్రవాడు కనిపిస్తాడేమోనని నడవలోకి వచ్చాను. కాని తలుపులన్నీ మూసి వున్నాయి.

"ఏం కావాలమ్మగారూ?" అడిగాడు కాపలావాడు.

"మీకు కుక్క లేదేమిటి?"

"నేనుండగా ఇంక కుక్క దేనికం డమ్మగారూ?" అంటూ నవ్వాడు. ఆ మాటంటూ అత నెలా నవ్వ గలిగాడోగాని నాకు నవ్వురాలేదు.

"అంటే నీవూ కుక్కా ఒక్కటే నన్నమాట?"

"అంతేగదండమ్మగారు. మా యిద్దరిపనీ, బాబుల్ని కాపలా కాయటమేగా? తినటాని కింత తిండి పడేస్తే రేత్రిం బగళ్లు తోకాడించుకుంటూ పడుంటాం" అని మళ్ళీ నవ్వాడు.

ఇలాంటి మనుషులు సైతం నవ్వ గ్గలుగుతారని నే నప్పుడు తెలుసుకున్నాను.

గదిలోకి వెళ్ళి కూర్చున్నా ఎంతసేపటికీ రారాయె. కుర్చీలో జేరబడి తల వాల్చాను. ఎప్పుడు నిద్ర పట్టమంటే నా కప్పుడు నిద్ర పడుతుంది. కన్ను మూశానంటే ఎంత లావుపాటి రద్దీఅయినా సద్దు మణగవలసిందే. టిక్కు టిక్కు మంటూ టైమ్‌పీస్ కొద్దిసేపు నన్ను అభ్యంతరపెట్టినా నేను పట్టించుకోలేదు. నా పని నేను కానిచ్చాను.

పక్షిరాజా వచ్చి నన్ను పిలవకుండానే తట్టిలేపాడు. నేను ఉలికిపడి లేచి, నిలబడి అటూ ఇటూ పారజూచాను. పక్షిరాజా తప్ప ఎవరూ లేరు.

"పోదాం పద."

"ఇంతకూ...." అని నేనడుగుతుండగనే 'ఇస్. వెడదాం రా' అంటూ దారి చేశాడు.

♦ ♦ ♦

"మన మేదో ఆతృతతో రెక్కలు కాళ్ళు విరుచుకుంటూ రాత్రింబవళ్ళు ఆరాట పడతామేగాని, కలిసివచ్చే రోజుంటే వద్దన్నా డబ్బు రెక్కలు గట్టుకువచ్చి వాలుతుంది" తన ఇష్టప్రియను గ్లాసులో పోసుకుంటూ మాటాడుతున్నాడు పక్షిరాజాగారు.

కుర్చీని దగ్గరకు లాక్కుని వారి కెదురుగా వేసి కూర్చున్నాను.

"ఇక చెప్పండి. మొదటినుంచీ. ఎలా ప్రారంభించారో ఏమిటో?" అన్నాను.

ఒకసారి పెద్దగా ఏడ్చి, ఇష్టప్రియనెత్తి గుట గుట మ్రింగారు. దానికితోడు సొంగ వెలిగించి ఊదర పెడుతూ, పచార్లు కొడుతున్నారు. వారు ఎటు నడిస్తే నేనటువైపు తిరిగి, వారివంకే చూస్తున్నాను. వారిక అభినయింపు మొదలెట్టారు.

"ఇప్పటికైనా ఊహించగలిగారా - ఆ అమ్మాయి ఎవరో?"

"లేదండి."

ఉభయుల సంభాషణను కొంత మూకీగాను, కొంత టాకీగాను అభినయిస్తున్నారు.

"మీ తల్లిగారిని గురించి మీ అభిప్రాయం?"

మొహం కందగడ్డ చేసుకున్నారు.

"అంటే?"

"అంటే మీ తండ్రిగారు ఎన్నడూ మీకు ఎరుక పరచలేదా?"

ముఖం వాలిపోయింది.

"మిమ్మల్ని బాధపెట్టడం నా ఉద్దేశంకాదు. మీ తండ్రిగారు బ్రతికుండగా చాలాసార్లు వారితో మాట్లాడాను. కాని మే మింకో చోటికి బదిలీ కావడంవల్ల మీ పరిచయభాగ్యం లభించలేదు. ఇంతకూ నేనెవరో

మీకు తెలియదుగా? అవునులే. ఎలా తెలుస్తుంది? ఇదే ప్రథమ పరిచయం కదా!....నేను డాక్టర్‌ను....మీ తల్లి...."

పాత్ర పరకాయ ప్రవేశం చేసింది.

"చెప్పకండి డాక్టరుగారు....నాకు తెలుసు....నన్ను కృంగదీయ కండి."

"ఈ అమ్మాయిని నా ఆసుపత్రిలోనే కని, బ్రతిమాలి నా కిచ్చింది."

"అయితే ఆ అమ్మాయి నా స్వంతచెల్లెలా?"

"అవును. మీ తోబుట్టువు.మీరు పుట్టిన పదేండ్ల తరువాత పుట్టింది. అసలు మీ పుట్టుకతోనే నాన్నగారు అన్ని సంబంధాలను అమ్మనుంచి త్రెంచేసుకున్నారు. అయినా పదేండ్ల అనంతరం బిడ్డను కని నా చేతుల్లో పెట్టింది. నాకున్నూ ఎవరూ లేరు గనుక కంటికి రెప్పవలె పోషించి ఈ నాడు మీ బిడ్డను మీకు వప్పగించేందుకై వచ్చాను."

"ఇప్పుడా? డాక్టరుగారు! మీరు బ్రతికున్నంతవరకు మీరే పోషించండి. పోషణకయ్యే ఖర్చు నే నిచ్చుకుంటాను.... నన్నిప్పుడు అల్లరిపాలు చేయకండి."

"అయ్యయ్యో! ఆ అభిప్రాయమేవుంటే ఇంతకాలం...."

"నాకు తెలుసు. ఇవి చేతులుకావు —డాక్టరుగారూ! నా కిప్పుడు ఇద్దరు పిల్లలు. పెండ్లికెదిగిన ఆడపిల్ల వున్నది. ఇదిగో. రెండువేలకు ఇప్పుడే చెక్కు వ్రాసి యిస్తాను. ఎప్పుడైనా మాట్లాడవలసిన అవసర ముంటే స్వయంగా మీరే రండిగాని, ఆ అమ్మాయిని వెంటబెట్టుకు రాకండి. దయచేసి ఈ చెక్కు తీసుకుని వెంటనే వెళ్ళిపొండి. అప్పు డప్పుడు మీ రొచ్చి కలుస్తుండండి. డాక్టరుగారూ! వెళ్ళండి....మీ బిడ్డలా కాపాడండి."

అదే ఉరవడిలో మరో గ్లాసు మ్రింగి, పక్షిరాజాగారు అభినయం చాలించారు.

♦ ♦ ♦

ప్రతి మనిషిలోనూ మంచీ, చెడూ సమపాళ్ళగానే వుంటాయను కుంటాను. ఈ మంచి చెడులు నిరంతరం ఒకదా న్నొకటి వంగదీసుకో వాలని పరస్పర సంఘర్షణ పడుతుంటాయి.ఆసంఘర్షణలో మంచి తలవం చితే చెడిపోయినవారుగానూ, చెడు ఓటమితింటే మంచివారుగానూ రూపొందుతారు. దొంగకూడా దొంగతనం చేయడానికి భయపడుతున్నా డంటే, ఇంకా అతనిలో మంచితన మనే పదార్థం ఉండటమే కారణం. మహాత్ములని వ్రేళ్ళపై లెక్కించే వారిలో సైతం ఎన్నడూ నీచ ప్రవృ త్తులు తలెత్తలేదా? తప్పకుండా తలెత్తాలని నిక్కి చూస్తున్నాయి. కాని మహాత్ములు గనుక, నిగ్రహించుకునో, సత్యాగ్రహం చేసో; ఏదో రక మైన దాడిచేసి మంచిని నిలబెట్టుకుంటారు. బలహీనులు జారిపోతారు; బలవంతులు నిలచి పోరాడుతారు. అంతేగాని ఇదీ ఖచ్చితేని నిఖారసు, ఇది నిలువెల్లా విషము-అని నిర్ణయించడం పొరపాటు.

నేను ఎంత చెడుదాన్నయినా, నాలోని మంచి ఇంకా పూర్తిగా వైదొలగ లేదు. పని గట్టుకుని పుటం పెడుతున్నా, ఏదో మూల దాగి ఎక్కిరిస్తూనే వుంది. నా జీవిత గమనానికి, నా కోర్కెల కలలకు బద్ధ శత్రువైన 'మంచి' అనే దుర్గుణాన్ని నేను పూర్తిగా జయించలేక పోయాను.

ఆయననుంచి డబ్బు రాబట్టడమంటే అందులోనూ తోబుట్టువునని పచ్చి అబదమాడడమంటే, నాకు కొంత కష్టంగానేవుంది. కాని నాలోని ప్రత్యేకగది తలుపులు తెరచుకున్నపుడు మాత్రం సంతోషంతో ఊగి పోయేదాన్ని.డబ్బేకాదు; ఇంకా ఇంకా గుంజాలని కసికొద్దీ పండ్లుకొరికే దాన్ని. ప్రపంచానికంతా చాటించి, వాళ్ళ పిల్లకి పెళ్ళిగాకుండా రచ్చకీడ్వా లని ఉవ్విళ్ళూరేదాన్ని.... ఆ పొంగు లెంతకాలమో నిలిచేదికాదు. వెంటనే ఆకుటుంబంమీద జాలి-ఆ కుటుంబంకోసమే కన్నీరు కార్చే దాన్ని. వాళ్ల కొచ్చిన కష్టాలలో పరోక్షంగా నేనూ పాలు పంచుకొనే దాన్ని. ఈ విభిన్న ప్రవృత్తులు నాలో చెలగాట లాడుకొంటున్నాయి.

నేను తల్లిని కాబోతున్నానన్న సంగతి పక్షిరాజాకు తెలియపరచ లేను. ఆయనకు తెలియపరచాలన్న భావమే నాకు కలుగలేదు. ఇది

మూడోమాసం. చిందులు త్రొక్కటం అంటే భరతనాట్యం వగైరాలు చాలించాలని వారితో చెప్పాను.

"ఎంతమోసం! ఎంతదగా? ఇంతకాలంగా నాకెందుకు చెప్పలేదు? మూడు మాసాలు పెంచుకున్న తరువాత ఇప్పుడు నే చేసేదేమిటి? నన్ను మోసం చేశావు. దగ్గరకు తీసి ఆదరించినవాణ్ణి దగా చేశావు" అన్నారు.

నేను పిల్లల్ని కంటే ఆయన్ను దగాచేసినట్లు ఎలా అవుతుందో నాకైతే అంతుబట్టలేదు.

"మీ కొచ్చిన కష్టమేమిటి? పోషించేవారుగూడా మీరు గాదాయె. ఎందుకూ మీకింత బాధ?" అన్నాను.

"పోషించే దెవరన్నదాకా వచ్చిందన్నమాట?" అని తల ఎగరేశారు.

"మీరు పోషించడంలేదని నే ననడంలేదు నా కెవరూ దిక్కు లేని సమయాన మీరు ఆదుకున్నారు. కాని ఇప్పుడు నన్నుగానీ, నాకు పుట్టిన బిడ్డల్నిగానీ పోషించేందుకు మరొక రున్నారుగా" అన్నాను.

"ఆ పోషించే వారెవరో నా చేతిలో వున్నారు."

"బెదిరిస్తున్నారా?"

పక్షిరాజా కొంత కంగారు తిన్నాడు.

గొంగ వెలిగించి "బెదరించటం కాదు లక్ష్మీ! నీ మేలు కోరే నిన్ను దగ్గరకు తీశాను. నిన్ను గొప్పదాన్ని చేయాలనీ, నీకు ఉజ్జ్వల మైన భవిష్యత్తు వున్నదనీ ఆశించాను—ఇలా సామాన్య స్త్రీవలె సంతా నాన్ని కని, అందాన్ని పాడుచేసుకొనేంత మందమతివి కావను కున్నాను."

"నేను స్త్రీనేగాని రాక్షసిని కానుగా" అన్నాను.

రెండు నిమిషాలు గొంగ కొలిమిలా పని చేసింది.

"నీవు రాక్షసివీ కాదు; సామాన్య స్త్రీవీకాదు. నీవు తలుచుకుంటే లోకం నీ కాళ్ళముందు కొస్తుంది. లక్ష్మీ! అంతటి మహాభాగ్యాన్ని

ఎందుకు జారవిడుచుకుంటావు? అమూల్యమైన నీ అందం, ఏ బజారు వాడికో బిడ్డల్ని కనేందుకుగాదు."

"ఆపండి. అది నాయిష్టం. నా మంచి చెడుగులు నాకు తెలుసు."

"అయితే నా మాట...."

"వినను. ఎప్పుడూ, ఎక్కడా, ఎవరిమాటా వినను. నాకు తోచిందేదో నేను చేస్తాను."

ఆనాటినుంచి ఎడముఖం పెడముఖంగానే వుంటున్నాము. ఆ ఎడాపెడలో అక్కడిక ఉండడమంత మంచిది కాదనుకున్నాను.

కాని నే తీసుకున్న నిర్ణయం తప్పు కాదుగదా? ఆలోచించాను. పునరాలోచించాను....పక్షిరాజాయొక్క స్వార్థం కొంతపాలు వుంటే వుండవచ్చు. కాని అది నా చేతిమీదుగా జరుగవలసిందేగా? నేను పెద్దదాన్నయితే కొద్ది మొత్తాన్ని అతను పంచుకుంటాడు. అంతేగాని పూర్తి ప్రయోజనం పక్షిరాజా దొక్కడిదే కాదుగా?....బిడ్డల్ని కనడమే పరమార్థమైతే, పుట్టిపెరిగిన గడ్డనే వుండి పదిమందిని కనవచ్చునే!

ఛీఛీ. నా కెన్నటికి తెలివి వస్తుందో తెలియకుండా వుంది. అనవసరంగా పక్షిరాజా మనసు నొప్పించాను. ఈ రోజు ఇంటికి రాగానే కాళ్లపైపడి క్షమాపణ చెప్పుకోవాలి. లేకుంటే నాకు బిడ్డలేమిటీ?....ఎవరికి పుట్టిన బిడ్డని కాకులచేత పొడపించుకోటానికేగా!

పక్షిరాజా మూడు రోజులవరకు ఇంటికి రాలేదు. తలలో వున్న బరువును ఎప్పుడు దించుకుందామా అని ఎదురు చూస్తున్నాను. నాలుగో రోజు నిండుగా తాగి తూలుకుంటూ వచ్చాడు. పడబోతున్న వానిని పట్టుకోగా, విసరికొట్టాడు.

"లేదు. మీ అభిప్రాయానికే వచ్చాను. నేను పొరబడ్డాను. నన్ను క్షమించరూ?" అంటూ కుర్చీలో కూర్చోబెట్టాను.

పక్షిరాజా పెద్దగానవ్వి నన్ను కౌగలించుకున్నాడు. ముద్దు పెట్టుకుంటున్నాడు. ఆ ఇనప కౌగిలినుంచి తప్పించుక బయట పడలేకపోయాను. బట్టలు చించి పారేసి, అతి రాక్షసంగా....

  

మరునాడు డాక్టరు పరీక్ష జరిగింది. గర్భ స్రావం మూలాన అసలు ప్రాణికే ముప్పు కలుగవచ్చుననీ, నవమాసాలు నిండితేనేగాని ఏమిచేయటానికీ వీలుకాదని చెప్పారు. దానిపై మా ఉభయుల అభిప్రాయాలనుకూడా మేము తెలుపలేదు.

ఒక వారం పడకబెట్టిన తరువాత లేచి మెల్లగా తిరుగుతున్నాను. అనుకోకుండా ఒకనాడు మా "అయిన అన్నయ్య" ఇంటి కొచ్చాడు.

కన్నెత్తి చూసేందుకే పాప మాయన సిగ్గుపడుతున్నాడు.

"డాక్టరుగారు ఇంటిలో లేరామ్మా?"

"లే రన్నయ్యా. బయటి కెళ్ళారు" అన్నాను.

మంచంమీద కూర్చుని ఏదో విచారిస్తున్నారు.

"అమ్మా! మీకు మేము చాలా ద్రోహం చేశాము. ఆ ద్రోహానికి భగవంతుడు మా కేశిక్ష విధిస్తాడో తెలియదు. ఒకే కడుపునపుట్టి నోరార "చెల్లీ" అని పిలుచుకునేందుకుగూడా నోచుకోలేకపోయాను.... డాక్టరుగారు చెప్పారమ్మా.... తెలిసింది. నువ్వొక ఇంటిదాని వవుతుంటే నేను కాదంటానామ్మా? పాపమో పుణ్యమో వెనుకింత వున్నదిగాబట్టి, తోబుట్టువు పెళ్ళికి ఒక్క పదివేలు యివ్వలేనా? డాక్టరుగారు అడిగిందే తడవుగా, మారు మాటాడకుండా యిచ్చాను."

"పదివే లిచ్చారా డాక్టరుగారికి?"

"నీకు తెలియదమ్మా, పెండ్లన్న తరువాత పదివేలన్నా లేనిదే పెండ్లనిపించుకోదు. రిటైర్ అయిపోయిన తరువాత డాక్టరుగారివద్ద ఏముంటాయో నాకు తెలియదామ్మా? దేవుడల్లే మనల్ని కాపాడుతున్నందుకు మన మెంతో కృతజ్ఞులమై మెలగాలి.... నిజంగా దేవుడేనమ్మా" కండ్లు మూసుకుని చేతులెత్తి నమస్కారం చేశాడు.

దేవునియొక్క స్వరూపమేమో నోటిదాకా వచ్చిందిగాని, కాదులెమ్మని వూరుకున్నాను.

"అమ్మా లక్ష్మీ! నీ పెళ్ళి కళ్ళారా చూసే భాగ్యం మాకు లేదమ్మా. నీ దౌర్భాగ్యపు అన్నను మన్నించి, పెళ్ళికి రాలేదని కష్టపెట్టుకోక ఈ కానుక తీసుకోమ్మా. ఈ పట్టుచీరె, రవికె నీ అన్నయ్య యిచ్చే

పెండ్లికానుక. పెండ్లికి రాలేనమ్మా లక్ష్మీ!....చిరాయువుగా సుఖించు తల్లీ! వస్తా" అంటూ గబగబా దిగిపోయారు.

"పట్టుచీరె, రవికె. పెండ్లి కానుక!" కండ్ల కద్దుకుని వల వల ఏడ్చాను.

అగ్గిలో గుగ్గిల మేసినట్లు ఆ వేడిలోనే దిగాడు పక్షిరాజాగారు.

"పదివేలు ఎక్కడ పెట్టారు?" గడపలో వుండగానే అడిగాను.

"పదివేలు? పదివేలేమిటి?"

"నావి నా పెండ్లి కిచ్చిన పదివేలు."

పెద్దగా నవ్వి ఇష్టప్రియనెత్తుతున్నాడు. అరిచాను. నవ్విన నోరు తెరిచినట్టే వుండిపోయింది.

"నా పదివేలు నా కివ్వండి. ఇక మీవద్ద వుండదలచలేదు. ఈ నాడే వెళ్ళిపోతాను."

మళ్ళీ నవ్వాడు. నాకోపం హద్దులు దాటిపోతున్నది. దగ్గరకు వెళ్ళి మనిషిని పట్టుకున్నాను.

"ఇస్తారా లేక పోలీసుల్ని పిలిపించమంటారా?"

నవ్వుతూనే నన్ను వాటేసుకున్నాడు. రక్కినా రాచినా వదల కుండా, తన యిష్టమొచ్చినట్లు నన్ను వంచుకున్నాడు. స్పృహ తప్పి పోయేవరకు నన్నా పాపాత్ముడు విడిచిపెట్ట లేదు.

చలిగాలి శరీరాన్ని సోకుతుంటే, మూల్గుతూనే ఈ వైపుకు మెసిలాను. దానితో కొంచెం స్ఫురణ వచ్చి కండ్లు తెరచి చూశాను. ఒళ్ళంతా పచ్చి పుండైపోయింది. శూలాలతో పొడిచినట్లు పొత్తికడుపు పోట్లు పెడుతున్నది. బాధను భరించలేక పొత్తికడుపు ఒత్తుకుంటు న్నాను. అప్పుడు తెలిసింది, ఒంటిమీద గుడ్డయినా లేదని. మెల్లగా కూర్చుని చీరె చుట్టుకుంటూ. ఈ రాక్షసు డెక్క డున్నాడా అని పార జూచాను. బురదగుంటలో దున్నపోతులా కాళ్ళు పైకెత్తి పడుకుని వున్నాడు.

మంచం దిగి మళ్ళీ ఒకసారి వాడి ముఖంలోకి చూశాను. వాపెదు ముక్కు వంకర తిరిగి వున్నది. తెగబలిసిన నల్లటి పేడబుర్రలవంటి

పెదాలు ముఖంమీద వాలినట్లున్నాయి. గిజిగాడి గూడువలె నొసటిని పట్టుకు వ్రేలాడుతున్నాయి కనుబొమలు. ఇక చూడలేక తలతిప్పుకున్నాను.

మబ్బు కమ్మినట్లు ఒక ఆలోచన కమ్మింది. డ్రాయరు సొరుగు చూశాను. లేదు. ఇల్లాంతా తిరిగాను కనుపించలేదు. కుర్చీ వెనక నిలబడి బీరువా పైభాగమంతా వెతికాను. తగల్లేదు. లోపలి గదిలో కెళ్ళి రెండు నిముషాలలో అడుగులో అడుగు వేసుకుంటూ వచ్చాను. అంతే. పక్షిరాజాను సమీపించి కడసారి చూపుచూసి చేతిలో మొనదేలివున్న మాంసపు కత్తిని ఒక్కసారిగా గురిచూసి అతగాడి గొంతులో పొడిచాను.

  

చీకటిలో చెట్ల క్రిందగా నడుస్తున్నాను. కటికిచీకటిగా వున్నా రోడ్డు ప్రక్క ఇండ్లలోంచి ప్రసరిస్తున్న దీపాల సన్నవెలుగు చెట్లకు తలంటి పోస్తున్నది. దొంగలకు హెచ్చరికగా లయబద్ధంగా లాఠీలచప్పుడు చేస్తున్నారు కాపలా వాళ్ళు. ఒంటరిగా అర్ధరాత్రిలో ఆ ధ్వని వింటుంటే, గుండెలు దిక్కు దిక్కుమంటున్నాయి. సందు గొందుల్లోకి పోవటం ప్రమాదమని విశాలమైన వీధి గుండానే నడుస్తున్నాను.

తెల్లవారితే ఈ వార్త ప్రపంచానికి తెలిసి పోతుంది, పోలీసు బలగం నాకోసం వేట ప్రారంభిస్తుంది. ఇంత బ్రతుకూ బ్రతికి పోలీసుల చేతిలో పడి చావడమా? ఇకచూపాలి మన తెలివి తేటలనిపించింది.

దూరాన్నుంచి ఎవరో వస్తున్నట్లు మసకమసకగా కనిపిస్తున్నది: నిలబడి చెవులు నిక్కించి విన్నాను. బూట్లచప్పుడు....ఒకసారి వెనక్కు చూశాను. అంత విశాలమైన వీధిలో కనుచూపు మేరకు మాఉభయుల మసకఛాయలు తప్ప మరొకటి కనిపించటంలేదు. బూట్ల చప్పుడు దగ్గర పడగానే, బితుకు బితుకు మంటున్నా ముందు నేనే పలకరించాను,

“టైమెంతయిందో చెప్పగలరా?”

నోరు విప్పకుండానే నిషాలో వున్నట్లు అతడు నడచిపోయాడు.

బిలబిలమంటూ ఒక సందులోంచి గుంపెడు జనంవచ్చి కలిశారు. ముతకా ముసలి, పిల్లలూ తల్లులు, ఆడా మగ చిన్న గ్రామానికి సరిపడ సరంజామాతో ఎక్కడికో పయన మయ్యారు. నిద్రనుంచి లేపు కొచ్చా రేమో, చంటిబిడ్డలు సంగీతం పాడుతున్నారు. ఒకాయన "అదివచ్చిందా- యిదివచ్చిందా, నగలు భద్రం – ముసలమ్మలు భద్రం" అని హడావిడి పడుతూ తిరుగుతూన్నాడు. ఒక యువకుడు ముందునడుస్తూ "అంతా నావెంట నడవండి" అంటున్నాడు. కొందరు ఆడంగులు ఎక్కడ తప్పి పోతామోనని చేతులు చేతులు కలుపుకు నడుస్తున్నారు. మోయలేని బరువులనెత్తుకుని ముసలమ్మలు "అబ్బా! ఈ మూట ఎవరేనా అందు కోండర్రా" అని అప్పుడే మూల్గుతున్నారు.

"ఆ పెట్టె నాకిచ్చేసేయమ్మమ్మా, నేతెస్తాను" అని ఒక ముసలమ్మ దగ్గర నుంచి పెట్టె అందుకున్నాను.

"నాతల్లే, కొద్దిసేపుండి మళ్లీ తీసుకుంటాలేమ్మా. ఈమూట తోనే రెక్క గుంజుకుపోతున్నది" అంటూ ట్రంకుపెట్టె నాభుజాని కెక్కించింది.

ఆ గుంపులో ఒక గొర్రెనై కలిసిపోయాను.

* * *

ఆడ పెండ్లివారు మగపెండ్లివారి తాలూకూ అని, మగపెండ్లివారు ఆడ పిల్లతరఫు దామోసుననీ అనుకుంటున్నారు. పయనులోనున్న ఆడా, మగా నన్ను పరిచయం చేసుకోవాలని చుట్టూ తిరుగుతూ తిప్పలు పడు తున్నారు. రైల్లోకూర్చున్న తరువాత ట్రంకు పెట్టిచ్చిన ముసలమ్మ నన్ను ప్రక్కన కూర్చోబెట్టుకుంటూ మెల్లగా అడిగింది: "ఏమ్మా! మీది వెంకటాయపాలెమేనా."

"అవునమ్మా, వెంకయ్య కూతుర్నేగదూ" అన్నాను.

వెంకయ్య ఎవరో తనకు బాగాతెలిసినట్టే తలవూపి "అలాగనా? నీ పేరు?" అన్నది.

"వెంకటసుబ్బమ్మ."

నిజంగా నా జులపాల తల వారి కంటబనడిట్లయితే వెంకటసుబ్బమ్మ అన్నా నమ్మేవారు కారు; వెంకటాయపాలెమన్నా నమ్మేవారుకారు.

తిరుపతి వెళ్ళేవరకు అతి జాగ్రత్తగా క్రాపుతలను కాపాడు కున్నాను. ఇంటినుంచి బయలుదేరినప్పుడు వేసుకున్న చీర చెంగు తిరుపతి దేవ స్థానం దాకా తలపైనే వున్నది. ఇద్దరు ఆడపిల్లలు నన్ను మరీ వదలిపెట్టకున్నారు. కనుపించిన ప్రతి చిరుతిండీ కొంటూ, తినమని బలవంతం చేస్తున్నారు. ముందుకు నడిపించే యువకుడు మాటి మాటికీ నా వైపు చూస్తూ నవ్వు ఒలక బోస్తున్నాడు.

ఎలాగైతేనేం మిట్టమధ్యాహ్నానికి తిరుపతి దేవస్థానం చేరాము. రాత్రికి లగ్నం. మగవాళ్ళ చిందులు తొక్కుతూ సత్రాలవెంట తిరుగు తున్నారు. ఆడంగులు సోకు చేసుకోవడంతోనే సతమతమైపోతున్నారు. నల్భైయేండ్ల బాలపెండ్లికొడుకు మీసాలు దువ్వుకుంటూ కాబోయే భార్యా రత్నం బూరతో ఆడుకుంటుంటే తనివిదీర చూసి సంతోషిస్తున్నాడు. ఆజంటను చూసి నాకూ ఆనందమై నవ్వుకున్నాను.

అందరూ అంత హడావిడిలో మునిగి వుంటే, ఒకాయన మాత్రం తనకేమీ పట్టనట్లు దూర దూరంగా వుంటున్నాడు. రైల్లోగూడా ఆయ నలాగే ఎవరితోనూ మాటాడక ఏదో వ్రాసుకుంటూనే కూర్చున్నాడు. ముందు కూరగాయల లెక్క లేమోననుకున్నా గాని, ప్రౌఢ సమాసం గిలుకుతుంటే కవిత్వ మేమోనని భావించాను. పలుకరించాలని బుద్ధిపుట్టి దగ్గరకువెళ్లి "ఏమిటండీ ఎప్పుడూ వ్రాస్తుంటారు?" అని అడిగాను.

తలపైకెత్తిచూశాడు. నోరు తెరవకుండానే నవ్వి "ఆ డాక్టరుగాడు వ్రాయమన్నాడు" అన్నాడు.

"దేనికి? దేనిగురించి?"

"దేన్ని గురించి అయినాసరే, వ్రాయడమో చదవడమో చేస్తుండ మన్నాడు. లేకపోతే మళ్లీ పిచ్చెక్కుతుందట. అందుకనే మనం వచ్చిన స్టేషను లెన్నో, స్టేషనులో నాటిన చెట్లెన్నో, తిరుపతిలో దిగినతర్వాత ఎన్ని మలుపులు తిరిగి ఇక్కడికి చేరామో, ఇక్కడీ సత్రంలో ఏమేమి సామానులున్నాయో అన్నీ వివరం వ్రాస్తున్నాను.... వెళ్లు. నీపేరు గూడా వ్రాస్తాలే. ఇంగ్లీషులో వ్రాస్తాలే" అని నవ్వి మళ్లీ వ్రాసుకుంటున్నాడు.

పాపం! వ్రాయకపోతే మళ్లీ పిచ్చెక్కిపోతుందట. ఆయనే చెపుతున్నాడు— ఇప్పుడు బహుమంచిగా వున్నట్లు! మనుషులకు ఎందుక

పిచ్చెక్కుతుందో నే నెప్పుడూ ఆలోచించలేదు. తెలుసుకుందామని, "ఏమండీ! మీకు ఎందుకు పిచ్చెక్కింది?" అని మెల్లగా అడిగాను.

"పని లేక. ఫో పిచ్చిముండా అతలకి" నవ్వుతూనే కసిరి, మానవమాత్రులకు అర్థంగాని ఏదో ప్రత్యేక లిపిలో వ్రాసుకుపోతున్నాడు.

పిచ్చిని గూర్చి యోచిస్తూ నే నీవలకు వచ్చేశాను. పిల్లల ఏడ్పూ, పెడ బొబ్బలతో సత్రమంతా కంగాళీగా వుంది. నే నేదైనా ఆలోచించేప్పుడు ప్రశాంతమైన ఏకాంతంలోకి పోవాలనిపిస్తుంది. ఒక్కదాన్నే సత్రంనుంచి బయటికొచ్చాను. బయటగూడా అంతగోలగానే వుంది. ఆ గోలనుంచి తప్పించుకోవాలని గబ గబా నడుస్తున్నాను.

"ఎక్కడికి వెంకటసుబ్బమ్మా! ఇక్కడ చాలా పనులున్నాయి. చూసేవన్నీ తరువాత చూసుకోవచ్చు. రా రా" అని ఎవరో వెనుకనుంచి కేకేస్తున్నారు. నేను తిరిగి చూడకుండానే ముందుకునడుస్తున్నాను.

దేవాలయం సమీపించింది. లోనికి వెళ్ళి దేవదర్శనం చేసుకుందామని మనుషులను తప్పుకుంటూ ఆలయంలో ప్రవేశించాను. ఆ వాతావరణం నామనస్సును మత్తెక్కించింది, దేవదర్శనం కొరకు తహతహ లాడిపోతూ గర్భగుడిలో జొరబడబోయాను. పురోహితుడు చేయి అడ్డంగా పెట్టి ఆపివేశాడు. లోనికి పోనిమ్మన్నాను. డబ్బు తెమ్మన్నాడు.

డబ్బుకు దాసుడైన దేవుణ్ని తిట్టుకుంటూ, మనుషులను తొక్కుకుంటూ బయటపడ్డాను. ఎవరో ముసలమ్మ వెండిచెప్పు తలను తాకించింది. ఏమిటన్నాను. పున్నెం గట్టు కోమంది. సరేనని మనఃపూర్వకంగా నమస్కారంచేశాను. దన్నం పెట్టడంకాదు-డబ్బిచ్చి పున్నెం చేసుకోమంది. ఒళ్ళుమండిపోయి "డబ్బిస్తే పున్నెం దొరుకుతుందా? మీరంతా యిక్కడ పోగై పున్నాన్ని అమ్ముతున్నారల్లే వుంది" అన్నాను.

"నీవిక్కడికి ఎందుకొచ్చావు పిల్లా? పాపాలుచేశావు గనుకనే! ధర్మంచేసి పున్నెం గట్టుకో."

ఈమాటలు సూటిగా నాహృదయంలోకి జొరబడ్డాయి. నేను చేసిన పాపం నాకళ్ళముందు ఆడింది....అయితే ఇక్కడికి వచ్చేవాళ్ళంతా

నావంటి హంతకులూ, పాపాత్ములేనన్నమాట? దేవునికి లంచమిచ్చి పాప పరిహారార్థం ప్రార్థనలు సల్పుతున్నారన్నమాట? ఈ సాష్టాంగాలూ, వడిగాపులూ, నిలువుదోపులూ అన్నీ అందులో భాగమేనన్నమాట! నిత్యకళ్యాణం, పచ్చతోరణంలా దేవస్థానం ప్రవర్ధిల్లు తున్నదంటే దైవభక్తి మిక్కుటమైకాదు; పాపం పెరిగిపోతుండటం వల్లనే?

నేనక్కడ నిలబడలేకపోయాను. చెంగున బయలుదేరగానే ముసలమ్మకు కోపమొచ్చి, ఆ వెండి చెప్పుతోనే కొట్టింది. వెంకటేశుని వెండి పాదాల పవిత్రత తలబొప్పితో అర్థమైంది.

చెట్టుపుట్టల్లో తిరిగి, సెలయేళ్ళలోనీరుత్రాగి, చెంగు తలపైవేసుకుని మళ్ళీ సత్రానికి చేరాను. హడావిడిలో వున్నవారు హడావిడిలోవుంటే, కొందరు యువతీ యువకులు ముందపడి పత్రిక చదువుతున్నారు. ముందుండి నడిపించిన యువకుడు పెద్దగా గడ గడా వార్తలు చదివేస్తున్నాడు.

"ప్రఖ్యాత సినీ ఫోటోగ్రాఫరుహత్య - హంతకురాలు డబ్బు చేజిక్కించుకుని పలాయనం".

పదిహేను సంవత్సరాల క్రితం ఇంగ్లాండునుంచి మద్రాసుకు వలసవచ్చిన ప్రఖ్యాత ఛాయాచిత్రకారుడు విలియం రాబర్ట్ నిన్నరాత్రి తన యింటిలో హత్యగావించబడ్డాడు. తన మొదటిభార్య విడాకులిచ్చి ఒక రాజాగారితో వెళ్ళిపోగా, అందమైన ఒక అమ్మాయిని ద్వితీయ భార్యగా స్వీకరించాడు. ఆ అమ్మాయిపేరు సుబ్బులక్ష్మి. ఆమె ఏప్రాంతానికి చెందినదీ ఎవరికీ తెలియదు. అనుకోకుండా ఒకనాడు తటస్థించిన మీదట ప్రేమించి ఇంటికి తెచ్చుకున్నాడు. వారిగదిలో ఆమె ఫోటోలు నాలుగు ప్రత్యేకంగా అలంకరించబడి వున్నాయి. దానితో ఆమెనెంత ఎక్కువగా వారు ప్రేమిస్తున్నదీ తెలియగలదు. కాని ఆ వంచకురాలు మరెవడినో మరిగి, నిన్నరాత్రి మాంసపు కత్తితో కళాకారుని ప్రాణాలు తీసింది. పెట్టెలు పగులగొట్టి, వున్న యావత్తు ధనాన్ని పట్టుకుపోయిందని తెలియవస్తున్నది. అసలు ఫోటో లేకపోయినా, వేషంలో తీయబడ్డ

ఈ నాలుగు ఫోటోలను యిక్కడ ప్రకటిస్తున్నాము. పోలీసు శాఖ ఇందుకై సత్వర చర్యలు తీసుకుంటున్నది."

  

దేవస్థానంలోని కోనేటివద్ద మంగలివారిపని జోరుగా సాగి పోతున్నది. నాలుగణాలిస్తే తలవెంట్రుకలు తీసి వెంకటేశ్వరస్వామికి సమర్పిస్తారు. అందులోనూ వారిలో వారికి పోటీలు. వారినడుమకు పోయామా నలుగురూ పట్టుకుని నిల్చున్నచోటనే పట్టుకు కత్తెర వేస్తారు. ముందు ఎవరికత్తెర పడితే వారిదే ఆ తల.

నేను వూరికే చూస్తూ ప్రక్కకు పోతుండగా ఒక కుర్రాడువచ్చి చేయిపట్టుకున్నాడు. నేనూ అదే ప్రయత్నంలో వున్నాను గనుక చప్పున అతని పీటముందు కూర్చున్నాను. అప్పుడే అరడజను కత్తెరలు వేయనే వేశాడు. జుట్టువచ్చి చీరపై పడుతుంటే. కానున్న నా అందాన్ని గూర్చి ఆలోచిస్తున్నాను. అంతా అయిదు నిమిషాలుగూడా పట్టలేదు. అయి పోయింది లెమ్మన్నాడు. నన్నొదిలిపెట్టి వెంటనే మరో బేరంకోసం పరికిస్తున్నాడు. చేయెత్తి తల తడిమిచూసుకున్నాను. గరగరలాడుతూ గుచ్చుకుంటున్నది. ఒకచోట ఎక్కువ ఒకచోట తక్కువ మిట్టపల్లా లున్నట్లు అనిపిస్తే. "అబ్బాయి! కొంచెం అద్దమిస్తావా?" అని అడిగాను.

"ఇక్కడ అద్దాలు గిద్దాలు వుండవు, డబ్బు" అంటూ నావంక చూడకుండానే చేయి జాపాడు.

"ఎలాచేశావో చూసుకోండే డబ్బెలా యిస్తాను?" కొంచెం కోపం నటించాను.

ఈసారిమాత్రం తిరిగి నావంక చూశాడు.

"ఇక్కడ అద్దాలుండవండి. డబ్బు. డబ్బు పడేయండి"

"సరే. మేము దిగిన సత్రంలోకి వెళ్ళి, అద్దంచూసుకుని డబ్బు తెచ్చిస్తానుండు."

చేయిపట్టుకున్నాడు.

"ముందు డబ్బిచ్చి కదలండి."

"ముష్టి మూడణాలకోసం దేవస్థానంలో మోసం చేస్తామటయ్యా" నిజాయితీ ఉట్టిపడేలా మాటాడాను.

దానికీ ఆ కుఱ్రవాడు చలించాడు కాడు.

"అబ్బో! చాలా తిన్నా మిలాంటివి" అని ఆ కుఱ్రవాడనగానే "ఏమిటయ్యా నువ్వు తిన్నది? గూబలెక్కతీసేవాళ్ళులేక! వేలెడెంతలేవు, మాటలు మట్టుకు మోపుగాఉండయ్యే. డబ్బు కర్చుపెట్టటానికి కాదూ మేమొచ్చింది? ఆడదాన్ని పట్టుకు నిలేస్తావా?" అంటూ అప్పుడే బోడిగుండు చేయించుకున్న ఓ పల్లెటూరి ఆసామి జుట్టు దులుపుకుంటూ లేచాడు.

"అంత పట్టింపుఅయితే నువ్విియ్యరాదూ? ముష్టిమూణ్ణాలేగా?" అన్నాడు కుఱ్రాడు కొంచెం కరుకుగానే.

"నీకియ్యటానికేనోయ్ కుఱ్రకుంకా- మే మింతదూరం వచ్చిందీ" అంటూ రాగంతో బొడ్లోంచి తీసి, మూడణాలు ఆ కుఱ్రవాడి చేతిలో పెట్టాడు.

"తిరుపతి దేవస్థానంలో నాయం తగలడిం దనుకుంటాంగాని ఇక్కడా యింతేనమ్మా.... ఏబ్బే! మడిసిని మడిసి నమ్మకపోతే.... పోదాంపద. కోనేట్లో మునిగొద్దాం" అనగానే ఆ ఆసామి వెంట నేనూ కోనేటివైపుకు నడిచాను.

♦ ♦ ♦

అప్పటికే మసకచీకటి పడుతున్నది. దేవస్థానంలోని విలువైన దీపాలు, చీకటిని దరిజేర నివ్వకుండా పారదోలుతున్నాయి. కోనేటిలో మునిగి స్నానంచేసి ఒడ్డుకొచ్చేప్పటికి నా తెలివి అంతా బయట పడింది.

కట్టుచీరెతో బయటికొచ్చిన నేను, దాన్ని ఒంటిమీద వుంచుకునే కోనేటిలో మునిగాను. ఒడ్డుకెక్కిన తరువాతగాని, మరొకబట్ట లేదన్న సంగతి తలకెక్కిందికాదు. నన్ను నేనే కొద్దిసేపు తిట్టుకుని, ఆ ఆసామికి గూడా రెండుపెట్టాను. ఎందుకంటే నన్ను కోనేటిలో ముంచింది ఆయనే గదా! ఆయన రమ్మనకపోతే నే నసలు స్నానంచేసే దాన్నేకాను. రెండు మునకలు వేసి చెప్పకుండానే దాటిపోయాడా పెద్దమనిషి.

ఎంతసేపని తడిబట్టలతో వుండేట్టు? ఒకవేళ సత్రానికి వెడితే ఎవరేనా ఒకచీరె పారేస్తారేమో? ఎందుకొచ్చినపీడ. ఇంకా ఈవిషయమే వాళ్ళచర్చల్లో వుంటే అనుమానించినా అనుమానించబోతారు. కాని తెచ్చుకున్నట్లు అక్కడికి పోవడం దేనికిగాని జనసామాన్యం తిరుగని చోటుచూచి, బట్టలారబెట్టుకోడం మంచిదని ఒకవైపున పడి నడక సాగించాను.

తడిబట్టల్లోనున్న అందాన్ని తనివిదీరాచూస్తున్నారు జనం. తలపైనున్న కొంగుతీసి, అందమిక చూడండని అప్పుడే చేయించిన బోడితలను ప్రదర్శిస్తూ పోతున్నాను. ఒకమైలు నడిచాక జనసమూహం తిరుగని రాతి ప్రదేశం కనుపించింది.

బట్టలు విప్పి ఒక కంపగుట్టపై ఆరేశాను. రాతిపలకపై పడుకుంటే చక్కలిగింతలుపెట్టినట్లు చలివేస్తున్నది. నిండా మునిగినవానికి చలిలేదన్నట్లు, కాళ్ళూచేతులూ పారజాపి పడుకుంటే చలి ఎగిరిపోయింది. వెల్లికిలాపడుకుని ఆకాశంలోకి చూస్తున్నాను. సన్ననిరేఖలాంటి చంద్రుడు తప్పటడుగులు వేసే పసిపాపవలె పడుతూ లేస్తూ పోతున్నాడు.

నీలాకాశం ఆలోచనలను రేకెత్తిస్తుంది. దూదిపింజెల్లాంటి మచ్చు తునకలు ఎంత సుతిమెత్తనగా వుంటాయో, వాటిని చూస్తున్నవారి మనసుగూడా అంతతేలిక పడుతుంది. ఊహించుకోగలిగినవారికి ఊహించుకున్నన్ని వింతలూ, విశేషాలూ గోచరిస్తాయి.... మనం ఏనుగు అనుకుంటే- ఆ మబ్బు ఏనుగైపోతుంది. అదిగో ఎవరో అక్కడ కోటగట్టుకున్నాడంటే- నిజంగా కోట గోడలే అక్కడ ప్రత్యక్షమవుతాయి. నెర్రెలిచ్చిన నల్లరేగడిభూమి అనుకుంటే- అచ్చమిలాగే వర్షంకోసమై నోరుతెరిచి ఉన్నట్లే అనిపిస్తుంది.

ఆ సౌందర్యాన్ని చూస్తూ ఊహించుకుంటుండగానే, మనసు గత చరిత్ర వైపుకు మరలింది.

"నేను ఎక్కడిదాన్ని? ఎక్కడున్నాను? ఏమైపోతాను?"

ఆరవేసిన చీరె గాలికి రెపరెపకొట్టుకుంటున్నది.

"ఈ లోకాన్నే పాదాలముందుకు తెచ్చుకుంటాననుకున్న నేను, మార్చుకునేందుకు చీరెలేక- బోడితలతో, దొంగలా ఒంటరిగా- ఈ రాతి పలకపై ఎందుకు పడివున్నాను? నాకీ గతి ఎందుకు పట్టింది?"

ఎంతసేపు ఏడ్చానో ఆకలేస్తే మెలకువవచ్చింది. చీరె చుట్టుకుని తిరిగి పడుకున్నాను. కాని ఆకలి పడుకోనివ్వదు. ఏమైనాగానీ ఊళ్లోకి బయలుదేరుదామని లేచాను.

"ఎవరక్కడ?" నా దగ్గుతోపాటే ఎవరో ప్రశ్నించారు. సమాధానం చెపుదామా వద్దా అనుకుని "నేనే" అన్నాను. ఆ ధ్వనినిబట్టి ఆ వ్యక్తి నాదగ్గరకు వచ్చాడు.

"ఎవరు నువ్వు?"

"నే నొక నిర్భాగ్యురాలిని. ఆకలి దహించుకుపోతున్నది. తినేందు కేదైనా కాస్తంతపెడతారా?"

"రా నా వెంట" అని దగ్గరలోనేవున్న కొండగుహలోని తన యింటికి తీసుకుపోయాడు.

దీపం వెలుగులో ఆయనముఖం చూశాను. పెద్ద గడ్డం, మీసాలు, మెడలో రుద్రాక్షలపేరు, విభూతీ గంధములతోనున్న సాధుపుంగవు డాయన.

"నేను పక్వాహారం తినను. పండ్లు ఫలాహారాలు మాత్రమే భుజిస్తాను."

"ఏదైనాసరే స్వామీ! కడుపుమండిపోతున్నది."

రెండు కొబ్బరిచిప్పలు, అరడజను అరటిపండ్లు వగైరా వగైరాలతో ఆత్మారాముడు కాస్త శాంతించాడు. దీపముందు కూర్చునివున్న నన్ను తదేకతతో చూస్తూ "ముందు రవికె తొడుక్కో" అన్నాడు. నేను సిగ్గుపడి చూసుకున్నాను. చీరె అయితే చుట్టుకున్నానేకాని, రవికె భుజంమీదే వుంది. గబగబా బయటికివెళ్ళి, ఆ పని ముగించుకువచ్చాను.

స్వామి చిరునవ్వుతో జింక చర్మంపైని ఆసీనులై ఏదో తలపోస్తున్నారు.

"వచ్చావా భిక్షుకీ?" కొత్తగా పిలిచారు.

"అవును స్వామీ"

నిర్మలమైన వారి వదనంలో ఏదో వింతకాంతి వెలిగిపోతున్నది,

"భిక్షుకీ! నీ ఆకలి నేను తీర్చాను. మరి నా ఆకలి తీర్చవా?" నా వైపు చూడకుండానే ప్రశ్నించారు. నాకా ప్రశ్నలోని అంతరార్థం బోధపడక "స్వామీ! నా వద్ద ఏమున్నది గనుక? ఏమీ లేకనే గదా మీ వద్దకు భిక్షకొచ్చాను?" అన్నాను.

"కాదు భిక్షుకీ! నాకు కావలసినదేమో నీవు కలిగివున్నావు."

నాకిప్పుడు అర్థమైంది. వారు మాటాడుకుపోతున్నారు.

"భిక్షుకీ! నీ ఆకలి ఒకటి రెండు రోజులది మాత్రమే. ఆ రెండు రోజులకే ఎంత అలమటించి పోయావో నీకు తెలుసు.... నాది కొన్ని సంవత్సరాల ఆకలి. కటిక ఆకలితో కుమిలిపోతున్నాను భిక్షుకీ! నిరాకరించక భిక్ష పెట్టవూ?"



కొందరు సహృదయులు మన దుస్థితికి జాలి చెందవచ్చు; కడివెడు కన్నీరు కార్చవచ్చు. కాని వారినుంచి తృణమో పణమో ఏ రూపంలోనైనా మనం స్వీకరించామా, చెప్పకుండానే మన మనసు వారికి దాసీయై కూర్చుంటుంది. ఇందులో ఎవరి ప్రమేయంగానీ, ప్రోద్బలంగానీ, లేకపోవచ్చు. కావాలని ఉభయులూ కోరకపోవచ్చు. కాని "జాలి దయ- ధర్మం" అనే ఉచిత నీచపదార్థాలు మన మనసుకు సంకెళ్లువేసి, వారి పాదాలముందు పడేస్తాయి. తెలియకుండానే వారికి దాసిసైపోతాము. వారు చెప్పినదేదీ కాదనలేము. వ్యక్తిత్వాన్ని కోల్పోతున్న సంగతే మనకు స్ఫురించదు. ఒకవేళ ఎవరైనా హెచ్చరించినా కాదని వాదులాడుతాము. అందాకా ఈడ్చుకెళ్ళి అబానిసత్వంలో మనల్ని ముంచెత్తుతుంది. ఎవరివద్దగానీ ఒక్కకానీ ఉచితంగా తిన్నామా, మన చేతుల్లోంచి మనం దాటిపోయామన్నమాటే.

ఆకలిగొన్న సమయాన ఆయనా అరటిపండ్లు తినిపించకపోతే, నేనా దౌర్భాగ్యపుస్థితికి లొంగేదాన్నికాను. ఆయన సాధుపుంగవుడె

కావచ్చు; సాక్షాత్తు సాంబమూర్తే కావచ్చు. కడుపుతో వుండిగూడా ఆయన యిష్టప్రకారం పడుకున్నానంటే జాలిదలచి ప్రాణం నిలబెట్టాడనే. దోసిలిపట్టి "భిక్షాం దేహి" అని అభ్యర్థించాడని మాత్రం కాదు.

ఎంత పాపమైనా కష్టకాలంలో వున్నాము. బయటికిపోయేతెరువు లేదు. యౌవనంతో మిసమిసలాడుతున్న ఏ అందమైన యువతి బోడి తలను కోరుకుంటుంది?.... నాకు తప్పదు పోలీసువారినుండి తప్పించుకోవాలంటే సహజమైన నా అందానికి విరుగుడు పెట్టాలి. ఆ విరుగుడు ఫలమే బోడితల.... కాని అంత తొందరపడి వుండకపోతే బావుండేదని గూడా అనిపించింది. ఎందువలంటే జన సంచారంలేని చోట తల దాచుకునే తావు చిక్కింది. కొన్నాళ్ళిలాగో ఇక్కడే కాలం వెళ్ళదీస్తే, ఇక అనుమానించేవా రుండరు. పురుడుపోసుకుని చంటివాడితో సహా వెళ్ళిపోవచ్చు.

ఉదయమే లేచి గుడికివెళ్ళేవారు స్వాములు. తను వచ్చేంతవరకు ఎంత అవసరమున్నా బయటికి రావద్దని నా కాజ్ఞ పెట్టారు. నాకూ మంచిదే లెమ్మని ఊఁ కొట్టాను. ఎన్నిరోజులకు సరిపడే గ్రాసం దొరికితే అన్నిరోజులు ఇంట్లోంచి కాలు బయటపడేది కాదు. అవి నిండగానే తిరిగి కమండలం చేతికొచ్చేది. ఒకనాడు పెద్దమూటతో ఇంటికొచ్చి "భిక్షుకీ! మాట" అని పిలిచారు.

మూటదించి ఏమి టన్నాను.

"నే చెప్పినట్లు చేస్తావా? నీ కోర్కెలు ఈడేరుతాయి మరి" అన్నారు.

"ఏదైనా మంత్రమాల నేర్పుతారా?" నవ్వుతూ అడిగాను.

"వెధవమంత్రాలు. మంత్రాలకు చింతకాయలు రాలే కాలం పోయింది. భిక్షుకీ! మంత్రాలెందుకుగాని ఒక విలువైన తంత్రం కనిపెట్టాను."

"ఏమిటది?"

"ఏమీలేదు. కాషాయవస్త్రాలు ధరించి, పద్మాసనం వేసుకుని ఇక్కడ కూర్చో. మహాభక్తురాలు, తేజస్సంపన్నురాలైన ఒక దేవత

యిక్కడ దిగిందని, నేను ప్రచారంచేసివస్తాను. బండ్లకొద్ది కోర్కెలూ, కానుకలతో జనం దిగుతారు. అయినా నీవు కన్నెత్తి చూడకు. నేను ప్రక్కనే నిలబడి కానుకలు పుచ్చుకుంటూ వ్రేలెడంతవిభూతి విదిలిస్తుంటాను. సరేనా?"

  

నా బ్రతుకే ఒక ప్రదర్శనమైపోయింది. ఊహ తెలియని చిన్నతనంలో సహజమైన మనిషిలా జీవించానేమోగాని, జీవితంలో కాలుపెట్టాకమాత్రం సహజత్వం చచ్చింది. అన్నీ నాటకాలే. అందులోనూ రంగాలు, అంకాలు; అవాస్తవిక సంఘటనలు. అయినా నాశక్తి కొలది అభినయిస్తూనే ఉన్నాను.

వచ్చే జనం పోయేజనం. విసుగు విరామంలేకుండా మాయింటి చుట్టూ ప్రదక్షిణాలు చేస్తున్నారు. నేనుమాత్రం కళ్ళుమూసుకుని, చీమ కుట్టినా కదలకుండా ధ్యానముద్రలో కూర్చునేదాన్ని. కండ్లు తెరచి కొంచెం మెసలుదామన్నా జనం పాదాలు తాకుతూనే వుండేవారు. కాలు మడుచుకునేందుకు సైతం వీలులేక భగవంతుడా అని బిగపట్టుకు కూర్చునేదాన్ని.

నా మహాత్మ్యం ఎగువ దిగువ తిరుపతులకు వ్యాపించిపోయింది. నెల మొత్తంమీద ఒక దినం మాత్రం కండ్లు తెరచి భక్తబృందంతో మాటాడేదాన్ని. వారి కోర్కెల కేదైనా కషాయమిచ్చి గుణమిస్తుంది పొమ్మనేదాన్ని. ప్రసాదాన్ని కండ్లకద్దుకుని కానుకలు కురిపించేవారు. నా మహత్తు అంతటితో ఆగలేదు. కట్టుకథలెన్నో అల్లుకున్నాయి. రాత్రి స్వప్నంలో దర్శనమిచ్చిందని ఒకడంటే, నా కడుపున పుడతానన్నదని ఒక తల్లి అంటుంది. అదోరకమైన తృప్తి. పాపం పిచ్చి జనం !

పండ్లు ఫలాహారాలే భోంచేయడంమూలాన శరీరానికి కొంత మెఱుగు పట్టిన మాట నిజం. రాత్రిపూట మా స్వామి అదే అంటుండేవారు.

పడుకునేందుకు మంచి పరుపు కొన్నారు. కాని అది ప్రజలకంట బడకుండా పాతగోనెకప్పి వుంచేవారు, గంజాయికొట్టడం మానేసి మంచి విలువైన సిగరెట్లు ఇంట్లో కూర్చొని కాల్చిరావడం ప్రారంభించారు. చివరకు సువాసననూనెల్లోకి సైతం దిగిపోయినారు స్వాములవారు.

కాలం ఎప్పుడూ ఒకలాగవుంటే మనమీ కథ చెప్పుకోవలసిన అవసరమే లేదు. అకస్మాత్తుగా ఒకనాడు మా స్వాములవారి గురువుగారు దిగాడు. ఆయనదీ నావలెనే బోడితల, బోడివేషం. చేతిలో కమండలం గాక కాషాయరంగు జండాకఱ్ఱ హంగుదారుగా వుంటుంది. గంభీరమైన వదనం. అంతకన్న గంభీరమైన కాయంగలిగి పండు గుమ్మడి పండులా వున్నారు అంటే స్వాములవారి వృత్తి స్వీకరించి చాలకాలమైనట్లు నునుపుదేలిన శరీరమే నిండు సాక్ష్యం.

ముగ్గురం దీపం ముందు కూర్చుని మాటాడుతున్నాము.

"శిష్యా! నీకు భృతికల్పించింది నేను. నా ఆదరణవల్ల నీవింతవాడవైనావు. అవునంటావా?"

"కాదంటానా స్వామీ?" అన్నారు మా స్వాములవారు.

"నీ యావత్తు కథ నేను విన్నాను. ఈ పిల్లనుపెట్టుకుని పురుష ధర్మములు నాలుగూ నెరవేర్చుతున్నావట. అవునా?"

"చిత్తం."

"సంతోషం.... ఒకనాడు నీవన్నావు గుర్తున్నదా?"

"ఎరుక పరచండి స్వామీ!"

"అయిన గుర్తులేదన్నమాట? ఔరా!" అన్నారు గురువుగారు.

"గుర్తుకు తెండి స్వామీ! తప్పేవాణ్ని కాదుగా!"

"అయిన చెపెద.... శిష్యా! నా శిష్యులందరికన్న నిన్ను మిక్కుటముగ ప్రేమించేవాణ్ని. అవునంటావా?"

"కాదనేవాణ్ని కాదుగా."

"అనును ఎంతగానో ప్రేమిచేవాణ్ని. అందుకే అతి దీనావస్థలో నున్నావని గురుదక్షిణ తీసుకోలేదు, అవునా?"

"ఇప్పుడు తీసుకోండిస్వామీ! ఏదో సంపాదించేనుగా," అన్నారు మాస్వాములవారు.

ఒక్క చిరునవ్వు విసిరారు పై స్వాములవారు.

"ఏమేమి సంపాదించావేం? ....గురుదక్షిణ ఘనంగా యిస్తావన్న మాట!"

"కోరుకోండి స్వామీ! నాకున్న దేదో మీకు తెలియకపోలేదు."

"అయిన కోరెద.... శిష్యా! ఈపిల్లను నాకివ్వు."

మాస్వంత స్వాములవారి గుండె పగిలి వ్రయ్యలయింది. నురుగు కక్కినట్లు "గురువుగారూ?" అని కక్కారు.

"మాటతప్పరాదు. గురుదక్షిణంటే మహాగురుతరమైనది. అవునా?"

"ఏమిటి అవునా? "అంటూ మండిపోయి విరిచారు మాస్వాములు. గురువుగారికి కొంచెం గుర్రెక్కింది. కొంచెమేమిటి బాగానే ఎక్కింది.

"గురుదక్షిణ తిరస్కరిస్తే ఏమవుతావో తెలుసా? పుట్టగతులు లేకుండా భస్మం చేస్తాను. అవునా?"

"గురువుగారూ! నా ప్రాణంకోరుకోండి; యిస్తాను. అంతేగానీ ఈ పిల్లను యివ్వలేను. కోరుట గురువులకు సబబుకాదు."

"పిచ్చివాడా! ఎందుకలా ప్రేలుతావు? నీప్రాణాన్ని కోరుకుంటే అటుపైని ఆపిల్ల నాకు దక్కదా? సరే. నీకంతకష్టమైతే నేనే కోర్కెను సడలించుకుంటాగాని, నీవు మాత్రం ఇవ్వననరాదు—అవునా? లెంప లేసుకో."

నిజంగానే మాస్వాములు లెంపలేసుకున్నారు.

"అవునా? ఇక చెపుతున్నాను విను.... ఈ పిల్ల మనయిద్దరికీ చెందేట్లుచూడు. సగంకోర్కెను సడలించాను, సంతోషమేనా?"

ఏడుస్తూనే సంతోషమన్నాడు మాస్వాములు.

నేనూ సంతోషించి, చిరునవ్వుతో చిటికినవ్రేలు చూపి, బయట పడి, పరుగెత్తి పారిపోయి వచ్చాను.

♦ ♦ ♦

నురగలు గ్రక్కుతూ రైలు పరుగెత్తుతున్నా, వాళ్ళింకా నన్ను వెంబడిస్తున్నా రేమోనన్న భయం తగ్గలేదు. ఆడవాళ్ళ పెట్టెలో ఒక మూలకు చేరి కూర్చున్నాను. పెట్టెలో జనమంతగా లేరు. ఉన్న కొద్ది మందీ కునుకుతూ పడుకున్నారు. కళ్ళు మూసేందుకే నాకు భయం వేస్తున్నది. కిటికీ గుండా బయటికి చూస్తున్నాను. అంతా చీకటి. చీకటిలో పరిగెత్తుతున్న రైలు ఏ అఘాతంలో పడదోస్తుందో నన్న వింతభయం నన్నావహించింది.

ఆలోచించవలసిన సమస్యలు అనేకముంటే, నా పాడుబుద్ధి తేలిక సమస్యల పైకి ఒంటికాలిమీద దూకుతుంది. రైలు పడిపోతే ఎలా వుంటుందోనని ఆ సంఘటన నూహిస్తున్నాను. కాళ్ళు విరిగినవాళ్లూ, తలలు పోయినవాళ్ళూ, పడుకున్న పాటునే చనిపోయిన పసిపాపలూ నా కండ్లకు కట్టారు. నా మెడమీద కిటికీ చెక్క పడి నేను నలిగిపోతున్నానట. ప్రాణం పోలేదుగాని లేవలేక సహాయంకొరకై ఎదురు చూస్తున్నాను.

నా చేతిని స్పర్శించా రెవరో.

'సహాయం, సహాయం' అని మూలిగాను.

'టిక్కెట్టు, టిక్కెట్టు' అన్న శబ్దం నా చెవులపడి ఇహలోకం లోనికి వచ్చాను. ఎదురుగా ఆజానుబాహుడైన పురుషుడు ప్రేలు ఊపు కుంటూ నిలబడి వున్నాడు. నిలువు గుడ్లేసి నేను చూస్తున్నాను.

"ఏం? టిక్కెట్టు లేదా మహరాణీ!"

మహరాణిని చేసినందుకు లోలోన నవ్వుకున్నాను.

"ఏం మాట్లాడవేం? టిక్కెట్టుందా లేదా?" తీయని కంఠమైనా కర్కశంగా పలికింది.

అయినా నేను భయపడలేదు, అనునయంగా నవ్వుతూ "ఇదిగో బోడిగుండు చూడరాదూ! నేను పిచ్చిదాన్ని" అన్నాను.

మారుమాటాడకుండా అతగాడు నాచేయి పట్టుకున్నాడు.

"ఏం? నన్ను ప్రేమించావా?"

చెంప ఛెళ్ళుమన్నది. తిరుపతిలో త్రాగిన సెలయేటి నీరు ఉరుకుతూ జారిపోయింది. వెక్కి వెక్కి ఏడుస్తూ 'నేను పిచ్చిదాన్నయి పోయాను. నన్ను చేయిజేసుకోవద్దు' అని అతని చేతులు పట్టుకున్నాను.

ఆ చేతులతోనే గుంజీ, ప్రక్కస్టేషనులో నన్ను బలవంతంగా బయటకి నెట్టాడు. ప్రాణంలేనిదైనా రైలుబండి సానుభూతి చెపుతున్నట్లు చీదుకుంటూ, మొత్తుకుంటూ చీకటిలో కలసిపోయింది.

ఆ చిన్న స్టేషనులో నేనొక్కదాన్నే మిగిలాను. పెట్టెలాంటి ఒక గదిలో మినుకుమినుకు మంటున్న ఒక దీపంతప్ప ఇతరత్రా వెలుగంటూ లేదు. ఊళ్ళోకి వెళ్ళాలంటే ఎటువెళ్ళాలో తెలియదు. గాఢాంధకారం ఊరిని తన గుప్పిటలో పెట్టుకుని ఏలుతున్నది.

కన్ను పొడుచుకుంటూ వెలుగున్న గదివైపుకు నడిచాను. ఒక ముసలాయన దీపంముందు కూర్చుని పెన్సిలుతో ఏదో రాసుకుంటున్నాడు. మాటి మాటికీ కండ్లద్దాల తీగెలు సవరించుకుంటూ చికిలించి చూస్తు న్నాడు. అద్దాలు పెట్టుకున్నా మసక వెలుగులో పని చేయడంలేదు కామోసు.

వెనుకనుంచి 'ఎవరమ్మా నువ్వు?' అంటూ ఖాకీగుడ్డల వ్యక్తి చేలాంతరు పట్టుకుని వచ్చాడు. నా నుండి సమాధానం లేకపోయే సరికి అతను లోనికి వెళ్ళాడు.

'ఎవరితోరా మాట్లాడుతున్నావు?' కండ్లద్దాల ముసలాయన కంఠం పలికింది.

'ఎవరో ఒకామె బయట నిలబడి ఉంటే ........'

వారి పని వారు చేసుకు పోతున్నారు.

నేనలా కొద్దిసేపు నిలబడి 'బాబూ! ఈ ఊరి పేరేమిటో చెపు తారా?' అన్నాను.

ఒకరినొకరు చూసుకుని 'ఎవర్రా ఆ అమ్మాయి? లోనికిరమ్మను' అన్నారు ముసలాయన.

వారిద్దరు లోపల ఉండగానే నేను లోనికి వెళ్ళాను. ముసలాయన మళ్ళీ కళ్ళద్దాలు సర్దుకుని 'ఎవరమ్మా నీవు? కూర్చో అటు' అన్నారు.

నేను మాటాడ లేకపోతున్నాను. ఎవరైనా ఒక్క సానుభూతి వాక్యం పలికితే ఏడ్పు పొరలివచ్చేట్టుంది. పెదాలతో బిగ బట్టుకుంటూ బలవంతాన కూర్చున్నాను. ఇద్దరూ నావంకే చూస్తున్నారు.

"నేనొక నిర్భాగ్యురాలిని. డబ్బు లేకుండా ప్రయాణంచేస్తుంటే కొట్టి దింపేశాడు." ఈ రెండు వాక్యాలైనా అతిప్రయత్నం మీద వెలికొచ్చాయి.

'టిక్కెట్టు లేకపోతే దించరూ?' అన్నాడు పోర్టరు.

'వీరయ్యా!' అని గదిమి, తిరిగి నావంకచూస్తూ 'ఎక్కడికివెళ్ళాలమ్మా?' అన్నారు ముసలాయిన. కంఠంలో తొట్రుపాటు కనిపిస్తున్నది.

'ఎక్కడికని చెప్పను బాబూ! బ్రతుకు దెరువుకోసం ఎక్కడికో వెళ్ళాలి.'

'నీకెవరూ లేరా?'

నా కిక ఏడ్పు ఆగలేదు.

స్టేషను మాస్టరుగారు కండ్లనీరు తుడుచుకుంటూ 'ఇక్కడే ఉండమ్మా. డ్యూటీ కాగానే యింటి కెడదాం' అని నా భుజంమీద చేయి వేశారు.

* * *

లోకంలో ఇలాంటి సంసారం ఉంటుందని నాకు తెలియదు. ఇల్లాలికి పక్షవాతం. ముసలి తండ్రికి ఉబ్బసం. చంటివాడు కుంటివాడు. పెళ్ళికి సిద్ధంగా ఉన్న ఇద్దరాడపిల్లలు. చెట్టంత పెద్దబ్బాయి. ఆడుకుంటూ చదువుకుంటున్న మరి ముగ్గురాడ పిల్లలు. మొత్తం పదిమంది సభ్యులు కల ఆ యిల్లు చిన్నసత్రంలా ఉంటుంది. ఒకరి చేతిమీది సంపాదనతో వీరంతా బ్రతికి బట్టకట్టాలి. పెద్దబ్బాయిమాత్రం కాకినాడలో ఎవరో చుట్టాల యింటివద్ద చేరి చదువు కుంటున్నాట్ట. మిగతా తొమ్మండుగురు స్టేషను మాస్టరుగారి సంపాదనపై ఆధారపడేవారే. వారి తండ్రిగారికి పూట ఒక్కొంటికి పదిఅణాల నల్లమందు కావాలి. లేనిదే దగ్గుతో గిలగిల తన్నుకులాడి పోతారు. అలాంటి స్థితిలో సైతం నన్నాదరించి బిడ్డలా కాపాడారంటే ఏమనుకోవాలి ?

మనుష్యులలో దేవుడున్నాడు. కష్టాలు పొందిన హృదయమే కన్నీరు కార్చగల దనుకుంటాను. కన్నీరు కార్చగల హృదయమే కరుణించనూ గలదు. ఎలా పెంచాలో ఏమోగాని ఆ బిడ్డలూ అంతే.

మేము ఇంటికి వెళ్ళగానే చిన్నబిడ్డలిద్దరూ వచ్చి కాళ్ళకు చుట్టు కున్నారు. నా కాళ్ళకు చుట్టుకున్న అమ్మాయి 'ఈ అక్కాయి ఎవరు నాన్నగారు?' అని ముద్దుగా అడిగింది. ఎత్తుకుని నేను ముద్దు పెట్టుకు న్నాను.

"పెద్దక్కాయిని కొనుక్కొచ్చానమ్మా. నీకు బిళ్ళలు కొనుక్కొ ద్దామని కొట్టుదగ్గరి కెడితే, ఆ డబ్బుకు పెద్దక్కాయి వచ్చేసింది. మరి నీకు బిళ్ళలు తేలేదమ్మా. కోపగించు కుంటావా?"

"బిళ్ళ లక్కరలేదు నాన్నగారూ, అక్కాయుందిగా."

"అక్కయ్యొచ్చింది. పెద్దక్కయ్యొచ్చింది" అంటూ ముగ్గురాడ పిల్లలూ పాడుతూ "అక్కయ్యా! నీకంటే పెద్దక్కయ్య" అని వారి స్వంత అక్కయ్యను వెక్కిరిస్తూ మా చుట్టూ తిరిగారు.

నిజంగా నాకప్పుడు స్వర్గం కనుపించింది.

పెద్దమ్మాయి లిద్దరూ ఎడంగా నిలబడి నవ్వుతున్నారు.

పక్షవాతంతో పడిపోయిన కాలు ఈడ్చుకుంటూ వారి అమ్మగారు ప్రవేశించేసరికి- ఒక్కసారిగా స్వర్గంనుంచి నరకంలో పడినట్లు బాధ పడ్డాను.

"లోనికి తీసుకువెళ్ళి పెద్దక్కయ్యకు స్నానం చేయించండమ్మా. లతా! నీ దాపుడుచీరె తీసి పెద్దక్కయ్య కివ్వమ్మా. రేపో ఎల్లుండో కొనుక్కొస్తాలే"

ఐదుగురమ్మాయిలూ కలసి నన్ను దొడ్లోకి తీసుకువెళ్ళారు. దొడ్లో బాదంచెట్టు దగ్గర చంటివాడు దేకుతూ ఆడుకుంటున్నాడు.

"అమ్మా! వీడి నిక్కడ వదలిపెట్టావేం?" అని కేకేసి లత వాడ్ని చంకన వేసుకుంది.

నేను స్నానం చేయిస్తానంటే నేను చేయిస్తానని ఆడపిల్లలంతా పోటీ పడుతున్నారు. చివరకు ఒక ఒప్పందానికొచ్చి-ఒకరు నీరుతోడటం, ఆ తోడిన నీటిని తీసుకెళ్ళి ఒకరు దొడ్లోపెట్టడం-ఇది యిద్దరమ్మాయిల వంతు. మిగతా ముగ్గురు చిన్న పిల్లలలో ఒకరు సున్నిపిండి, ఒకరు

ముద్దపసుపు పట్టుకోవడం; అందరికంటే చిన్నపిల్ల చెంబుతో నీళ్ళు పోయడంగా నిర్ణయించుకున్నారు. ఆ నిర్ణయం ప్రకారమే స్నానాదులు పూర్తిచేసి భోజనానికి కూర్చున్నాము.

"అమ్మా! పెద్దక్కయ్య భోంచేసిన తర్వాత మీరు చేద్దురుగాని. పోయి బయట ఆడుకోండమ్మా!" అమ్మమాట ప్రకారం పిల్లలంతా బయటికి పోయారు. నాకప్పుడు కొంచెం కష్టంవేసిన మాట నిజం. అయినా ఏమీ అనలేక పోయాను.

నేనూ, స్టేషను మాస్టరుగారూ ఒకరి సరసన ఒకరు కూర్చుని తింటున్నాము.

"పులుసుబావుంది. వేసుకోమ్మా. బిడియపడబోకు" అని ఎదురుగా కూర్చుని అమ్మ మాటలు ప్రారంభించింది. తలవంచుకు తింటూనే ఏమేమో యోచిస్తున్నాను.

"పెద్దమ్మాయీ! ఇప్పుడు ఎన్నో మాసమమ్మా?" తలెత్తి అమ్మ కండ్లలోకి చూశాను. మా అమ్మను నేను చూడలేదుగాని, బిడ్డలుగన్న ప్రతి అమ్మ కండ్లలోనూ ఇంత దయ వుంటుందేమో!

"అవునమ్మా. నొప్పులొస్తున్నాయి. ఇది తొమ్మిదో మాసమను కుంటాను."

అమ్మ యిక మాటాడలేదు. నేనే నా కథ వివరించాను.

"కాలేజీలో చదువుతూ వుండగా ఒక కుర్రవాడితో పరిచయం కలిగింది. ఎంతో మంచివాడు; పెళ్ళిచేసుకుంటానని నన్ను చేరదీశాడు. నిజమేనని నమ్మి నా సర్వస్వాన్ని అర్పించాను.... మేము నిరుపేదలం. మా అమ్మ గొప్పింటి వారి యిండ్లలో పనిచేసి నాకు చదువు చెప్పిస్తుండేది. అకస్మాత్తుగా ఒకనాటిరాత్రి మేముండే పూరికొంప తగులబడి, మా అమ్మతోసహా అంతా ఆహుతైపోయింది. నేనారాత్రి ఆ కాలేజీ కుర్రాడితో కలసి సినిమా చూస్తున్నాను. వాడితో కులికి ఇంటికి వచ్చేటప్పటికి- ఏముంది? అంతా అయిపోయింది.... చారెడు బూడిద తీసుకుని ఆ కుర్రా డింటికి వెళ్ళాను. నన్ను గేటులోనే నిలవేశారు. నేనీ యింటి కోడలు నని

గగ్గోలుపెట్టి ఏడ్చాను. ఏమిటోనని ఆ కుర్రవాడూ వాడి తండ్రీ పైనుంచి దిగి వచ్చారు....ఇదిగో మా అమ్మ బూడిదై పోయింది-ఇక మీరే దిక్కని కాళ్ళుపట్టుకు ఏడ్చాను. ఫలితం - కొట్టి ఈడ్చేశారు....బజార్లు పట్టుకుని ....బ్రతుకు దెరువు కోసం...."

"అమ్మా! ఇక చెప్పవద్దు. వద్దమ్మా" అంటూ నాన్నగారు పీట మీంచి రివ్వున లేచి వెళ్ళిపోయారు.

  

నే నా యింటిలో ఒక మనిషినై పోయాను. నాది తక్కువ కుల మన్న విషయమే వారు పట్టించుకోలేదు. నల్లమందు తాతయ్య మాత్రం ఒకమాటు అడిగారు: "పెద్దమ్మాయీ! మన దే కులం?"

నేను సమాధానం చెప్పేలోపుగానే అమ్మ హడావిడిగా కేకేస్తే చెప్పకుండానే వెళ్ళిపోయాను. ఆ పైని ఎవరూ నన్ను హెచ్చరించిన వారులేరు.

ఇంటిలో పనులన్నీ నేనే చూస్తున్నాను. ఒక్క వంటపని మాత్రం పెద్దమ్మాయి లత చేస్తుండేది. నేను పనిచేస్తుంటే అమ్మ సహించేది కాదు. "నిండు మాసాలొచ్చి నీవెందుకు పనిచేస్తావు? ఎన్నిసార్లు చెప్పాలి పెద్దమ్మాయీ" అని చేయనిచ్చేది కాదు.

పెద్దమ్మాయి అంతా తండ్రిపోలిక. గుణాలుకూడా తండ్రివే అబ్బి నాయి. కాస్తంత విషయానికే కన్ను చెమ్మగిలి పోతుంది. ఒకనాడు అమ్మ "ఎన్నేళ్ళు తప్పుతావే ఆ పాడు పరీక్ష?" అని కొంచెం విసుక్కుంటే, ఆనాడంతా ఏడుస్తూనే వుంది. ఎంత ఓదార్చినా ఒక్క ముద్ద నోటికెత్తలేదు.

"నువ్వేచెప్పమ్మా పెద్దమ్మాయి. ఇంతమంది జనం ఇంట్లో కూర్చుని తినాలంటే-చూస్తూనే వున్నావుగా నువ్వు. చెప్పుకుంటే సిగ్గు పోతుందని-వారు నాచీరె కప్పుకున్నారంటే...."వలవల ఏడ్చింది అమ్మ. ముగ్గురం ఏడ్చేసి భోజనానికి లేచాము. అమ్మ యింకా ఆలోకంలోనే వున్నది.

"నిజమే. కొందరు చురుకైన వాళ్ళుంటారు. నేను కాదనడంలేదు చిన్నది ప్యాసై. ఇది రెండేళ్ళు తప్పిందంటే ఎంత డబ్బు దండుగో చూడు."

"నేనిక చదువలేనమ్మా. నన్నెందుకు బాధపెడతారు? నేనుచదవను" అన్నది పెద్దమ్మాయి.

"అదిగో. అలా అంటే ఏడ్పు....మనకేమైనా మడులు మాన్యాలుంటే చవదువకపోయినా ఇబ్బందిలేదు. వాడక్కడ-రాముడు ఎన్ని అగచాట్లు పడుతున్నాడో-ఎందుకు? కుటుంబంకోసమేగా పరాయి పంచల్లో పడుకుని ఆ నాలుగుముక్కలు చదువుకోవడం?....నువ్వన్నా చెప్పమ్మా పెద్దమ్మాయి దానికి."

నే నేమని చెప్పను? వీళ్లకు చెప్పే శక్తి గలదాన్నా నేను?

ఆనాటి సాయంత్రమే పెద్దమ్మాయి పుస్తకాలూ దీపమూ పుచ్చుకుని నాదగ్గరకొచ్చింది. తలెత్తి చూసి ఏమిటన్నట్లు కండ్లతోనేమాటాడాను.

"నాకు చదువుచెప్పాలి. అని నాముందు కూర్చున్నది. చెప్పగలనా అన్న అనుమానమే నాకు రాలేదు. పుస్తకం తెరచి ప్రారంభించాను. నల్లమందు తాతయ్య దగ్గుకుంటూవచ్చి పెద్దమ్మాయీ! నాకు ఇదొక్కటి చెప్పగలవూ?" అన్నారు.

ఏమిటన్నాను.

"ప్రపంచంలోకల్లా అతి మధురమైనదీ, అతిఖేదమైనదీ ఏమిటి?"

"పాడు పజిల్స్. నువ్వు చెప్పకక్కయ్యా. ముందు నా చదువేమిటో చూడు" అన్నది పెద్దమ్మాయి.

"తాతయ్య పజిల్సుగూడా ఆడుతారన్నమాట, ఒక్క నల్లమందే ననుకున్నానునేను" అని నవ్వాను.

"ఇది ఒక్కటి చెప్పమ్మా. ఇక నిన్ను అడగనుగా....ఏనాడో ఒకనాడు పెద్ద పజిల్ రాకపోనా? మీరంతా తాతయ్యా నాకో చీరె, తాతయ్యా నాకో రవికె, నాకో గౌను అని నా చుట్టూ తిరుగకపోరా?"

"ఏమిటే అక్కడ గోల?" అంటూ అమ్మ లోపలినుంచి కేకవేసే సరికి దొంగనల్లిలా దాటిపోయాడు తాతయ్య.

పెద్దమ్మాయీ, నేనూ నవ్వుకున్నాం.

"అమ్మను చూస్తే తాతయ్యకు భయం. అయినా చిన్నపిల్లాడిలా ఏడిపించి అణాబేడా పట్టుకెళ్లి పజిల్స్ కడుతుంటాడు."

ఆనాటిరాత్రంతా తాతయ్యే నాకండ్లలో మెసిలాడు. ఆయన నడిగిన ప్రశ్నకు సమాధానం వెతికాను.

ప్రపంచంలో కల్లా అతి మధురమైనదీ, ఖేదమైనదీ ఏమిటి?....

జీవితం. అంతే. జీవితం!

  

నాకు నొప్పులు ఎక్కువవుతున్నాయి. రేపోమాపో అన్నంతలోనే వుంది. స్టేషనుమాస్టరుగారుకూడా రెండు రోజులు సెలవుపెట్టి ఇంటి దగ్గరే వున్నారు. అతి కష్టంమీద నేను ప్రసవించాను. మగబిడ్డ. ప్రాణం లేని మగబిడ్డ కలిగాడు నాకు.

ఎందువల్ల ప్రాణంలేకుండా పోయిందో నాకు తెలుసు. అందువల్లే నాకంటి వెంట ఒక్క కన్నీటిబొట్టు రాలలేదు. పాపం! తెలియని జనం మాత్రం కంటతడి పెట్టుకున్నారు.

మామూలుగానే లేచి తిరుగుతున్నాను. కాదు; విశ్రాంతి తీసుకోవాలని బలవంతం చేశారు. నేను నాజీవితంలో ఎవరిమాట లెక్క పెట్టాను గనుక? తిరిగి యథాప్రకారం, నాపనులన్నీ నేను చేసుకు పోతున్నాను.

పరిస్థితులు గమనించి ఒంటిపూట భోజనం మొదలెట్టాను. మానసికంగా నేను బాధ పడుతున్నానని వారు భావించారు. అందువల్ల నన్నిక బలవంతం చేయలేక పోయారు.

ఒకనాటిరాత్రి నాన్నగారు పెందలకడనే డ్యూటీనుంచి వచ్చి నన్ను పిలువనంపారు.

"ఏమిటినాన్నగారూ?" అడిగాను.

"నీకాలేజీ రిజిస్టరు ఎక్కడున్నది?"

"నేను చదివింది మెట్రిక్ నాన్నగారూ. ఆ సర్టిఫికెట్ కూడా మా అమ్మతోపాటు తగలడి పోయింది."

"మళ్ళీ నకలు తెప్పించుకోలేదా ?"

"లేదు."

"బలే పనిచేశావ్. యూనివర్సిటీకి వ్రాసి నే తెప్పిస్తాగాని రేపటి నుంచి టైప్‌రైటింగ్‌కు వెళ్ళు. ఉచితంగా చెప్పేట్లు ఆయనతో మాట్లాడి వచ్చాను." అన్నారు.

ఆ టైపు కొట్టు పెట్టినాయన మహా పెద్దమనిషి. ఉచితంగా విద్య నేర్పుతున్నందుకు మనిషినెందుకు వుచితంగా పోనివ్వాలని ఒకరోజున చల్లగా దగ్గరకొచ్చాడు....మిట్టమధ్యాహ్నం వీధిలోగూడా జనసంచార మంతగా లేదు. ఇద్దరమే వున్నాము. మాతోపాటు దేశనాయకుల ఫొటో లున్నాయంతే. నేను టైపుచేసుకుంటుంటే "పెద్దమ్మాయీ!" అని నా తలపైనుంచి గొణిగాడు. నాకా స్వరమే తెలియ చెప్పింది. అయినా బయట పడకుండా టైపు చేస్తూనే "ఏమిటండీ" అన్నాను.

"ఏంలేదు. ఏంలేదు, బాగాచేస్తున్నావా అని ?"

"మీరు చూస్తూనేవున్నారుగా."

"అవునవును, చూస్తూనే వున్నాగా. చేస్తున్నావు."

చేయితగలకుండా నా తలలోని గులాబిపువ్వు తీసి చేతబట్టు కున్నాడు. నేను వెనుదిరిగిచూశాను. కనురెప్పలు టపటప కొట్టుకున్నాయి. తడబడ పడుతూ "ఈ పువ్వు నా కివ్వవూ ?" అన్నారు.

"అంత బావుంటే తీసుకోండి."

దానితో అతగాడి ప్రేమకోసం నేను తన్నుకులాడి పోతున్నట్లు, పుష్పమే సంకేతమనుకుని "పెద్దమ్మాయి" అంటూ జబ్బుచేసిన మని షిలా నా జబ్బ పట్టుకున్నాడు.

ఒక్క విదిలింపువిదిలించి, "బుద్ధిలేదురా నీకు? ఏంపెద్దమనిషివి? నీపెళ్లాన్ని పట్టుకుంటేరా?"అని అంతా రాళ్లబండి తోలించాను. పెద్ద మనిషిగనుక పరాయివారెవరైనా వున్నారేమోనని పరికించిచూసి, లేరని

నిర్ధరించుకున్న మీదట క్షమించమని పాదాలు తాకి పాప పరిహార మైనట్లు పెద్దమనిషిలాగానేవెళ్లి తన సీటులోకూర్చున్నాడు. నావంకచూడ కుండానే కాగితాలతోనూ, పైపు మిషనుతోనూ చెప్పుకుంటూన్నాడు: "నీకునమస్కారంచేస్తాను. ఉండీ వుండలేక బుద్ధిగడ్డితినివేశాను. నేనింత వరకు ఎవరినీ ఈవిధంగా ముట్టుకోలేదు. లెంపలేసుకుంటున్నాను. తల్లీ! బయటికిపొక్కనీకమ్మా, దణ్ణంపెడతాను. ఇదితెలిస్తే ఆడపిల్లలిక అడుగు పెట్టరు. నీవు ఎన్నిసార్లయినా తప్పు. గవర్నమెంటు ఫీజు సైతం నేనే కట్టి నిన్ను హైయ్యర్ ప్యాసు చేయిస్తాను."

అంటుండగానే ఎవరో ఆసామి కోర్టుకాగితాలతో మెట్లెక్కుతున్నాడు.

"పో.పోవయ్యా. ఇప్పుడేంలేదు. ఇప్పుడేం చేయను. పో." అని ఏడ్పుముఖం తోనే కసరి కొట్టాడు. ఆ ఆసామికి మండిపోయి పోట్లాటవేసుకున్నాడు.

"నీకు నమస్కారం చేస్తున్నాను. పో నాయనా. నాదేతప్పు. నాకు బుద్ధి లేదన్నానుగా, ఇకపో తండ్రీ!" అంటూ చేతులెత్తి నమస్కారం చేసి,ఆ ఆసామిని సాగనంపాడు. అంతలోనే మరిద్దరు కుర్రవాళ్లు రావడంతో సమస్య దారి పట్టింది.

ఇంటికి వెళ్లగానే మరోకేసు. చంటివాడు వరండాలో కూర్చుని పుస్తకాన్ని చించి చీరేస్తుంటే చూసినవారే లేరు. ఇంట్లో వారంతా ఏంచేస్తున్నారో ననుకుంటూ, వాడిచేతులోని పుస్తకాన్ని లాక్కున్నాను. పుస్తకానికి వేసిన అట్టపూడి, అందులోంచి గ్లేజు కాగితం చుట్టిన ఒక పొట్లాంలాంటిది కిందపడింది. పుస్తకంలో మందుపొట్లాలేమిటా అని విప్పిచూశాను. ఒకో కాగితం విప్పుతుంటే కాగితాలు దాదాపు పది పన్నెండు అరలు ఛేదించేప్పటికి అసలైన కాగితం బయట పడింది. చదివాను.

"ప్రియమైన ........

నిన్ను ఏమని సంబోధించాలో తెలియకుండావున్నది. అందువల్లనే 'ప్రియమైన' ప్రక్కనఖాళీగా వదిలేస్తున్నాను. నిన్ను పేరుతో పిలవడం నాకిష్టంలేదు. అయినా ఏమని పిలవాలి? ఏమో-నీవే చెప్పాలి.

రెండుమూడు దినములలో నీవేమీ చెప్పకున్న ఇక ఈ జీవితంలో నిన్నెన్నడూ చూడను. నాపట్టుదల నీకుతెలిసినదే.

నీ........"

ఎవరీ పట్టుదలగాడు? అసలీ పుస్తకమెవరిది? అని చూడగా రెండో అమ్మాయి లీలదీ పుస్తకమని తేలింది. అంటే లీల అప్పుడే ప్రేమ లేఖల దాకా వచ్చిందన్నమాట! పద్నాలు గేండ్లగుంట కప్పుడే ప్రేమ కావలసి వచ్చింది!

ఒళ్లు మండిపోయి. "లీలా! లీలా!" అని అరచుకుంటూ లోనికి వెళ్లాను.

"ఎవరింటికి వెళ్లిందో అమ్మ గారు. దేనికమ్మా పెద్దమ్మాయీ?" అన్నది అమ్మ.

"ఊరికేనమ్మా. ఎక్కడికి వెళ్లిందా అని."

"ఎవరికి తెలుస్తుందమ్మా. అదేమైనా చెప్పి పోతుందా? ఎక్కడ తిరుగుతున్నదో ఏమో."

పెద్ద అమ్మాయివచ్చి "ఎందు కక్కయ్యా! నేనున్నాగా ఏమిటా పని?" అన్నది.

"నీకేం చేతనవుతాయి ఈ పనులు!" అని కోపంలో నోరు జారి అనేశాను.

"ఏమిటక్కయ్యా ఆ పని! నేను చేస్తానుగా, చెప్పవా?" బ్రతి మాలింది.

"ఏమీలేదు. చెట్టెక్కి జామకాయలు కోయాలి."

"నావల్లకాదమ్మా చెట్టెక్కడం. లీల రావలసిందే" అంటూ లత వెళ్లిపోయింది.

"మూడోదిగూడా చెట్టెక్కుతుందమ్మా, దానిచేత కోయించుకో" అన్నది అమ్మ.

నేను విననట్లే ఇవతలకు వచ్చేశాను.

♦ ♦ ♦

లీల బహుమాటకారి. అతిచురుకుగా వుంటుంది. ఎంత వారి నైనా మాటల్లో పడితే బోల్తాకొట్టింస్తుంది. అందువల్ల ఏమీ మాటాడకుండా అందరూ పడుకున్న పిదప రాత్రికి హెచ్చరించాలని, "మనమిద్దరం ఈ రోజు బయట దొడ్లో పడుకుందాం లీలా" అని పట్టుకెళ్లాను. వెండిపూతలా వెన్నెల కాస్తున్నది. చెట్ల నడుమనుంచి వచ్చేవెన్నెల మరీ అందంగా కనుపిస్తున్నది. చాపమీద పడుకుని ముందేదో లోకాభిరామయణం మాటాడుకున్నాము.

"వెన్నెల నీకు నచ్చుతుందా లీలా."

"ఎవరికి నచ్చదు?" అని ఎదురు ప్రశ్న వేసింది. కొద్ది సేపు నోరుమూసుకున్నాను.

"మరి కొందరికి చీకటంటేనే యిష్టమట?" మళ్లీ అడిగాను.

"అవేవో నిశాచరాలు. వాటిమాట మనకెందుకు గాని మనుషులకు వెన్నెలే కావాలి."

"అయితే నీకిప్పుడు వెన్నెల అవసరం చాలా వుందన్నమాట?"

"నాకు అవసరమైనప్పుడల్లా వెన్నెల వస్తుందేమిటి? అలాంటి ఏర్పాటేదైనా చూస్తున్నావా పెద్దక్కయ్యా?" కిల కిల నవ్వింది.

ఆ నవ్వుతో నాకోపం సగం తీసింది. ఇంకా మాటలు పడితే పూర్తిగా తీసిపోతుందేమో నన్న భయంతో కళ్ళు మూసుకుని కోపం తెచ్చుకుంటున్నాను.

ఇంట్లోని వారంతా నిద్రకు పడ్డారు. లీల గూడా నిద్రకు ప్రయత్నిస్తున్నది.

"లీలా! నిద్రపోయావా?"

"పోయాను. మాట్లాడించకు."

"మటాడించను గాని, నీపట్టుదలగాడెవడు?"

ఇంకా అర్థం కాలేదేమో మెసల్లేదు.

"అదిగాదు లీలా! మరి అతనికి ఏమని పిలవాలో కబురంపావా? రెండు మూడు దినాలలో ఏ విషయం తేల్చకపోతే ఇక జీవితంలో

చూడడట పాపం! మరి ప్రత్యుత్తర మిచ్చావా? అసలు ఎన్నాళ్లయిందేం ఈ ప్రేమచీటీ వ్రాసి?"

పరుగెత్తి ఇంట్లోకి పారి పోయింది. కాళ్లకు తగిలిన బిందెలూ చెంబులూ గోలచేసి అమ్మనూ, తాతయ్యను నిద్రనుంచిలేపాయి. ఎవరు ఎవరని అరిచాడు తాతయ్య. నేనే ననుకుంటూ లేచి సమాధానంచెప్పాను.

"నీవా పెద్దమ్మాయి! ఏమిటమ్మా?" అని మళ్లీ కునికింది అమ్మ.

వంట గదిలో దూరిన లీలను, "అమ్మ వాళ్లు వింటారు. బయటి కెడదాం, ర"మ్మని చేయి పట్టు కుని మళ్లీ పట్టుకొచ్చాను.

కళ్లుమూసు కుని మోకాళ్లలో తల దూర్చి కూర్చున్నది.

"ఫర్వాలేదు. నిజంచెప్పు నిజం చెవితే ఎవరితోనూ చెప్పను.... నేను మాత్రం నా చిన్నతనంలో తెలియక ప్రేమించలేదా? తప్పేమిటి? ఎవరేనా ప్రేమిస్తారు?....ఇంతకూ ఆ అబ్బాయి ఎవరు లీలా! చెప్పవా?" అని నయానా భయానా అడిగాను. ససేమిరా చెప్పిందికాదు. కోపం పట్టలేక బలవంతాన తొడ మెలిపెట్టాను. చీమ కుట్టినట్లే లేదు.

ఈ మొండి పిల్లతో ఏమిటిచేయడం? వాడెవడో పట్టుదలగాడట! రెండూ తోడైనందుకు అనుకోవాలి.

"ఏమిటి లీలా! చెప్పవా అయితే? ఇక అమ్మవాళ్ళతో చెప్పేయడ మేనా? చెప్పు." చివరిసారిగా బెదరించి చూశాను. పెద్దగా ఏడుస్తూ నా ఒడిలో తలవాచుకుంది. నేను లేచి దొడ్డి తలుపు గూడా మూసివచ్చి కూర్చున్నాను - ఇక చెప్పమన్నట్లు.

ఏడుస్తుందేగాని ఎంతకూ నోరెత్తి మాటాడదు. బ్రతిమాలాను, భంగపడాను; మళ్ళీ బెదరించిచూశాను. అబ్బే! నోరెత్తి మాటాడందే ఏంచేయను? కుళ్ళుచిసుకుల్లా ఒకటే ఏడ్పు. నాకు విసుగెత్తి పోతున్నది.

"సరే. చెప్పకపోతే మానేయి" అని నేను వెల్లికిలా పడుకుని కళ్ళు మూసుకున్నాను. రాగం పెద్దదవు తున్నది. "తల్లీ! చెప్పకపోతే మానెగాని ఆ ఏడ్పు మానేయి....ప్రేమించుకో. నీయిష్టంవచ్చిన వాడ్ని ప్రేమించుకో" అని మళ్ళీనేను పడుకున్నాను.

పాడునిద్ర నాపని పట్టింది. ఎంతసేపు నిద్రపోయానో, మెలకువ రాగానే ఉలికిపడి లేచాను. చూద్దునుగదా! లీల ప్రక్కమీద లేదు. కంగారుగా అటూయిటూ పరుగెత్తి ఇల్లంతా వెతికాను. మళ్ళీ వంటింటిలో ఒకమూలకు చేరింది. నన్నుచూడగానే లేచి నిలబడి, తలవంచుకునే ఒక కాగితం నాచేతిలో పెట్టి విసురుగా దొడ్లోకి వెళ్ళిపోయింది. దీపం ముందు కూర్చుని ఆచీటీ చదివాను.

"పెద్దక్కయ్యా!

నేనేమీ పాపం చేయలేదు. ఆచీటీ వ్రాసినతను మాహెడ్ మాస్టరుగా రబ్బాయి వేణు. నేనూ అతనంటే చాల యిష్ట పడతాను. మీకు కష్టం కలిగితే మాత్రం, నేనిక అతనితో ఎలాంటి సంబంధం పెట్టుకోను.

చెల్లెలు లీల."

♦ ♦ ♦

ఏ చెట్టుకు ఆ పూలు పూస్తాయి. తీరుతెన్ను లేకుండా అడవిలో పెరిగే పిచ్చిమొక్కనైనాతెచ్చి పూతోటలో నాటితే, కొన్నాళ్ళకైనా బుద్ధి తెచ్చుకుని తిన్నగా ఎదగటం నేర్చుకుంటుంది. లేకుంటే తన ఉనికికే భంగం వాటిల్లుతుంది. మన దొడ్లోవుండే తులసిమొక్కకూ అడవిలో పెరిగే తులసిమొక్కకూ గల వ్యత్యాసం అదే. ఇంటి ముంగిట వేసుకునే కనకాంబరం కొద్దిపాటి స్థలంలోనే తన ఉనికిని సవరించుకుని పూలు పూస్తుంది. మొగలి, మెట్టతామర వగైరాలు విశాలమైన ప్రదేశంలో పడి పెరుగుతాయి గనుక, తమ యిష్టమొచ్చినట్లు పరచుకుంటాయి. అదే మొగలిచెట్టును తెచ్చి జనం మధ్యలో వేయండి – తప్పక తరిగి కూర్చుంటుంది. జుట్టువిరబోసుకున్నట్లు పెరిగే స్వభావం కొన్ని సంవత్సరాలకైనా మారి తీరుతుంది. చెట్లకే ఈ కొలబద్దలుంటే, ఇక మనుషుల మాట వేరే చెప్పాలా?

నేను ఎంత చెడిపోయి స్టేషను మాస్టరుగారియింట చేరాను. .... నేనిప్పుడు వీధికంతా పెద్దమనిషిని. ఆడవాళ్ళమధ్య న్యాయం జరగాలంటే నాపేరు చెప్పుకుంటున్నారు. ఏదైనా తీర్పు కావలసివస్తే అమ్మలక్క

లంతా నా వద్దకు పరుగెత్తు కొస్తున్నారు. దినదినానికి నా మంచితనం పెరిగి వటవృక్షమై పోతున్నది.

నాన్నగారు నన్నుచూసి మురిసి పోతున్నారు. అమ్మ తన స్వంత కుమార్తెల కంటే నన్నధికంగా ప్రేమిస్తున్నది. మాపెద్దమ్మాయి వచ్చి నాపజిల్సుకు సున్న చుట్టిందని తాతయ్యా అందరితోనూ చెప్పుకుంటున్నాడు. ఇక ఆడపిల్లలున్నారంటే ప్రాణం యిస్తారు.

అలాంటి ఉచ్ఛదశలో నాకో, పెండ్లి సంబంధం వచ్చింది. వరుడు బడిపంతులు. నాన్నగారితో నేను చెప్పాను - నా యావత్తు కథ ముందుగానే అతనికి వివరించండని. కాని నాన్నగారు మార్చి చెప్పారు.

"నాయనా! మా పెద్దమ్మాయి ఈలోకంలో పుట్టవలసింది కాదు. మనిషిని చూశావుగదా. వెదకి పట్టుకొద్దామన్నా, మాతల్లికి పోలిన అందగత్తె నీకు దొరకదు. ఇక గుణమంటావా? నాకులేదు.... కాని ఒక్క విషయం. నేను దాన్నేమీ రహస్యంగా దాచిపెట్ట దలచలేదు. అందుకే ముఖా ముఖి మాట్లాడుతున్నాను. తరువాత అపార్థం చేసుకుంటే ఉభయులకూ కష్టమే....ఏమిటంటే, చిన్నతనానే మాతల్లికి పెళ్ళిచేసి - వారే పెంచుకుంటా మంటే - అత్తవారింటికి పంపించాము. అక్కడే పెరిగి పెద్ద దయింది. కుర్రవాడు పూనాలో "లా" చదువుకుంటూ అకస్మాత్తుగా కారుక్రింద పడి మరణించాడు."

బడిపంతులుగారు గూడా బుద్ధిమంతుడల్లే వున్నది.

"మీరు నిజంచెప్పారు గనుక నేనూ యదార్థాన్నిదాచలేను. నాకొక పెండ్లి జరిగింది. అయితే అనుకోకుండా గంటలమీద జరిగిన ఆ పెళ్ళి ఘడియల్లోనే ముగిసిపోయింది. మే మొక్క పూటయినా సంసారం చేయలేదు. పట్టుదలతో జరిగిన ఆ వివాహం ఆ అమ్మాయిని పొట్టన పెట్టుకుంది."

"అయితే ఇంకేం, రెండు పక్షాలకు ఉజ్జీ చక్కగా సరిపోయింది. ఒకరినొకరు వ్యాఖ్యానం చేసుకునే సమస్యేలేదు. కానీండి. కానీండి" అని తాతయ్య అక్షతలు చల్లాడు. లగ్నం పెట్టారు.

ఖర్చులో ఖర్చు వెళ్ళమారి పోతుందని పెద్దమ్మాయి లతకు గూడా సంబంధం వెదికారు. వరుడు ఏవరో కాదు – హెడ్మాస్టరుగారి పెద్దబ్బాయి – అంటే లీల ప్రేమించిన వేణు అన్నగారు. ఏదో ఉద్యోగం చేస్తున్నాట్ట. ఒక్కసారే మాతోపాటు లీలకుగూడా ముడిపెట్టేస్తే బావుం టుందనిపించింది కాని ముగ్గురకూ కలిపి ఒకేలగ్నం పెట్టడం సంప్ర దాయం కాదట.

లగ్నం సమీపించే కొద్దీ నాకెందుకో భయం వేస్తున్నది. కాని కార్యమేదో తలకెత్తుకున్నట్లు బాధపడుతున్నాను. ముందేదో విపత్తుజరుగ నున్నదంటే సూచనప్రాయంగానైనా నాకు తెలుస్తుంది. గుండెలు కొట్టు కుంటున్నాయే గాని రానున్న అవాంతర మేదో ఊహించ లేకున్నాను. మనసు కలవరపడి పోతున్నది. నిద్రొక్కుకుంటూ మామూలు మనిషిలా వుండేందుకు గట్టి యత్నం చేస్తున్నాను.

ఇంటికి సున్నం కొట్టించడం పూర్తయిపోయింది. ఒక వైపున కూలీలు పందిరి వేస్తున్నారు. కాకినాడలో చదువుకుంటున్న పెద్దాబ్బాయి సెలవులకు యింటికొచ్చాడు. సెలవూ, పెండ్లీ రెండూ కలిసొచ్చాయన్న సంతోషంతో పందిరిగుంజ లెక్కి తోరణాలు కడుతున్నాడు. గుంపులు గుంపులుగా చుట్టాలు దిగుతున్నారు. ఏగదిలో చూసినా సామానులూ మనుషులే. నాన్నగారు ఇంటిచుట్టూ దడికట్టే కార్యక్రమంలో మునిగి వున్నారు. ఎవరో చుట్టాలకుర్రాడూ, మూడోఅమ్మాయీ కబుర్లు చెప్పు కుంటూ నాన్నగారికి నారపీచు అందిస్తున్నారు.

రాత్రికే శుభముహూర్తం. నలుగుపెట్టి పెళ్ళికూతుళ్ళనుచేసి గదిలో పెట్టారు. లతవైపు చూసేందుకే నాకుధైర్యం చాలడంలేదు. త్వరలో తాళి బొట్టుకడితే బావుండుననీ, ఎంతత్వరగా నేనొకని భార్యనైపోతే అంత మంచిదనీ వేయిదేవుళ్ళనుప్రార్థించాను. కాని నన్నేదో భయం పట్టి పీడిస్తు న్నది. తట్టుకోలేక నాన్నగారిని పిలిపించి చెప్పాను: "నాన్నగారూ, నేనీ వివాహం చేసుకోలేను. ఎవరికీ నేనుభార్యను కాలేను. నేను తగను."

నాన్నగారి ఓదార్పు మాటలు నన్ను వీసమెత్తయినా నిలబెట్ట లేదు. ప్రాణంలేని బొమ్మనుచేసి పెళ్ళిపీటలమీద కూర్చో బెట్టారు.

మంగళ వాద్యాలు మారు మ్రోగుతున్నాయి. "సీతమ్మ పెళ్ళికూతురాయనే" స్వరం చెవుల పడుతున్నది.

"భగవంతుడా ! నన్ను కాపాడు."

పెళ్ళి పందిట్లో కలకలం బయలుదేరింది. నాకు తెలుసు. నట్ట నడి సంద్రాన పుట్టి మునిగి పోతుందని. అలాగే నల్లబూట్ల వారు నన్ను అరెస్టు చేశారు.

*       *       *

పట్టు బడ్డ తరువాత పారిపోజూడటం వెర్రితనం. ఇదే స్టేషను మాస్టరుగారి యింటిలోగాక మరెక్కడైనా సంభవించివుంటే, ఎలాగోలా సందుచేసుకుని పారిపోయి వుండే దాన్నేమో ? కాని ఆ కుటుంబాన్ని కళ్ళెదుట పెట్టుకుని అంత దారుణానికి పాల్పడలేకపోయాను.

" నిజమే నాన్నా! వారు చెప్పేదంతా నిజం. నేను హంతకురాలినే. ఇంతవరకు మిమ్మల్ని మోసంచేశాను." అన్నాగాని నాన్నగారు నమ్మడం లేదు.

"నేను నమ్మను. నీవు హంతకురాలివంటే నేనెలా నమ్మతాను పెద్దమ్మాయీ? నీవు హత్యచేయలేవు. నాకు తెలుసమ్మా. నన్నెందుకు ఏడ్పిస్తావు ? " అని ఏడుస్తున్నారు నాన్నగారు.

దుఃఖంలో సముద్రంలో మునిగిన వారందరి కడనుంచి సెలవు తీసుకుని, క్షమించమని వేడుకుంటూ పోలీసువాళ్ళకు చేతు లందించాను.

కోర్టులో విచారణ. విడాకులిచ్చి లేచిపోయిన ఫోటోగ్రాఫరు భార్య నాకు వ్యతిరేకంగా సాక్ష్యమిస్తున్నది.

"పరిస్థితుల ఒత్తిడివల్ల నాభర్తనుంచి నేను విడాకులు తీసుకున్నా వారిపై నాకు ప్రేమ చావలేదు. రాజుగారివద్ద వుంటూనే అప్పుడప్పుడు నా భర్తను కలుసుకుంటుండే దాన్ని. ఈ ముద్దాయిని నేను చాలసార్లు చూశాను. ఒకనాడు వారే చెప్పారు-ఈ ముద్దాయి అత్యంత ప్రమాద కారియైన వ్యక్తి అని. అనుకున్నట్లుగానే డబ్బుకాశించి, నాభర్త ప్రాణాలను తీసింది."

"కాదు. మీరంతా పొరబడుతున్నారు. నన్ను పోల్చుకోలేక హంతకురాలను నేనే ననుకుంటున్నారు. నేనుహత్య చేయలేదు. అసలా ఫొటోలతను ఎవరో గూడా నాకు తెలియదు. ఈ హత్యకూ నాకూ ఎలాంటి సంబంధంలేదు," అని పూర్తిగా మొండికి తిరిగాను,

కోర్టంతా ఆశ్చర్య పోయింది. న్యాయమూర్తులడిగారు.

"మరిపెళ్ళి పందిట్లో హంతకురాల్ని నేనేనని ఒప్పుకున్నావుగా ?"

"పోలీసులు బాధపెడితే తప్పని సరియై అబద్ధమాడాను. మానాన్న గారి పరువు పోతుందనీ, ఆయన్నూ అరెస్టుచేస్తారనీ భయపడ్డాను. అంతే గాని నేను హంతకురాలిని కాదు; నాపేరు సుబ్బలక్ష్మికాదు. నాపేరు సుబ్బులు. నేనెవరినీ హత్యచేయలేదు.

ఆంగ్ల వనిత తెల్లముఖం వేసింది.

"ఏమ్మా ! ముద్దాయి హత్యచేసినట్లు నీవద్ద సాక్ష్య మేమైనా వుందా ? నీవు ప్రత్యక్షంగా కంటితో చూశావా ?"

"హత్య జరిగిన క్షణాన నేనక్కడలేను. నేనేవుంటే హత్యజరిగేదా? ఒకవేళ జరిగినా దీన్నిమాత్రం హత్యచేయకుండా వదలి పెట్టేదాన్నా?" అన్నది ఆంగ్లవనిత.

న్యాయమూర్తులు హెచ్చరించారు.

వాదితరపు వకీలులేచి నా వాదాన్ని తేలగొట్టారు.

"నిజమే. ముద్దాయిఅసలుపేరు సుబ్బలక్ష్మికాదు. ఫొటోగ్రాఫరును హత్యచేసిందికూడా సుబ్బలక్ష్మికాదు. సుబ్బులే హత్యచేసింది. ఇదిగో ఈ బంగారు కడియమే ఇందుకుసాక్ష్యం. ఈ కడియమే హంతకురాల్ని పట్టించింది.... ఇది చనిపోయిన వారింటిలో దొరికింది. దీని ఆధారంతో పరిశీలించగా శ్రీ.... రాజాగారు వెంకటశాస్త్రిగారనే నటునికి బహూక రించగా, ఆ శాస్త్రిగారు ఒకానొక నాటక సందర్భంలో ఈ ముద్దాయి సుబ్బులుకు బహూకరించారు. ఈ సుబ్బులే మొన్న ఆంధ్ర యూనివర్సిటీ నుంచి నకలుసర్టిఫికెట్ తెప్పించుకోగా దొంగ దొరికి పోయింది. కోర్టు

వారు సదరు శాస్త్రిగారినీ, కాలేజి ప్రొఫెసరు గారినీ హాజరు పరచ మన్నా, మేము సిద్ధంగా వున్నాము."

"వద్దు వద్దు. నేనే సుబ్బుల్ని; సుబ్బలక్ష్మిని. నేనే హత్యచేశాను. ఎవరిసాక్ష్యమూ అక్కరలేదు. కోర్టువారి ముందు ఒప్పుకుంటున్నాను. నేనే హత్యచేశాను. నాకు ఉరి వేయండి" అన్నాను.

నే నంగీకరించినా న్యాయమూర్తులు ప్రశ్నించడం మానలేదు.

"సుబ్బులూ ! నిన్ను చేరదీసి విద్యాబుద్ధులు చెప్పిస్తున్న వారిని హత్యచేయ వలసిన అవసరం నీకేమొచ్చింది. ?" అడిగారు.

ఇలా నాటకమాడి రాజశేఖరంగారినుంచి డబ్బు వసూలు చేస్తున్నాడని. ఉన్నదున్నట్లు చెపుదామనుకున్నాను. కాని చెడిపోయిన వార మెలాగో చెడిపోతున్నాము. చనిపోయే చివరిక్షణానగూడా మరొకరి ఉసురుపోసుకోవడం దేనికని "అయిన అన్నయ్య" విషయం మరుగునే వుంచాను.

"నన్ను సినిమా నటిని చేస్తానని చేరదీశారు. నాకు మరేఅండ లేక వారు చెప్పినట్లల్లా ఆడాను. కాని నేను గర్భవతి నన్న విషయం వారికి తెలియదు. ఒకనాడు తెలియపరిచాను. వారు ఉవ్వెత్తున లేచి నన్ను మోసంచేశావని అరిచారు. డాక్టరు గారిని పట్టుకొచ్చి కడుపు తీయిస్తానని బెదరించారు. తల్లిని కావాలన్న కోర్కె నాలో బలీయంగా వుండటంవల్ల, ఆనాడే పారి పో ప్రయత్నించాను. వారు పట్టు కున్నారు. వెళ్ళటానికి వీల్లేదనీ, పిల్లల్ని కంటానికి అంతకన్న వీల్లేదనీ నన్ను బలవంతం చేశారు. అక్కడే చేతి కందుబాటులో మాంసం, కత్తి వుంటే........ఇక నే·చెప్పలేను. చేయిజారిపోయింది. నన్ను వెంటనే ఉరితీయండి" అన్నాను.

మరునాటి వాయిదాలో న్యాయమూర్తులు తీర్పు చెప్పారు ముద్దాయి సుబ్బులు ఆత్మ రక్షణార్ధం హత్యచేసినట్లుగా అర్ధమవు తున్నది. ఈ హత్యను ప్రత్యక్షంగా చూచిన వారెవరూ లేరు. మాకున్న. ధారాలతో, ఉచిత రీతిని యోచించి తీర్పు నిస్తున్నాము. నేరము నేరమే:

గాబట్టి ఈ ముద్దాయి సుబ్బులుకు ఏడేండ్ల జైలు శిక్ష, ఒకఏడాది కఠిన శిక్ష విధించడమైనది.

  

జైలు జీవిత మెంత దుర్భరమో, అది అనుభవించిన వారికి గాని తెలియదు. ఎనిమిదేండ్లు వెలుగు నోచుకోని ఆ చీకటి గుయ్యారంలో, ముక్కులు కొట్టుకుపోయే కంపులో. దోమలతో సంసారం చేయాలంటే శివుని శక్యమైనా కాదేమో; ఒక్క మానవ మాత్రులకు తప్ప. నాలుగు గోడలమధ్యకు ప్రవేశించగానే, ఇక ఈ బ్రతుకు దేనికి, చని పోదామను కున్నాను. తీర్పిచ్చిన న్యాయ మూర్తులు కరుణించి ఉరి వేయిస్తే ఎంతో సంతసించేదాన్ని. చీరముడి పెట్టుకుని చద్దామన్నా, ఆజారుడు గోడలు ఉడుముకే పట్టు చిక్కనివిగా వున్నాయి. ఎలా చచ్చేట్టు? ఎందుకీ కారాగారంలో పడి బ్రతికేట్టు?

మంచుకొండలలో సైతం మానవుడు బ్రతుకుతున్నా డంటే ఇదే కారణం కావచ్చు. పరిస్థితులనైనా తను వంచుకుంటాడు; లేదా ఆ పరిస్థితులకు తల వంచి, తనే దానిలో లీనమైపోతాడు.

మొట్టమొదట జైలును సందర్శించినపుడు "ఇవి మనుషులుం టానికేనా?" అన్నంత ఆశ్చర్యం వేసింది. మల్లలలో పప్పుచారు కూడు వేస్తుంటే, "ఇది కుక్కలైనా తింటాయా?" అని మొహంమీదేఅడిగి ముడ్డి మీద తన్నించుకున్నాను.

"దోమలు చంపుతున్నాయర్రో" అని అర్ధరాత్రిపూట లేచి కేక లేసేదాన్ని. కాని ఎన్నాళ్లు కేక లేస్తాను? ఎన్నాళ్లు అసహ్యించు కుంటాను? అలవాటైన పప్పుచారు కూడే పరమాన్నంగా రెండుపూటలా తినేదాన్ని. చర్మం దోమ కుట్టినా ధిక్కరించేంత గడసరిగా తయారయింది. ఎన్ని సార్లు తేళ్లుకుట్టాయో, చీమ కుట్టినంతయినా బాధపెట్టేవి కావు పాపం:

పండువెన్నెల్లో మేడపై పవళించినట్లు ఉహించుకుని ఆ చీకటిలోనే కన్ను మూసేదాన్ని. ప్రక్కకు పరచు కున్న పాత గొంగళీయే మెత్తటి పరుపు అనుకునేదాన్ని. కంటితో చూస్తూ, చేతితో తాకుతూ ఎన్నాళ్లలా

ఊహించుకోను? మధ్య మధ్య చావాలనే కోర్కె తిరిగి తలెత్తేది. చస్తే వదలి పోతుందీ పీడ అనుకుంటూనే, బ్రతికే చాలామంది వలేనే, నేనూ చావలేక బ్రతికాను.

ఈ ఎనిమిదేండ్లు నా బ్రతుకులో చని పోయిన దినాలు. కాదు. చనిపోయి నాజీవితంలో బ్రతికిన దినాలు.



బడిలోని కుర్రవాడు ఎప్పుడు స్వేచ్ఛగా తిరుగుతామా అని సెలవుకోసం ఆతురత చెందుతాడు. తీరా సెలవిస్తే ప్రాణం మీద కొస్తుంది. తిరిగి విద్యార్ధి జీవితంకోసం అతను తహ తహ లాడి పోతాడు. అలాగే ఎప్పుడు విడుదల చేస్తారా అని ఎదురు చూస్తున్న నేను "రేపే విడుదల" అనేసరికి మొదటిభావం పూర్తిగా మారి పోయింది.

తిరిగి ప్రపంచంలోకి యెలా వెళ్ళాలి? ఎలా బ్రతకాలి? మళ్ళీ ఆ కుళ్ళులో నేను పడలేను. నా కండ్లకు ఈ చీకటి బ్రతుకే సరిపడింది. బయటికిపోతే అదే బ్రతుకుకోసం ఎన్ని మోసాలూ, పాపాలూ చేయాలో గదా!

"నన్నెందుకు బయటికి పంపిస్తారు? మళ్ళీ ఆ అన్యాయపు కూటి కొరకు నన్నెందుకు ప్రోత్సహిస్తారు? నేను వెళ్ళను. జైల్లోనే పడేసి నా కింత కూడు పెట్టండి" అని మొరపెట్టుకున్నాను.

నవ్వి ఇదేమీ ధర్మసత్రం కాదన్నారు.

"అయితే ఇన్నాళ్ళు నన్నెందుకు బంధించారు?" అని రెట్టించాను.

"హత్యచేశావు గనుక."

"మరి హంతకురాలిని మళ్లీ ఊరిమీదపడమని వదులుతారేం? మీ కేమైనా బుద్ధిఉందా?"

బుద్ధిలేనివారికి నవ్వువచ్చింది. "ఎనిమిదేండ్లపాటు శిక్షించాముగా" అని తేలికగా అన్నారు.

"శిక్షించడంలోగల ప్రయోజనం?" అన్నాను.

"ఇకనైనా బుద్ధిగలిగి బ్రతుకుతావని."

"నాకు బుద్ధిరాలేదని నేనే చెప్పుకుంటున్నాను. అందుకే ఇంకా జైల్లో ఉంచమంటున్నాను. బుద్ధిరాలేదని స్వయంగా చెప్పుకుంటున్నప్పుడు బంధించకపోవడంలో మీ అభ్యంతర మేమిటి?" గట్టిగా వాదించాను.

చవటలు సమాధానం చెప్పలేక మెడపట్టి గెంటారు.

"తిరిగి రెండురోజుల్లో వస్తాను చూడండి" అని గేటుదాటి బయటపడ్డాను.

నన్ను పట్టుకొచ్చిన దినం కట్టుకొన్న పట్టుచీరె మళ్ళీ నాకు కట్టబెట్టారు. అంటే తిరిగి నా వేషం నాకు తగిలించారు. జుట్టు బాగా జడ కొచ్చేలా పెరిగింది. సవరాల సహాయం లేకుండానే త్రాచులాంటి జడ వేసుకోవచ్చు.

రాజమండ్రి వీధులు నా కంతగా నచ్చలేదు. జైల్లో పప్పుచారు పోసేవేళకు ఆకలి కరకరమంటూ లేచింది. ఆకలిమాట అటుంచి ముందు జడవేసుకు సవరించుకోవాలని ఒక మంగలి షాపు చూశాను. గేదె కొమ్ముల్లాఉన్న బుట్టతల క్రాపు అతను నన్ను చూడగానే లేచి నిలబడ్డాడు.

"అయితే ఇంకనూ మన శక్తి అడుగంటలేదన్నమాట" అనుకున్నాను.

"సరే గానీండి. నన్ను కొంచెం తల దువ్వుకోనిస్తారా?" వినయంగానే అడిగాను.

"దువ్వుకోండి. దువ్వుకోండి. షాపు పెట్టిందెందుకు? మీలాంటి వారు తల దువ్వుకునేందుకేగా?"

అప్పుడే ప్రపంచపు పాత్రలు ఆట ప్రారంభించా యన్నమాట! అద్దంలో చూసుకునేప్పటికి ఆశ్చర్యంతో క్రుంగిపోయాను. నేనా, నేను కానా అన్నంత ఆశ్చర్యం వేసింది.

నా బుగ్గలలోని సొగసు ఎటు పోయె? కండ్లలోని తళతళలు ఎటు జారిపోయె? పెదాల తీరు, కనుబొమల వంపు.... అయ్యో! పాపిట

వెంట్రుకలు బొత్తిగా తెల్లబడిపోయాయే! వీటి సాడుగాను, నన్ను మోసం చేశాయి. నెరిసిన వెంట్రుకలు ఏ ప్రక్కనో నాలుగు నెరిసినా నే నంత బాధపడివుండేదాన్ని కాను. దృష్టిపిడతకు సున్నంపూసినట్లు, కొట్టి వచ్చేట్టు ముఖంకంటే ముందు ఆ నాలుగు పరకలు కనిపిస్తున్నాయి.

అతనికి నేను నమస్కారంచేసి నేనుతిరిగినడుస్తున్నాను. కడుపులో కాలుతున్నా ఎవరినీ భిక్షమడుగ దలచలేదు. వెళ్ళివెళ్ళి గోదావరి వరకు వెళ్లాను. తిరుపతిలోవలె పొడిచీరెతో గుర్తులేకమాత్రం స్నానానికి దిగ లేదు. కావాలనే ఉన్న చీరెతో గోదావరిలో దిగి, మూడు గంటలపాటు స్నానంచేశాను. కడుపునిండా గోదావరితల్లి చనుబాలు త్రాగి, తడిబట్టల తోనే ఒక ఆలయంలో పడుకుని నిద్రపోయాను. అంతటి సుఖనిద్ర ఎంత కాలానికో.

  

ఆనాడు బ్రతికిన రోజుల్లో గౌతమబుద్ధుని వేషం వేసి రంగు తుడుచుకున్న పిదప ఎలాంటి ఆనందాన్ని పొందానో, ఇప్పుడీ నిద్రనుంచి లేచిన తరువాత అంత ఆనందాన్ని పొందాను. గౌతముని వేషం నా లోని కల్మషాన్ని పోగొట్టి ఎలాంటి నూత్న వెలుగు నిచ్చిందో, అంతటి బలాన్ని నేనా ఆలయ నిద్రలో పొందాను. తేలికైన హృదయంతో అందరినీ ఒకమాటు స్మరించాను. సుజాత, సూర్యప్రకాశరావు గారు, మధ్యలో రాజశేఖరం అన్నయ్య, నాన్నగారు, లత, లీల, అమ్మవాళ్ళంతా ప్రత్యక్షమై చిరునవ్వులతో నా కండ్లముందు నిలిచారు. వారిని చూడనిదే ఇక బ్రతుకలేననుకున్నాను. నా మనసు కోర్కెలతో కొట్టుకుపోతున్నది.

ఇప్పుడుమాత్రం టిక్కెట్టు లేకుండా రైలుప్రయాణం చేసే స్థితిలో లేను. ఆ అల్లరి, అలక్ష్యాల కాలం దాటిపోయింది. వయసు చెల్లకపోయినా నా కిప్పుడు ఒకప్రక్క తల నెరిసిందిగదా!

ఎక్కడ పనివుంటే అక్కడికి వెళ్ళి కూలితట్టలు మోశాను. కూలీ మేస్త్రీలను పరిచయం చేసుకుని నన్నూ తమ జట్టులో కలుపుకో మన్నాను. ఇప్పుడు నాకు కూలిపని ఇచ్చేందుకు ఎవరూ అభ్యంతర

పెట్టటంలేదు. నిలబడి నన్నూ, నా అందాన్నీ చూసేవారుసైతం తరిగి పోయారు. ఇక అంతగా ప్రమాదానికి తావు లేదనుకున్నాను.

కూలీలు నివసించేగూడెంలో ఒకకొంప అద్దెకు తీసుకుని మకాము పెట్టాను. ఎలాగైనాడబ్బుప్రోగుచేసి ఆప్తులందరినీ ఒకమాటు చూసిరావాల నేదే నా కాంక్ష....లత పెండ్లిఏమైందో? నా మూలాన్నే ఆ పెళ్ళివారు,తమ మర్యాద మంటగలసిందని లేచిపోయారు. నిజ పరిస్థితులు తెలుసుకున్న పిదపనైనా లతను తమ ఇంటికోడలుగా స్వీకరించారో, లేదో? చిన్న మ్మాయి లీల ప్రణయం ఎందాకా వచ్చిందో? ఆ వేణుగూడా అన్నగారికి మల్లే బిగదీసుకుపోలేదుగదా? అమ్మ - అమ్మను తలచుకుంటేనే గుండె చెరువవుతుంది. నాన్నగారు వట్టి మేథకుడు. రాము దేమైనా చేతి కక్కర కొచ్చాడేమో? నల్లమందు తాతయ్య అసలు బ్రతికున్నాడో లేదో?.... ఒక్కసారి, కేవలం ఒక్కసారి చూస్తే చాలు. సుజాతనుగూడా చూడాలి. పిచ్చిపిల్ల! ఏం చేస్తున్నదోగదా? పెళ్ళి చేసుకుని ఇద్దరు ముగ్గురి బిడ్డలతల్లి అయిందేమో? సూర్యప్రకాశరావుగారు ఇంకా ఉద్యోగంలోనే ఉంటారా! అయ్యో! జగదాంబగారి విషయమే మరచిపోయాను. ఆమెగారింకా లావుగా ఉన్నదో, ముసలిదై సన్నగిల్లిందో?....ఏమో? ఎప్పుడు వీళ్ళం దరినీ కళ్ళచూస్తాను? ఎప్పుడు కుతిదీరా కౌగలించుకుంటాను?

వచ్చిన ముప్పావలా కూలి డబ్బుల్లో ప్రతిదినమూ ఆరణాలు ఒక డబ్బీలో వేసి నిలువ చేస్తున్నాను. మిగతా ఆరణాలు ఎంత కష్టమైనాసరే రోజుకు సరిపెట్టుకునేదాన్ని. అయినా నా కేమి ఖర్చులుంటాయి? అర సోలెడు బియ్యం తెచ్చి ఉడకేసుకుంటే రెండుపూటలా తినవచ్చు. ఉప్పూ, చింతపండూ ఒక అణా పెడితే వచ్చె. కట్టెపుల్లలు కొనాలన్న దిగులే లేదాయె. కూలికి వెళ్ళినప్పుడే అక్కడో పుల్లా, ఇక్కడో చిదుగూ ఏరుకుంటే వేడినీళ్ళ స్నానానికి దిగుల్లేదు.

నెల కివ్వవలసిన ఇంటద్దెగూడా బకాయిపెట్టి పదిహేను రూపా యలు చేతపుచ్చుకుని బయలుదేరాను. ముందు సుజాతవద్దకు వెడితే, ఆ పైని కొంత పైకం తీసుకుని గూడూరు వెళ్ళవచ్చు.

రైలు కదలికతో నాలోని భావాలు కదలి పరుగెత్తసాగాయి. ఆ ఆలోచనల కెక్కడా అంతరాయం కలిగించకుండా, ఎంత దూరం తీసి కెడతాయో, అంతదూరం పోనిచ్చాను....సుజాత నన్ను చూడగానే ఎంత సంబరపడుతుంది? పిచ్చిపిల్ల! తన దగ్గరే ఉండిపోవాలని బలవంతంచేస్తే? ఉండిపోదామా? ఏమోనబ్బా! గత జీవిత మెలాగో గండాలతో గడచి పోయింది....ఈ తలంపుతో రెండు కన్నీటి చుక్కలు రాలి, గాజులపై బడి, చింది చీరె రంగులో కలసిపోయాయి.

కిటికీగుండా బయటికి చూస్తున్నాను, అప్పుడే సూర్యాస్తమాన మవుతున్నది. పడమటికొండలు ఎర్రకావురు గమ్మి సింధూరంతో స్నానం చేస్తున్నట్లున్నాయి. పక్షులూ, పిట్టలూ ఇప్పుడే ఉచ్చులనుంచి తప్పించుకున్నట్లు రెక్కలు తపతపలాడించుకుంటూ స్వేచ్ఛగా ఎగురాడు తున్నాయి. సూర్యుడు మునిగిపోయేవరకు పూర్తిగా చూశాను. మా బండి అక్కడే నిలచి ఆగివుంటే, మరికొంతసేపు చూసి ఆనందించే దాన్నని పించింది. వెనక్కు తిరిగి చూసినా ఎర్రకావురుగూడా కనుపించడంలేదు. చూస్తూచూస్తూండగానే సంతోష మదృశ్యమైపోయింది.

నా జీవితంలో ఎందుకింత చీకటి ప్రవేశించింది. నేను చేసిన పాప మేమిటి? ఉదయభానునివలె శైశవంలో నేనూ దేదీప్యమానంగా వెలిగాను.

"నాకు తెలుసమ్మా. నీ వెప్పుడూ ఫస్టే" అన్నది అమ్మమ్మ.

"ఈ అమ్మాయి ఎంతో అభివృద్ధి చెందుతుంది" అన్నారొక దేశనాయకులు.

"నా దేవుడు" అని వెంకటశాస్త్రిగారు—మహానటులు—నా పాదాలను కండ్లకద్దుకున్నారు.

అలాంటి దాన్ని వ్యభిచారినై, చివరకు హంతకురాలినయ్యేంత వరకు ఎందుకు దిగజారిపోయాను?.... చనిపోతూ చెప్పిన మా తాతయ్య మాటల ఫలితమా ఇది?....కావచ్చు. లేకుంటే ఈ విషపరిణామాలన్నీ వాటిల్లేవి కాదేమో? కసి దీర్చుకుందామని గాడితప్పి, ఒంటరిగా పోరి

చితికిపోయి వచ్చాను. శక్తినంతా వృథాచేసుకుని క్షతగాత్రనైపోయాను. ఇకనైనా ప్రశాంతంగా బ్రతుకనివ్వు భగవంతుడా! నాకు శాంతి ప్రసాదించు!



తెలతెలవారేసరికి మావూరు చేరాను. ఎలాలేదన్నా ఎంతపాపమున్నా పుట్టిపెరిగిన గడ్డపై వీచే గాలి, ఎందుకో అంత కమ్మగావుంటుంది. దగ్గరపడుతున్నకొద్దీ మనసు తహతహలాడుతూ కేరింతలు కొడుతున్నది. ఎన్నో ఎరిగిన ముఖాలు కనుపిస్తాయి. నేను ఆడుకున్నస్థలం, నాటకంవేసిన స్థలం, చదువుకున్న చోట్లన్నీ చూడాలి. చెవిటి ముసలమ్మనుగూడా ఒక్కసారి తీయగా పలుకరించి రావాలి. తూరీగలుపట్టే కుర్రాడు ఈపాటికి పెద్దమొగాడై వుంటాడు కామోసు....ఇంతకూ కౌన్సిలరబ్బాయి ఏంచేస్తున్నాడో? అబ్బాయేమిటి నామొహం: అప్పటికే పెద్దమనుషుల్లో జమఅయితే, ఇప్పుడింకా బడాపెద్దమనిషై వుంటాడు.

స్టేషనుకూడా చక్కదనం చేసుకుంది. స్టేషను దిగగానే కనుపించే పూరిళ్ళన్నీ పెంకుటిళ్ళగానూ, కాఫీహోటళ్ళగాను దిద్దుకున్నాయి. సిమెంటురోడ్లూ, ప్రక్కననీడనిచ్చే నిద్రగన్నేరుచెట్లూ ఊరిస్వరూపాన్నే మార్చివేశాయి. ఇక్కడి పేదవారంతా ధనికులైనారేమో ననుకున్నాగాని రిక్షాలసంఖ్య ఫర్లాంగుమేరకు విస్తరించుకున్నది.

ఈ పదేండ్లలో కలిగిన మార్పులన్నీ చూస్తూ నడుస్తున్నాను. ఆ మలుపు తిరిగేచోట పోలయ్య అనే ముసలాయన జంగిడిపెట్టుకుని జీళ్ళు వగైరా తినుబండారాలను అమ్ముతుండేవాడు. ఇప్పుడా ప్రదేశంలో ఏదో పెద్దవ్యాపారసంస్థ వెలసింది. మంచి అభివృద్ధే జరిగిందనుకుంటూ కూడలిలోకొచ్చేసరికి మరీ కంగారుపుట్టింది. సుజాతగారింటికి ఎటువైపునుంచి వెళ్ళాలో తెలియనంతగా బజారు మారిపోయింది. నలుదిక్కులాచూచి పాతవూరి నొకమారు గుర్తుకుతెచ్చుకున్నాను. నా అమాయకతకు నేనే నవ్వుకుని, ఎవరినీ అడగకుండానే దారితీశాను.

"భారత్ బ్యాంకు" బోర్డు చూసేప్పటికి నా ప్రాణం లేచివచ్చింది. గబగబా మెట్లెక్కి మేడపైకివెళ్ళాను. గుమ్మంలోనే కట్టివేసిన బొచ్చు కుక్క భౌమంటూ మీదికురికింది. సుజాతకు కుక్కలంటే పరమఅసహ్యం. అటువంటి దిప్పుడు ఈమోజు ఎలాకలిగిందాఅని అనుకున్నాను. అంతలోనే ఏడెనిమిదేండ్ల ఒకబుడతడొచ్చి "ఎవరివే నీవు? ఏంకావాలి?" అన్నాడు. బుగ్గలు సాగతీద్దామనుకున్నాగాని సుజాత బిడ్డడేమోనని చప్పున జ్ఞాపకమొచ్చి ఎత్తుకుని ముద్దుపెట్టుకున్నాను. తన బంగారమంతా పోయినట్లు బొచ్చుకుక్క తన్నుకులాడుతూ మీదపడింది.

"నాన్నా! ఈ మాదిగముండెవరో నన్నెత్తుకుని ముద్దుపెట్టుకుంటోంది. అబ్బో! నాబుగ్గలుకడగాలి" అంటూ చేతులపైనుంచే తన్నుకుంటున్నాడు.

ఒక అరవాయన లోపలినుంచివచ్చి "ఎవరునీవు? పిల్లవాడ్నిఎత్తుకున్నావు దేనికి?" అన్నాడు.

నాకప్పటికి బోధపడింది–సుజాతవాళ్ళిక్కడ లేరని. వెంటనే పిల్లవాడ్ని దించేసి 'క్షమించండి, సూర్యప్రకాశరావుగారి ఇల్లనుకున్నాను' అన్నాను.

"ఏ సూర్యప్రకాశరావుగారు? వేదాంతంగారా?" అన్నాడు.

"వేదాంతంగారెవరు? ఇక్కడ–ఈబ్యాంకు ఏజంటుగాపనిచేస్తుండే వారే–వారికోసమొచ్చాను."

"ఇప్పుడు ఏజంటుగా పనిచేస్తున్నది నేను. నాకు ముందు సూర్యప్రకాశరావుగారనే వేదాంతంగారు పనిచేస్తుండేవారు" అన్నాడు.

"వారిపేరు వేదాంతంగారు కాదండి. వట్టిసూర్యప్రకాశరావుగారే. ఎర్రగా, బక్కపల్చగా, పొడుగ్గావుంటారే...."

"అవును వారేలే. వారిని వేదాంతంగారనే మేమంతా పిలుస్తాము' అయితే వారిప్పుడు నీకుకావాలా?"

"అవునండి. వారిని కలుసుకోవాలనే చాలదూరంనుంచి వచ్చాను.

"వారిని నీవు కలుసుకోలేవు."

"ఏమండీ? ఎందువల్ల?"

"వారీలోకంలో లేరు. పరగతులైనారు."

ఆకాశం కూలి నన్ను కప్పేస్తున్నది.

"వారు మీకేమైనా బంధువులా?....వారి అమ్మాయివా ళ్ళిక్కడే వున్నారు. అడ్రసు యిస్తాను. మీరు వెళ్ళొచ్చు" అని ఒకచీటీ వ్రాసి నా చేతిలో పెట్టారు.

ఆ చిరునామా చూసుకోకుండానే నడుస్తున్నాను. ఎక్కడికిటు వెళ్ళడమని ప్రశ్నించుకుని, ఆగి ఆచీటీ చూశాను.

"యమ్. సుజాత, యం. బి. బి. యస్., కొత్తపేట."

ఈ సంతోషవిషయం సూర్యప్రకాశరావుగారు పోయారన్న విచారాన్ని కొంత మరుగుపరచింది. మళ్ళీ నడకసాగించాను. నా సుజాతను కలుసుకోవాలి. డాక్టరమ్మ దుస్తులలో నాసుజాత ఎలావుంటుందో ఊహించుకుంటూ రిక్షావాడిచేత "కళ్లు కనిపించడంలేదా?" అనిపించుకున్నాను. అతను తిట్టినా నాకు కోపంరాదు.

జనాన్నీ, బండ్లనూ తెలివిగా తప్పుకుంటూ దూసుకుపోతున్నాను కొత్తపేట వెళ్ళేటప్పటికి పూర్తిగా అలసిపోయాను.

నా సుజాత ఆసుపత్రి ఎక్కడో?

కిళ్ళీకొట్టతను సంగీతం పాడుతూనే, అదేనన్నట్లు చేయెత్తిచూపెట్టాడు. పరుగెత్తుదామనుకున్నాగాని బుద్ధితెచ్చుకుని ఆగిపోయాను.

"ఎందుకు నీకింత తొందర? మెల్లగా వెడితే సుజాత నిన్ను కాదంటుందా?....ఒక పావుగంటవరకు ఇక్కడే నిలబడిపో. అక్కడినుంచి పరుగెత్తివచ్చినందుకుగాను నీకు శిక్షవేస్తున్నాను."

నిజంగానే నిలబడిపోయి ఆసుపత్రిబోర్డువంక చూస్తున్నాను. "అబ్బా! నాసుజాతపేరు రంగుపలకమీద ఎంతబావుంది?....అదేమున్నదే పిచ్చిదానా! ఆసుపత్రిముందు నిలచివున్న ఆకారు చూడు! చక్కగా లేదూ?....అదీ నా సుజాతదే. నాదే" అనుకుంటుండగానే గౌనులాంటి

తెల్లనికోటు ధరించి, నవ్వుకుంటూ నా సుజాత బయటికొచ్చింది. వెంట నున్న నలుగురు పెద్దమనుషులూ నవ్వుతున్నారు.

"అబ్బో! డాక్టరమ్మకాగానే కండ్లకు అద్దాలొచ్చాయే?....ఎంత చక్కగా నవ్వుతుందబ్బా!....నా సుజాత నా సుజాతే."

నేనిక నిలవలేకపోయాను. రివ్వునవెళ్ళి మాటాడకుండా ఒక్కమాటుగా కౌగిలిలోనికి తీసుకున్నాను. పాచిముఖమన్న విషయమే మరచిపోయి అదేపనిగా ముద్దుపెట్టుకున్నాను.

"అబ్బ! ఎవరమ్మా నీవు? వదులు వదులు" అనిగుంజుకొని వదలించుకున్నది. చేరుమాలుతో ముఖం తుడుచుకుని "మనిషివా, పశువ్వా? ఎవరునువ్వు? "అని కసురుకున్నది.

అయితేనేం? నా నవ్వెక్కడికి పోతుంది?

"ఏం కావాలమ్మా? జబ్బేమిటి?....జబ్బేమిటో ముందుచెప్పు? అలా ఏడిస్తే ఎలాగు?"

నా నవ్వు ఏడ్పులా కనిపించింది.

"నిన్ను చూడాలనే జబ్బు. నయంచేస్తావామరి?"

నన్ను గుర్తుకు తెచ్చుకుంటున్నట్లు కండ్లలోకి చూసింది.

"ఏం సుజాతా! నన్నింకా గుర్తించలేదా? నీ సుబ్బుల్ని."

"నీవింకా బతికేవున్నావా? ...మళ్ళీ ఎవరిప్రాణాలు తీద్దామనితల్లీ యిక్కడికొచ్చావు? మేము బాగా బ్రతికిపోతున్నామనుకున్నావా?"

చెంప చెళ్ళుమనేట్లు కొట్టాను, నాకండ్లు తిరుగుతున్నాయి.

"పిచ్చిముండ! చంపుతాను జాగ్రత్త" అడుగులో అడుగు వేసుకుంటూ అతినెమ్మదిగా వెనుదిరిగాను.

  

నేనెంత శ్రమపడ్డాను? ఎంత కలవరపడ్డాను? సుజాతే నన్ను అర్థంచేసుకోలేకపోతే ఈ ప్రపంచంలో నాకిక తావెక్కడ?

ప్రశాంత జీవితం గడపాలనుకున్న నానిర్ణయం ఒక్కసారిగా తల క్రిందులైపోయింది. నా కీ లోకంలో గౌరవంలేదు. నేనందుకై ప్రాకులాడ లేను. పోనుకూడా.

మళ్ళీ నాగదితలుపులు తెరచుకున్నాయి. ఎంతచెడిపోయి, ఎందరిని చెడిపితే అంతమంచిదని చెప్పింది. అంతే. సరాసరి వెళ్ళి రాయల్ హోటలు మెట్లెక్కాను. మూడోఅంతస్తు వ్యాపారం లేదన్నారు. అయితేనేం నా వ్యాపారకేంద్రాన్ని కనుగొన్నాను. అలివేలుకొంపలో నే నిప్పుడు అతిధిని.

అలివేలు అంటే అతిప్రాముఖ్యతగల ఆడది. ఆ చుట్టుప్రక్క ప్రాంతాలలో ఆమె నెరుగని మగవారు బహుశా ఉండరనుకుంటాను. చిన్నస్కేలుమీదైనా పెద్దవ్యాపారం నడుపుతున్నది. పావలాపరకగాళ్ళను గడపదాటే రానివ్వదు. ఒక్కరాత్రికి పాతిక రూపాయలు పెట్టగల 'ప్యాసింజర్లు' మాత్రమే సుఖించగలుగుతారు. పెద్దప్యాసింజర్లు మరీ సిగ్గు పడేవారు-తమ గదికే అతిధిని పంపించమంటే ఏభైరూపాయలకు తక్కువలేకుండా బిల్లుచేస్తుంది.

నేను వెళ్ళగానే 'పనికొస్తావు కూర్చో' అన్నది.

'నేను పగటిపూటకూడా ఇక్కడేవుంటాను. అనుమతిస్తారా?' అడిగాను,

"చూడమ్మాయి! యిక్కడికొచ్చేవారంతా గుమ్మడికాయంత గౌరవం తలక్రింద పెట్టుకొస్తారు. పెద్దమనిషి కానిదే గడపత్రొక్కనివ్వను, అందుకని మనకు పగటివ్యాపారమంతగా ఉండదు."

మరి నా కిక్కడ ఎవరూలేరాయె. ఎలాగు?' అన్నాను.

'పగలుకూడా నాయింట్లోనే వుండదలచుకుంటే పంపిణీలపద్ధతేమీ ఉండదు. కావలసిన తిండీ, గుడ్డ పడేస్తుంటాను. పనిచేస్తుండాలి. నీకిష్టమైతే నాకేమీ అభ్యంతరంలేదు. నాకు పుట్టినబిడ్డలా చూచుకుంటాను.'

వెంటనే నావేషం మారిపోయింది. పరికిణీ, ఓణీ కడుతుంటే నాకే నవ్వువచ్చి ఈతెల్లపాయల మాటేమిటన్నాను. 'చూస్తావుగా' అని ఒక సీసాలోంచి ఇంతరంగుతీసి, తెల్లవెంట్రుకలను నలుపుకుతిప్పింది. చెవులకు అదోరకమైన జూకాలు తగిలించింది. నా ఒంటికి ఏరంగుబావుంటుందో వివిధరకాలైన ఓణీగుడ్డల్ని మార్చి చివరకు నలుపురంగును స్థిర పరచింది.

"నీకు ఏ రంగు యిష్టమైనాసరే రాత్రి కాగానే నలుపు రంగు మాత్రమే ధరించాలి. చెబుతున్నాను. నేనెన్నోసార్లు చెప్పను. ఒకసారి చెప్పానంటే అక్షరాలా అది పాటిస్తుండాలి. తెలిసిందా?" అన్నది.

నాకసలు నలుపురంగే ఇష్టమన్నాను నేను.

"ఒక్క బట్టలలోనే కాదు చెవుతూంట. ఏవిషయమైనా అంతే."

తప్పకుండా గుర్తుంచుకుంటానన్నాను,

"ముందీ వ్యాపారంలో గుర్తించవలసిన మెలికలు కొన్ని వున్నాయి. రకరకాలైన వెధవలూ, త్రాగుబోతులూ వస్తుంటారు. చీరె విప్పమనీ, రవికె తీయమనీ, ఇంకేవేవో సవాలక్ష కోర్కెలు కోరుతుంటారు. వాళ్ళకోర్కెల్ని మనం మన్నించినట్లే మెలగాలి. కానిఆకోర్కెల్ని పూర్తిగా తీర్చకూడదు. తీర్చామా- వారిక నీముఖం చూడరు. మరోదాని కోసం వెతుక్కుంటారు. అసలు తీర్చనన్నా అదీ ప్రమాదమే. కొసరు పెట్టినట్లు గిల్లిగిల్లి రుచి చూపుతుండాలి....చదువుకుచచ్చే కుర్రకుంకలొస్తారు. వాళ్ళతోమాత్రం అతి జాగ్రత్తగా మెలగాలి. వారినెంతో ప్రేమిస్తున్నట్లూ, నీకోసమే జన్మించానన్నట్లూ మురిపించాలి. 'ఇంతకుర్రాడివి! నీకెందు కీపనులు చెప్పు? మేమేదో చెడిపోయాము. నీవైనా హాయిగా పెళ్ళి చేసుకొని నాలుగుకాలాలపాటు జీవించునాయనా!' అని వారిమేలుకోరినట్లు నటించాలి.... మరునాడే పాతికరూపాయలు పట్టుకొని నీముందు హాజరవుతారు. మరో మంచిముండ దొరికేవరకు నిన్ను మరచిపోలేరు."

◆ ◆ ◆

ఆ జీవితమే మరోలోకంవంటిది. ఈ సమాజపు కట్టుబాట్లూ, కాళ్ళ కట్టలూ అక్కడేమీ ఉండవు. ఎవరైనా మాకొక్కటే. మే మందరినీ ప్రేమిస్తాము. మంచీచెడూ, చిన్నాపెద్దా, దరిద్రుడూ ధనికుడూ అన్న భేదాలే మాకు తెలియవు.... మేము పుష్పాలం; మీరు పురుగులు. మేము వాడి రాలిపోతాం; మీరు మరో పూబోడిచెంతకు పోతారు.

పదహారేండ్ల గోపాలుని మొదలు అరవైయేండ్ల రసికునివరకు వివిధరకాలైన విటులు వచ్చేవారు. నేనందరినీ ఒకేరకంగా ప్రేమించే దాన్ని. సుఖాన్ని పొందుదామనేగదా వారువచ్చేది? నావద్ద ఎంతసుఖ ముంటే అంతసుఖాన్ని వారి కప్పగించేదాన్ని. ఎవరిష్టమొచ్చినట్లు వారు ఆడుకునేవారు.

ఒకనాడు ఒక వింత విటు డొచ్చాడు. జేబులో ఐదురూయలే వున్నాయంటే, ఒక్క అరగంటమాత్రమే ఉండి పొమ్మన్నది అవివేలు. నన్ను కోరుకుని, నా గదిలోకొచ్చాడు. చేతిలో సిగరెట్టుపెట్టి, చంకలో లావాంటి పుస్తకం, నోటిలో కాష్టంలా కాలుతున్న సిగరెట్టు; ఇవీ అతని ఆభరణాలు. నేను గడియ వేసివచ్చి మంచంమీద కూర్చున్నాను. ఆ యువక శిరోమణి గడపలోనే నిలబడ్డాడు. వాడి కిచ్చిందే అరగంటకాలం. ఎంతసేపలా నిలబతాడో చూతామని, నేనూ పిలవలేదు. పావుగంట గడ చింది, దిగేసిన మేకల్లే కదలడే! ఏం చేయను? 'ఇప్పటికే రెండున్నర రూపాయల సుఖంపోయింది' అని గుంజి రమ్మన్నాను. ఊహుం.... వాటేసుకుని మంచంమీద పడుకోబెట్టాను.సిగ్గుతో రెండు చేతులా ముఖం కప్పుకుంటున్నాడు. సరేనని దీపం తగ్గించి మంచంక్రింద పెట్టాను. అప్పటికీ కండ్లు తెరవడు. నేనే లాగు గుండీలు విప్పి, అతగాడిచేతులను నా రొమ్ముల కానించుకున్నాను. నపుంసకవెధవ! చలనమైనా లేనిదే నే నేమిటి చేయను? నవ్వి, మూసుకున్న చేతులను బలవంతంగా విడ దీశాను. నా చేతికి చెమ్మ తగిలింది. అతను ఏడుస్తున్నాడు.

'పిచ్చి పిల్లాడా! ఎందుకేడుస్తున్నా?' కండ్లు తుడిచి ముద్దు పెట్టు కున్నాను.

అతను వెక్కి వెక్కి ఏడ్వటం మొదలెట్టాడు. అప్రయత్నంగా నేనూ ఏడుస్తూ అతని కండ్లు తుడుస్తున్నాను. అతగాడూ నా కండ్లు తుడుస్తున్నాడు.

'ఐదు రూపాయలిస్తే శీలాన్ని అమ్మకుంటావుగదూ?'

ఈమాట నా గుండెల్లో తాకింది.

'అవును. నీవు డబ్బిచ్చి నన్ను ఖరీదు చేయడానికేగా వచ్చింది' అన్నాను.

'ఓ తల్లీ! నీ కెంత గతి పట్టిందమ్మా!'

పెల్లుబికిన ఏడ్పు ఇల్లంతా వ్యాపించింది.

వీ డెవడో కవిగాడై వుంటాడనుకున్నాను. బయట అలివేలు తలుపు కొడుతున్నది బయటికి గమ్మని. తీస్తాను లెమ్మని సమాధానం చెప్పి తిరిగి కవితో మాటాడాను.

'మమ్మల్ని గురించి విచారపడుతున్నావా కవీ! కవిత్వం వ్రాసుకుని, కన్నీరు కార్పించడానికి కథావస్తువుగా మేము పనికి వస్తాము. నిజంగా మాపై కరుణవుంటే, ఒక వ్యభిచారిణిని చేబట్టి ఉద్ధరించరాదూ? అది మాత్రం పనికిరాదేం? మా శీల మింతగొప్ప. మా మానమింత ఎత్తు. అని పద్యాలల్లుతారుగాని సహచరిణిగామాత్రం వ్యభిచారిణి తగదేం?....మీ పేరుకోసం మమ్ముల్ని వాడుకుంటారు. నంగనాచిలా ఏడ్చి జనాన్ని ఏడ్పిస్తారు. మీ కవులు వట్టి అబద్ధాలపుట్టలు. మీరేగాదు. ఈ ప్రపంచంలో పుట్టి పెరిగిన వాడెవ్వడూ మమ్మల్ని గౌరవించడు' అని ఏడ్చాను.

'నిజమే, కవులు నిష్ట దరిద్రులు. కవిత్వానికీ, దరిద్రానికీ వున్న సంబంధమే అది. నే నిప్పుడు నిన్ను స్వీకరిస్తాననుకో. నిన్ను సాకే దెలా? నేను బ్రతకడమే దుర్లభమైనప్పుడు మరొక బ్రతుకు నెలా మోయగలను?'

'నీ బ్రతుకు సైతం నేను భరిస్తాను. నన్ను స్వీకరిస్తావా? ఆ ధైర్యం నీ కున్నదా మరి?' గట్టిగా అడిగాను.

'ఒకరి క్రింద నేను భరించబడలేను. కవి స్వేచ్ఛామానిసి. అతను ఎవరి అదుపాజ్ఞలలోనూ వుండలేడు.... నా కా శక్తి వచ్చినపుడు తప్పక నిన్ను స్వీకరిస్తాను. గుర్తుంచుకో, వాగ్దానం చేస్తున్నాను.'

'మాసికమ్మ సమర్తాడటం ఎంతనిజమో, కవికి శక్తిరావడం అంత నిజం. ఎందుకు మాటలు చెప్పి మోస పుచ్చుతావు కవీ! నాకా దమ్ములు లేవనరాదూ?.... మీ రొట్టి ఏడ్పుకుండలు. మీరు ఏడ్వటానికి తప్ప మరెందుకూ పనికిరారు. 'పో, బయటికి పో దద్దమ్మా!'

అన్నానోలేదో తలుపుతోసుకుని విసురుగా అతను వెళ్ళిపోయాడు.

అతను పోయాకమాత్రం 'పాపం! ఐదురూపాయలు దండుగ పడ్డాడు' అని చాలా విచారించాను.

* * *

అలివేలు కొంపలో రోజులు గడిచిపోతున్నాయి. సాయంత్ర మయ్యేసరికి సింగారించుకోడం, వచ్చినవాడే దక్కినమొగుడని అచ్చొత్తినవలపు గుమ్మరించడం జరిగిపోతున్నది.

అలివేలొకనాడు సభతీర్చి నన్ను పిలిపించింది. అలా పిలిపించిందంటే కొంపలుమునిగే నేరమేదో మనవల్ల జరిగిందనీ, పెద్దఎత్తున శిక్ష చెపుతుందనీ మా చెలులకందరికీ భయం. కొంచెం అనుమానంగానే అడుగులో అడుగువేస్తూ అలివేలు గదిలో కాలుపెట్టాను. నన్ను చూడగానే సభికులంతా మాటలుమాని నిశ్శబ్దం దాల్చారు.

"ఇటొచ్చి నా కుర్చీలో కూర్చో" ప్రేమ ఉట్టిపడేలా పలికింది అలివేలు.

"ఫర్వాలేదు కూర్చో" అని కల్పించుకున్నాడు మీసాలవాడు. వా డొకటి, రెండు పర్యాయాలు అలివేలు కొంపలో నా ప్రేమకు పాత్రుడైనాడు.

సరే, కొంచెం సిగ్గు నభినయిస్తూ దాదాపు అలివేలు ఒడిలోనే కూర్చున్నాను.

కొత్తమనిషి, ఐదోపడిదాటిన పెద్దమనిషి. నన్ను వారికే చూస్తూ కుర్చీ కంటిపెట్టుకుని కూర్చున్నాడు,

"చూడండి. పిల్ల బంగారం!" అన్నది అలివేలు, నాచెంపకు జారిన జుట్టు సవరిస్తూ.

మీసాలవాడు నవ్వుతూ, సన్నగా కన్నుగీటాడు.

"ఈవిత్తనం పడిందంటే మీవంశం రాజవంశ మవుతుంది." అలివేలు పలికిన ఈ అతిశయోక్తి నాకప్పుడు అంతుపట్టలేదు.

"చూడమ్మాయి! వీరు కాంతయ్యగారని మోతుబరీ ఆసాములు. నిన్ను వలచి, ఇంటిదాన్నిగా చేసుకోవాలని కుతూహల పడుతున్నారు.... ఏమంటావు మరి?"

ఇదేదోకుట్ర. నాపై నేదో కుట్రపన్నుతున్నారని నాకప్పుడేఅనిపించింది, అనుమానం, భయం నన్నావహించాయి.

"ఏమిటి మీ రనేది?"

అలివేలు గట్టిగా నన్నుపట్టుకుని స్థిమితపరచాలని ప్రయత్నిస్తున్నది. మధ్యవర్తిగావచ్చిన మీసాలవాడులేచి మాటలుపెట్టాడు.

"చంద్రకాంతా! (అలివేలు నాకుపెట్టిన సరికొత్తపేరు) నీపంట పండింది. పూర్వజన్మలో ఏనోము నోచుకున్నావో గరిటోయిన కాంతయ్యగారి సతీమణి వవుతున్నావు. కాంతయ్యగారంటే ఏమిటి? మాటలా? ఎంతమంది కాంతామణులొచ్చి కాళ్ళమీదపడ్డా కళ్ళతో చూస్తాడా? ఎవరికి దొరుకుతుందా భాగ్యం?.... నేనే ఆడదాన్నయివుంటేఅసలు నీదాకా రానిచ్చేవాడ్నా? ఏమంటావు అలివేలూ! కాంతయ్యగారూ!" అని పెద్దగా నవ్వాడు. ఇద్దరూ ఆ నవ్వులో నవ్వు కలిపారు.

ఆ నవ్వులోని కర్కశమేనాడో నరకమనిపించింది. ఆ నరకంలో ఉండలేక పారిపోదామని ప్రయత్నించాను,. కాని అంగుళం మేరకైనా అలివేలు నన్ను కదలనివ్వలేదు.

"ఏమిటీ బలవంతం? నాకు మొగుడ్ని కుదర్చటానికి నువ్వెవరు?" అన్నాను.

అలివేలు తన కోపమంతా నారెక్కపై చూపెట్టింది.

"మేమేమీ కాకపోతే ఇన్నాళ్ళబట్టి ఎందుకున్నా విక్కడ?"

ఈ ప్రశ్నకు సమాధానం నాకు దొరకలేదు.

"వెళ్ళిపొమ్మంటే తక్షణం వెళ్ళిపోతాను" అని మాత్రం అనగలిగాను.

అలివేలు కోపం కళ్ళకెక్కి నెత్తురు జీరకడుతున్నది. మీసాలవాడు అనునయంగా మాటాడుతూ నన్ను కూర్చోబెట్టాడు.

"చూడు చంద్రకాంతా!...."

"కాదు పదవోయ్. ఇప్పుడుకాదు....మళ్ళీ కలుసుకుంటాం అలివేలూ" అంటూ కొత్తమనిషిలేచి తలపాగా నెత్తినబెట్టుకుంటూ గడప దాటాడు.

తెల్లమొహంవేసిన అలివేలూ, మీసాలవాడూ గాలిలో తేలిపోతున్నట్లు ఆయన్ననుసరించారు.

  

ఆ రోజంతా అలివేలు నన్ను మాటాడించలేదు. అదృష్టవశాత్తు రసికప్రపంచ మా రాత్రి నిద్రమునిగిందేమో విటులెవ్వరూ హాజరు కాలేదు. స్నానమన్నా చేయకుండా శవంవలె నేను నాగదిలో పడుకున్నాను. భోజనానికి లేవమంటున్నారని పిలిచినా లేవలేదు.

అప్పుడే పదకొండు కొట్టింది. గంటలశబ్ద మాగిపోగానే నాగది తలుపు కొడుతున్నట్లు శబ్దమైంది. నేను పట్టించుకోలేదు.

"చంద్రకాంతా? చంద్రకాంతా!"

భారంగా తలుపు తెరిచాను. అలివేలు! చేతిలో అన్నంపళ్ళెమున్నది. అప్పుడే కాగపెట్టిన నేతిగిన్నె కాలిపోతుంటే, ఊదుకుంటూ చేయిమార్చుకుంటూ తిప్పలుపడుతున్నది శశిరేఖ.

"నేతి గిన్నక్కడ పెట్టి నువ్వు వెళ్ళు" అలివేలు ఆజ్ఞానుసారం తలుపు ఓరలాగి వెళ్ళిపోయింది శశిరేఖ.

"చేసుకోకపోతే చేసుకోకపోయావు గాని తిండిమానేయడ మెందుకు?....లే, సరిగాకూర్చో. నీమూలాన నేనుగూడా తినలేదు—రా, ఇద్దరం కూచుని తిందాము."

మొదటిముద్ద తనచేతితోనే నానోటిలో కుక్కింది. ఇద్దరం ఒకే కంచంలో పకోడీలు నంజుకుంటూ మంచం భోజనం చేశాము.

ఆ విషయమై తిరిగి ప్రస్తావిస్తుందనుకున్నా గాని, అలివేలు మరచిపోయినట్లే ప్రవర్తించింది.

'ఒళ్ళునొప్పులుగావుంటే, లేచి వేన్నీళ్ళ స్నానంచేయి. నొప్పులు సర్దుకుంటాయి."

"లేదు. అన్నం తిన్న తరువాత స్నానం చేసే అలవాటు లేదు" అన్నాను,

"అయితే రెండురోజులపాటు విశ్రాంతి తీసుకో. నేను ఒకోమాటు చెప్పేమనిషిని. ఆగడం నా దగ్గర కుదరదు," అంటూ లైటు ఆర్పి, తలుపు గొళ్ళెం పెట్టి మరీ వెళ్ళిపోయింది అలివేలు.

ఆ చీకటిలో పడుకుని ఏమేమో యోచించాను. రాత్రంతా కంటి మీద కునుకుపడితే ఒట్టు. తెల్లవారేవరకల్లా జ్వరంపట్టుకుంది.

'నాకు తెలుసు. చేతులారా నీ చావు నువ్వు తెచ్చుకుంటావు. చెపితే వింటేనా?" అంటూ అదిలిస్తూ అలివేలు నాకు సపర్యలుచేసింది. శశిరేఖను మంచందగ్గరే కావలిపెట్టింది. మధ్యాహ్నం ఇంటి కాంపౌండరు వచ్చి సూదిపొడిచి పోయాడు. ఏరుతీసినట్లు సాయంత్రానికల్లా జ్వరం చప్పునతీసింది. కాని బడలిక మాత్రం వదలలేదు. బత్తాయితొనలు చీకుతూ ముప్పొద్దులు మంచంమీదనే గడిపాను.

"ఒక్కనాటికే ఎంత తగ్గావే అమ్మా?" అని బుగ్గలునొక్కుకుంది అలివేలు.

"ఎంతతొందరలో తగ్గితే అంత తొందరగా ఎక్కొస్తారట" తనకు తెలిసిన శాస్త్రమంతా చెప్పింది శశిరేఖ.

నిజంగా మరునాటికే గుంటలుపట్టిన కళ్ళు కొంచెం గట్టెక్కి నిల బడ్డాయి. జ్వరమెలావున్నదంటూ మీసాలవాడువచ్చి నన్ను మాటాడించ కుండానే చూసి చక్కాపోయాడు, అంటే కాంతయ్యగారింకా నా ఆశ వదలుకో లేదన్నమాట!



"అమ్మాయిని నువ్వెరగవు. అందంలో నీకు తీసిపోనట్లుగా వుం టుంది. ఇక్కడుంటే – మనంచేస్తున్న వృత్తిచూసి చిన్నబోతుందనీ, నాలాగే చెడిపోతుందనీ మదనపల్లి పంపించి చదివిస్తున్నాను. చిన్నతనానే మంచి అలవాట్లతో పెంచి, నాలుగు అక్షరం ముక్కలు చెప్పిస్తే అదయినా బాగుపడుతుందేమోనని ఆశ.... మన కర్మమెలాగో కాలిపోయింది. మన బిడ్డలకు గూడా ఈ గతెందుకుపట్టాలి భగవంతుడా అనే నా బాధ. నిజంగా దేవుడనేవాడుంటే నాబిడ్డను రక్షిస్తాడు" అంటూ అలివేలు తన కథావృ త్తాంతాన్ని కన్నీటితో రంగరిస్తున్నది. నేనలాగే గోడకు చేరబడి వింటు న్నాను.

"ఆ పసికందుకోసమే నేనీ పడుపువృత్తి చేపట్టాను. అది మూణ్ణె ర్థం పిల్లగా దోగాడుతున్నప్పుడు తండ్రి పోయాడు. రెక్కాడితేగాని డొక్కాడని సంసారాలు, చెట్టుమొదలే కూలిపోతే ఇక పక్షి లెక్కడుం దేను? నా పుట్టింటివారుకూడా కండ్లచూడలేదు. ఏ బస్తీకో పోతే కూలి నాలి చేసుకుని, కనీసం బిచ్చమెత్తుకునైనా బిడ్డను పోషించుకోవచ్చని- ఇటొచ్చి పడ్డాను. ఇంత పట్నమున్నదే కాని ఒక్క ఆడదానికి ఆదరవు దొరకలేదు.... చూస్తూ చూస్తూ ఏ తల్లి తన కన్న బిడ్డను ఆకలికి ఒప్ప గించి వూరుకుంటుంది?.... లేదు. పడుపు వృత్తి చేసయినా సరే బిడ్డను కాపాడకోవాలని నేనీ రూపంలోకి దిగిపోయాను. నీవు చూస్తూనే వున్నా వుగా అమ్మా! ఈ వృత్తిలోని సుఖం, సౌందర్యం నీవు అనుభవిస్తూనే వున్నావుగా? కానీచేయని వెధవకూడా మనపై కారాలు మిరియాలు నూరతాడు. మనం మనుషులం కానట్టూ, మానాభిమానాలు మనకు లేనట్టూ రోసేసిన ముండలని మన ముఖాన్నే తిట్టిపోతారు. బిచ్చగత్తె

కయినా కాస్తంత గౌరవమున్నదిగాని, పడుపుగత్తెకన్నా హీనం ప్రపంచంలో లేదు. చెప్పకూడదుగాని అనుభవంలోనే ఇద్దరు పండంటి పిల్లలు కుష్టు తగిలి, కళ్ళుపోయి ఎంత నీచంగా చచ్చిపోయారో నేను చెప్పలేను.'

'ఎవరు చెప్పమన్నారు? ఎవరికి తెలియని సొద గనుక' అని కళ్ళ నీళ్ళు తిరుగుతున్నా పెడసరంగానే మాటాడాను.

'అడక్కపోయినా ఎందుకో నీకు చెప్పాలనిపిస్తున్నది.... నామాట వినమ్మా చంద్రకాంతా! బిడ్డలాంటి దానివని చెవుతున్నా. ఈ నరకంలోంచి బయట పడమ్మా' అన్నది అలివేలు.

'అంటే కాంతయ్యగారితో బొమ్మని ఒక్కముక్క చెప్పేందుకు బదులు ఈ చరిత్రనంతా వెళ్ళబోశావన్నమాట?'

'అవును. నువ్వు చెడిపోతే చూడలేను.'

'ఆ మాటలోని నైర్మల్యం, ఆశబ్దంలోని గంభీరతా నన్ను లొంగదీస్తాయేమో నన్నంత కంపింపచేశాయి. కాని ఎదురు తిరిగాను.

'చెడిపోవాలనే నీ గడప తొక్కాను అలివేలూ! నాశనం కావాలనే నిండుహృదయంతో కోరుకుంటున్నాను.'నాకు తెలియకుండానే పిచ్చెక్కిన దానిలా పండ్లు కొరికాను. కండ్లనుంచి బొటబొట రాలుతున్న కన్నీరు మోకాళ్ళమీదపడి జారిపోతున్నది.

'సుఖించాలనే కోర్కె నాకులేదు, కోర్కె లేనాడో నాకు గోరీ కట్టిపోయాయి. నేనిప్పుడు నాశనకారిని. నాశనాన్నే నేను కోరుతున్నాను.'

'నిన్ను నాశనం కానివ్వను. కాళ్ళూ చేతులూ కట్టి కాంతయ్య ఇంట్లో విడిచి వస్తాను. నేను ఒకే మాట మాట్లాడే మనిషిని.'

'అయితే క్షణం నీ యిల్లు విడిచిపోతున్నాను.'

'ఎక్కడికి నువ్వుపోయేది? ఒసేయ్ చామంతీ, శశిరేఖా, శూర్పణఖా – ఇది పారిపోతున్నదే! పట్టి గదిలో వేయండి. రండీ రండి!'

*   *   *

అలివేలు కా స్వాతంత్ర్యం ఎవరిచ్చారో, నాపై తనకన్ని హక్కు భుక్తాలున్నట్లు నిజంగానే నన్ను బంధించింది. అనవాయితీగా వారానికో మారు నా కోసం వచ్చే కుర్రాడితో - నాకు పిచ్చెక్కిందనీ, అందరినీ కరుస్తున్నదనీ చెప్పిపంపించడం చెవులారా విన్నాను. తలుపు బ్రద్దలుగొట్టి గోలచేస్తే పిచ్చి యధార్థరూపం దాల్చుతున్నదేమో నన్న భయంతో చెప్పు క్రింద తేలులా పడున్నాను.

ఆరాత్రి బాగా ప్రొద్దుపోయిన తరువాత నా గదితలుపులు తెరచుకున్నాయి. అన్నం పళ్లెముతో అలివేలు హాజరవుతున్నదని కళ్ళుమూసుకునే తిరిగి ఆ వైపుకు ఒత్తిగలి పడుకున్నాను. గది తలుపులు మళ్ళీ మూసుకున్నాయి. కోపమొచ్చి అలివేలు వెళ్ళిపోయిందేమోనని కళ్ళు విప్పాను. కాంతయ్యగారు ప్రత్యక్షమైనారు. తదేకతతో నన్ను చూస్తూ నిలబడివున్నారు. ఆయనగా నిలబడివుంటే నేను పడుకోలేక పోయాను. మనిషిలో ఏమీలేదుగాని, ఆ కండ్లలో అదోరకమైన ఆకర్షణ వున్నది. నే నలాగే ఆ కండ్లవంక చూస్తూ, లేచి బొమ్మవలె నిలబడ్డాను. ఆయనా మాటాడడు; నేనూ మాటాడించలేక పోయాను. ఉభయులం ఒక గజం దూరంలో ఎదురు బళ్ళా నిలబడ్డాము. మా యిద్దరిమధ్య గాలికూడా ఉక్కిరి బిక్కి రవుతున్నది.

కాంతయ్యగా రిక సహించ లేకపోయ్యారేమో తలపాగా చేతికి తీసుకుంటూ, 'కూచుందామా' అన్నారు. లైటు వెలుతురులో బట్టతల, పండిన బొప్పాయి గుండులా మెరుస్తున్నది.

నే నేమీ జవాబివ్వలేదు. కాంతయ్యగారు కూర్చోబోతూ మంచం మీద బట్టలుచూసి 'అలివేలూ' అని కేకపెట్టాడు. సమాధానం రాకపోయే సరికి తనే తలుపు తెరుచుకుని అలివేలుకోసం పోయాడు.

అలివేలు ఆతురత పడుతూ పక్కబట్టలు మార్చింది.

'లైటు ఆరిపోయింది. కాంతయ్యగారి చుట్టమాత్రం కొరివిలా మా కనుపాపల పడుతున్నది.

'రావా నా దగ్గరికి?.... నే నేం పాపంచేశాను కాంతా? ....రావా?'

వెళ్ళి ప్రక్కనే కూర్చున్నాను.

'నే నంటే నీ కిష్టంలేదు కదూ? ముసలి వాడ్ననేనా?'

'నా పైని మీ కింత మక్కువ దేనికో అర్థం కావడంలేదు. నే నేం దేవతనా? దేవ కన్నెనా? సంసారిని కూడా కానే? చెడిపోయిన సాని ముండపై మీకింత మోజుదేనికి?'

'కాదు కాంతా! నిన్ను చూడగానే ఏదో మంత్రమేసినట్టు....' నోట్లోని చుట్టరసం మాటాడ నివ్వలేదేమో తుపుక్కున ఉమ్మి, 'చూడ గానే నీపై కోరిక కలిగింది కాంతా!' అని పూర్తి చేశాడు.

నా వద్ద ఏ మంత్ర శక్తులూ లేవు. ఉన్న అందం కూడా ఏనాడో ఊడ్చుకు పోయింది. ఇక నాలోని ఏ శక్తి ఆయన్ను కట్టివేసిందో తెలి యదు.

'మీరు లక్ష్మీ పుత్రులు. కావాలంటే కొండమీది కోతిని దించ గలరు. ఇంత ప్రపంచముండగా నిర్భాగ్యురాలనూ, వేశ్యనూ నేనే దొరి కానా మీకు?' అన్నాను.

కాంతయ్యగారు కాస్తంత నవ్వారు.

'తా మునిగింది గంగ - వలచింది రంభ అన్నారు కాంతా!'

'ఏమిటి? మీరు నన్ను వలచారా?'

'కాకుంటే ఈ దరిద్రపు కొంపలో ఈ పడి గాపులన్నీ దేనికి చెప్పు?'

'మీకూ నాకూ - మన యిద్దరికీ ఇది న్యాయంకాదు కాంతయ్య గారూ! మీరు అడగనూరాదు; నేను అంగీకరించనూరాదు,' అంటూ లేచి లైటు వెలిగించాను.

అన్నిటినీ గోల్పోయి, నిస్పృహాయుడై కునుకుతూ కూర్చున్న రోగిష్టి వానివలె కనబడ్డారు కాంతయ్యగారు, ముఖం వెల వెలపోయింది. రంగుతేలిన బట్టతలమాత్రం బంకమన్ను దీపివలె వెలుగును ప్రతిబింబి స్తున్నది.

'నీవు ఒప్పుకోకపోతే ఇంటికికూడా పోనుకాంతా! ఇక్కడే నీతో పాటే వుంటా.' ముసలాడికే యింతపైత్యముంటే వయసులోవున్న మిడిసిపాటు రాయళ్ళు ఇంకెంతేసి మోసపుమాటలు చెప్పగలరో ఊహిస్తున్నాను. ఒకవైపు నవ్వూ, మరొకవైపు అసహ్యంగూడా వేస్తున్నది.

'అయితే ఇంతకూ ఏమిటి మీ రనేది?'

కాంతయ్యగారు నా చేయి పుచ్చుకున్నారు.

'కోపం తగ్గించుకో కాంతా!'

"సంధిమాటలు తరువాత. అసలువిషయం చెప్పండి." అన్నాను.

"కోపమొస్తే నే చెప్పలేను."

"నాకేమీ కోపంలేదు."

ఉభయులం రెండునిముషాలకాలం చేదు మ్రింగాము.

"కాంతా! తినా కుడువా కావలసినంత ఐశ్వర్యమున్నది. మహారాణిలా కాలం వెళ్ళబుచ్చవచ్చు. తప్పో, వొప్పో భగవాసులు నానోటివెంట పలికిస్తున్నాడు. ఏదిచేసినా భగవాన్లు మనమేలుకే చేస్తాడు....నా మాటవిని నాతోరా. ఇద్దరం హాయిగా కాలక్షేపం చేద్దాము. నీకెప్పుడు ఇష్టంలేకపోతే- కష్టం కలిగిందనుకుంటే-అప్పుడు వెళ్ళిపోవుదువుగాని. నేనేమీ నిన్ను బలవంతపెట్టను....ఇకనైనా ఒప్పుకోకాంతా! ఒప్పుకోవా? అవునను."

"అవును. ఉదయమేలేచి మనవూరు వెడదాం" అంటూ చీకటి నాహ్వానించాను.

* * *

వారం వర్జం చూసి, శుభశకునానికై ఒక ఇల్లాలిని ఎదురు నడిపించగా, బక్కచిక్కిన మా గుర్రబ్బండి బహుకష్టంగా కదిలింది. అలివేలు శశిరేఖ, శూర్పణఖ ఇత్యాదులు పదిగజాలు నడచి మే ముంటామంటే

మేముంటా మన్నారు. అప్పటికే విసిగిపోయిన కాంతయ్యగారు "అబ్బీ! బండికి పరదాకట్టు" అన్నారు. బండివాడు మమ్మల్ని కొంచెం లెమ్మని, మెత్తకోసం బండిలోపరచిన గడ్డిపై గుడ్డలాగి వెనుకతట్టున బిగించాడు.

"పదవే నీగుర్రం గుగ్గిళ్ళు తిన." యజమాని అతిశయోక్తికి నవ్వొచ్చినట్లు బక్కగుర్రం మోరెత్తి సకిలించింది.

"ఏమిటీ ఘోషా, గాలి రాకుండా" అన్నాను కాంతయ్యగారితో.

"కావల్సింటే ఊరుదాటంగానే తీసుకుందువు" అన్నారే గాని తిరిగి తనవూరి పొలిమేరల్లోనే బండినాపి, పకడ్బందీగా మళ్ళీ పరదా కట్టించారు.

నాకు నవ్వొచ్చి "తింటే లేదుగాని తేపితే భయమట" అని ఘోషాలోనే కాంతయ్యగారి బుగ్గన పొడిచాను.

ముసలాడీ సరసానికి చలిపెట్టి 'ఊర్కో' బండివాడిని అదలించాడు.

'అయితే మీవూరికీ, మావూరికీ అట్టే దూరం లేదన్నమాట? ఒక్క గంటలోనే వచ్చేశామే?" అనగానే బండివా డందుకుని "తరాటొచ్చిం దమ్మగారు బండి" అన్నాడు.

"ఇస్, ఇకేమీ మాట్లాడబోకు—ఏమోయ్! ఆపవోయ్ బండి."

కోటలాంటి ఒక దివ్యభవనం ముందు-బండి ఆగింది. పరదాతీయక ముందే పిల్లలు చుట్టుముట్టారు

కాంతయ్యగారు దిగలేక దిగుతూ "ముదనష్టపు గుంపు, ఏముందిరా యిక్కడ? ఎందుకొచ్చార్రా? పొండి పొండి" అంటున్నాడు.

"వారం రోజుల క్రిందటనే
ఆరవ రాణీ పోయింది
పొలిమేరలు దాటిందో లేదో
ఏడవరాణీ వచ్చేసింది
పదరా పదరా పోదాం పదరా"

అని పిల్లలంతా చప్పట్లు కొడుతూ పాడుతున్నారు. కాంతయ్యగారు చేతికందిన వాడినల్లా చరిచాడు.

పిల్లలంతా లగూతీసి దగ్గర్లోవున్న పెద్దమర్రి నెక్కారు.

పాటలోని భావం నాకు బోధపడలేదు. ఆరవరాణి పోవడమేమిటి? ఏడవరాణి వేంచేయడమేమిటి?

మీసాలవాడు గేటుతెరచి బండి లోనికి తీసుకురమ్మన్నాడు. నేను దిగబోయాను. కాని కాంతయ్యగారు కళ్లెర్రచేసి "కూచో అక్కడే— పదవోయ్. బండి లోనికిపోనివ్వు" అని పిల్లలమీద కాక మామీద చూపెట్టారు.

కోట ఆవరణలో బండి ప్రవేశించగానే ప్రహరీగేటు తిరిగి మూసుకున్నది. మీసాలవాడు నవ్వుతో నాచేయిపట్టుకుని దించాడు.

గొడ్లచావడిలోంచి ఒక ముసలమ్మ కర్ర పోటేసుకుంటూ వచ్చి "ఒరేయ్ చిన్నోడా" అన్నది.

"ఏందే? నువ్వు లేసొచ్చావెందుకు?" అన్నారు కాంతయ్యగారు.

"ఈ ఏడోదానికైనా ఇంతనలుసు కలిగేనంటావా?"

"అందుకేగా ఈ బడవలన్నీ. నువ్వు పోయిపండుకో" అన్నాడు మీసాలవాడు.

"ఏదీ? దాన్నొకమాటు నాకు చూయించు—ఇటుతే. కొంచెం చూస్తాను" అని ఒకకర్ర ముందుకువేసింది.

"గుడ్డిముండవి నువ్వు చూసేదేమిటే? బాగానే ఉందిలే—పదండోయ్ మీరు" అన్నారు కాంతయ్యగారు.

"అందుకనేరా నీకు పిల్లలు పుట్టంది. ఎన్నినోములు నోస్తేనేమిరా తల్లిని చూడకపోయినాక. పో గొడ్డుమోతు ముండాకొడకా! లచ్చలు తలకిందపెట్టుకు చద్దువుగానిలే" పుసులుగట్టిన కండ్లనుంచి రెండుమూడు కన్నీటిచుక్క లొలికాయి. కర్రపోటేసుకుంటూ ముసలమ్మ వెనుతిరిగింది.

నేను రివ్వునపోయి ఎదురుగా నిలబడ్డాను.

"చూస్తావా అమ్మా! నేనే కొత్తకోడల్ని."

ముసలమ్మ వణికిపోతున్నది. కన్నీరు మరీ ఉధృతమైంది.

"చూట్టానికి కళ్ళుండేగా తల్లీ! పరాయిదానివి నువ్వయినా కాస్తంత దయగా పలకరించావుగాని – కన్నకొడుకు–వాడికాబుద్ధున్నదేమో చూడు. తల్లిని పురుగును తీసేసినట్టు తీసేస్తాడు!" కుడ్ర చేయిమార్చుకుని కళ్లొత్తుకున్నది.

"నే నొచ్చాగా నీమాటప్రకారం" అన్నాను నేను.

కండ్లు కనుపించని కారణంగా వణకుతున్న చేతులతో నాశిరస్సు పట్టిచూసింది. ఆనవాలు తీసుకున్నట్లు ముక్కూముఖం తడివి ముద్దుపెట్టుకున్నది.

"కాంతా! ముసలిదానికి మతిపోయిందనుకుంటే—"

"ఊరుకోండి. చాలా తెలివిగలవారు."

"తెలివితేటల్ని గురించి తీరిగ్గాకూచుని తేల్చుకోవచ్చుగాని ముందు ఇంట్లో అడుగుపెట్టండి. తరువాత ఏవో విషఘడియ లొస్తాయట. పెద్దక్కయ్య కనిపెట్టుకునివుంది."

మీసాలవాడి మాటప్రకారం శుభఘడియల్లోనే కుడిపాదంతో గడప దాటాము.

  

ప్రత్యేకించబడిన నాగది శోభాయమానంగాఉంది. మేడంత మంచం. చిన్నపిల్లవలె పట్టుపరుపుమీదపడి దొర్లాను.... ఆనాడు రైలుప్రయాణం చేస్తూ సూర్యాస్తమానం చూస్తున్నప్పుడు ఎన్ని తలంపు లొచ్చాయో, ఇప్పుడన్ని ఆలోచనలు మొలుస్తున్నాయి.

ఏమిటీ జీవిత నాటకం? ఎక్కడమునుగుతున్నాం? ఎక్కడ తేలుతున్నాం? ఈ మహాయాత్రలో ఎందరు కలుస్తున్నారు? ఎందరు విడి

పోతున్నారు? బాగా బ్రతుకుదామని కోరుకున్నప్పుడు ఏదో అవాంతరం కాళ్ళకు చుట్టుకోవడమేమిటి? కోర్కెలు సడలి చీకటిలో కలిసిపోదామనుకున్నప్పుడు ఈ కాంతిరేఖలేమిటి?....ఇలా కాంతయ్యగారు కలుస్తారనీ, ఇక్కడో కోటలాంటి దివ్యభవనం నా కోసం కట్టబడిందనీ ఎన్నడైనా కలగన్నానా? ఊహించనైనా లేమే? ఏమిటిదంతా? ఏమిటి భగవాన్!

ఎవరో నా గదిలోకొచ్చిన చప్పుడైంది. నేను మైకంలోనే కళ్ళు విప్పిచూశాను. కొంచెం కిష్టాయిని గుంజకు కట్టివేసి చల్ల చేస్తున్న యశోదమ్మ నా కళ్ళకు కట్టింది. పూజామంటపంలో వుండలేక విసుగెత్తిపోయి వస్తున్నట్లు అతి మందంగా నడచి వస్తున్నది. చూస్తున్నానేగాని పక్కమీదినుంచి నేను లేవలేకపోయాను.

'ప్రయాణపు బడలిక తీర్చుకుంటున్నావా?' ఎంత మధురంగా అన్నదా మాట. నేను లేచి కూర్చున్నాను. ఆమెకూడా నా ప్రక్కనే కూర్చున్నది.

'నేనెవరో గ్రహించేవుంటా వనుకుంటా.'

'యశోదమ్మవు కదూ?'

'అవును. యశోదమ్మనే....అయితే మా కథ యావత్తు వినేవచ్చావన్నమాట?'

నేనింకా మైకంనుంచి పూర్తిగా విడివడలేదు. అందువల్ల నవ్వి ఊరుకున్నాను.

'అదమ్మా కథ, నువ్వు ఏదోదానివి. నువ్వయినా ఒక నలుసును కంటే. ఈ యింటి కిక కోడళ్ళరాక కట్టిపోతుంది.'

ఈ పలుకుతో నాకు మెలకువ వచ్చింది. నిద్రనుంచి లేచిన పక్షివలె కనురెప్పలు తపతప కొట్టుకున్నాయి. చప్పున పిల్లలుపాడిన పాట గుర్తుకొచ్చింది.

'ఆరవనాణి ఎప్పుడు పోయిందన్నారు?' ప్రశ్నించాను.

'అది పోయినాకేగదా ఏడవరాణి ప్రయత్నం' అతి సున్నితంగా నవ్విందామె.

'అయితే ఈ ఏడు నెప్పుడు సాగనంపుతారు?'

'తప్పమ్మా! శుభం పలకాలి.'

'అంటే?'

'వంశాంకురాన్ని కంటా ననాలి.'

'లేకుంటే నేనూ చస్తానా?' అన్నాను.

'అమ్మాయి! నీవు మరీ అశుభా లుచ్చరిస్తున్నావు....చనిపోయే సమస్య ఎందుకొచ్చింది? నీకూ వేలెడంత నలుసు కలగకపోతే, మిగతా ఆరుగురులాగానే యింటికి పోతావు.'

"అనగనగా ఓరాజు
ఆ రాజుకో మహారాణి
పిల్లా పీచూ లేదు
పలు బదవలు పడ్డాగాని"

పిల్లలు వదలకుండా మళ్ళీ చెట్టెక్కి పాడుతున్నారు. మేమున్న గదిలోకి స్పష్టంగా వినిపిస్తుంటే యశోదమ్మలేచి కిటికీ తలుపులు మూసింది. అయినా పాట వినిపిస్తూనేవుంది. ఈ సారి కొత్తపల్లవిలో బుర్రకథ నందుకున్నారు :

"వ॥ అందుకని మహారాజేం చేశాడయ్యా అంటే-
ఏంచేశాడు?

"అయ్యో అయ్యో పిల్లలులేనిదె
వల్లకాడుగద సంసారంబు ॥తందానా॥
ఇల్లువాకిలి, పొలము పుట్రలు
కొల్లగొట్టిన ధనపురాసులు ॥తం॥

ఎవ్వరికిత్తును, ఏమి సేతునని
యోచనచేసిండో-ఓ-ఓ

వ॥ హా రామచంద్రాయని
విలపించిండయ్యో.

వ॥ భళాభళిరా! ఏడ్చి మొత్తుకో లయినాక దొర ఏంచేసిండురా ఒరే! ఏం చేసిండంటే

"పెళ్ళిచేసుకుంట రావే గుమ్మని ॥తం॥
ఏడనుంచొ వొక బొమ్మతెచ్చెరా ॥తం॥
తెచ్చినదానికి సంతులేదు మరి
తరిమికొట్టి నయ్యో-హరిహరి
తన్ని వెడలగొట్టే-హరిహరి
వ॥ ఎంత పాపం చేసిండురా ఒరే పాడుముండావాడు!
"అన్నల్లార తమ్ముల్లార ॥తం॥
విన్నారా మావూరి రాజుకత ॥తం॥
పిల్లలకొరకై పెళ్ళాలెన్నిటి
మార్చినాడొ వినుడీ
వ॥ హా రాఘవేంద్రా! రామచంద్రా హా! అహా!!!

హఠాత్తుగా రాగాలు ఆగిపోయి పిల్లల గగ్గోలు ఎక్కువైంది. చెట్టుపై నుంచి ఒకరిద్దరు పిల్లలు పడిన ధ్వనీ, పెడబొబ్బలూ మిన్ను ముట్టాయి. మహారాజు కథనం మధ్యలోనే యశోదమ్మ నా గది విడిచి పోయింది. నేను కిటికీ తలుపులు తెరచిచూశాను. మీసాలవాడు పసిబిడ్డల వేటాడుతున్నాడు.

* * *

స్వామీ? ఏమిటీ కార్యకారణ సంబంధాలు? ఒకప్పుడు మనసారా మాతృస్థానాన్ని కోరుకుంటే నన్ను శిక్షించావు. ఇప్పుడా స్థానాన్నలంక

రించకుంటే శిక్షిస్తానంటున్నావు. అదే కార్య మప్పుడు పాపమేమి? ఇప్పుడు పున్నెమేమి? ఒకే కార్యానికి ఇన్ని వింతరంగులేల పెట్టావు తండ్రీ!

ఆ రాత్రే పడకటింటిలో కాంతయ్యాగారితో ప్రస్తావించాను.

'ఏమండీ! మీ వంశాంకురం కోసంగాను నన్ను తెచ్చారన్న మాట! నాతో మీ ఈప్సితం ఈడేరకపోతే?....నన్నూ బయటికిపంపి మరోదాన్ని తెస్తారు. ఇంకెందరినిలా తేవాలని ప్రయత్నం?'

కాంతయ్యగారు విస్తుబోతూ 'నీ కిదంతా ఎవరు చెప్పారు' అని కోపంతో లేచారు.

'ఈనాడు తెలియకపోయినా రేపయినా తెలియదా కాంతయ్య గారూ! నాకు తెలిసిందని బెంగపడకండి. నాకు తెలిసినంతమాత్రాన మీ కొచ్చిన నష్టమేమీలేదు....చెప్పండి. ఇంకెందరినిలా మార్చుతారు కాంతయ్యగారూ!' అన్నాను.

'ముం దామాట మానేయి కాంతా! పరాయివాళ్ళ పిల్చినట్లు పేరున పిలిస్తే....'

"మీరు సహించలేరు. అయినా నేను పరాయిదాన్నికాక మీస్వంత మెలా అయ్యాను? మీదొడ్లోపుట్టిన గొడ్డును కాదుగా కాంతయ్యగారూ! మీ ఉప్పూ పులుసు తిన్నంతమాత్రాన స్వయానా మీమనిషి నవుతానా?.... మీ జీతగాడు మీరు పెట్టిపోషిస్తున్నంతమాత్రాన – మీ కన్నబిడ్డవుతున్నాడా? వాడా తిండికి పనిచేస్తున్నాడు; మీరా పనికై తిండిపెడున్నారు. అంతేగా మన సంబంధం కూడానూ?'

"ఏమిటో? నువ్వు మాట్లాడే దేమీ నాకసలు అంతుబట్టదు."

'ఏమీలేదు కాంతయ్యగారూ! ఈ యింటిలో నా పాత్ర ఏమిటి? ఈ యింటికి నే నే మవుతాను?'

'నాకు విసుగొస్తున్నది కాంతా! మాట్లాడే దేదో మంచిమాటల్లో, సూటిగా మాట్లాడు.'

'అయితే నన్నెందుకు తెచ్చారని అడుగుతున్నాను.'

దిండుగలీబుకు కుట్టిన పూదారాలు లాగుతూ నోట పెట్టుకుంటాడే గాని మాటాడడు.

'స్వామీ! చక్కగా వున్నదాన్ని-ఎందుకు చెడగొట్టేస్తారుగాని, నావైపుకు తిరిగి మాటాడండి. నన్ను ఎన్నాళ్ళు ఉంచుకుంటారు?'

"ఏమిటి కాంతా నువ్వంటున్నది? నిన్ను వదిలిపెడతాననా? నా బొందిలో వూపిరుండగా జరిగేపనేనా అది?"

"ఇలాంటి తేనెసోనలు సానిముండలు చాలా వినుంటారని కాంతయ్యగారికి మనవి చేస్తున్నాను."

"నేనూ అందరిలాంటి వెధవనే ననుకున్నావా?"

"కాకుంటే ఇంకోపొగ మందం."

'కాంతా!' అంటూ ఉరిమి మంచం దిగి నిలబడ్డాడు. బట్టతల నొక మారు తడివి చూసుకుని ఒక్క నిముషం కళ్లుమూశాడు.

"కాంతా! నేను నువ్వనుకున్నంత వెధవనుకాను. నా మాటపై నమ్మకముంటే నమ్ము....భగవాన్లు నన్నెందుకో నిన్నెల్లకాలం ఉంచుకో మంటున్నాడు. నిజం."

"ఇప్పుడలా చెప్పిన భగవాన్లు రేపువదిలేయమని చెప్పొచ్చుగా? నమ్మకమేముంది?"

"అనడు. నా భగవాన్లు ఎన్నటికీ అనడు."

"అవునులే. అంతేమాత్రం మనం చేసే దేమున్నదిలే. నిమిత్త మాత్రులం....ఎంతకాల మీ ఉప్పుపులుసు ఋణముంటే అంతకాలం. అంతేగదూ?"

  

"అంతేను కాంతా! అంతే. నువ్వన్నది నిజం" అంటూ లోని కొచ్చాడు మీసాలవాడు.

"నే నన్న దేమిటి?"

"నిన్న అన్నావు గదూ-పిల్లలు పుట్టకుంటే నన్నూ తోలేస్తాడా అని. నిన్నూ తోలేస్తాడన్నమాట నిజం....నిన్ను తెచ్చిందెందుకు? నీపైని వలపు కారిపోతుందా? కాదే?....అసలు సంగతి నే చెపుతాను. చెప్పనా?"

"ఎందుకు నా కా కథలన్నీ? నే నేమీ వినదలచుకోలేదు." అన్నాను.

"కాదు విను ...అలివేలింట్లో నిన్ను కలసిన క్షణానే నా మనసు నీ వశమైపోయింది. కాని అర్భకుడ్ని-నే నేం చేయగలను? డబ్బులేని వాడుగా పుట్టడంకంటే ఈ పాడులోకంలో పేడపురుగై పుట్టడం మంచిది....పోనీలే. నీకు కోపమొస్తే అసలుకథ చెపుతాను....నా మనసెప్పుడైతే నీమీద లగ్నమైందో, అప్పుడు కాంతయ్యగారు కొత్తపెళ్ళాంమాట ఎత్తారు. వెంటనే తట్టింది. ఒక్క బాణానికి రెండు పిట్టలు. గురిచూసి కొట్టాను. సాముద్రికమంటే మోజున్న కాంతయ్యగారిని పట్టుకెళ్ళి జ్యోతిష్యునిచేత చెప్పించాను. "నాయనా! సంసారస్త్రీలయితే పిల్లలుపుట్టే యోగంలేదు. ఇదిగిదిగో-గీత యిక్కడ వంకరై మెలితిరిగింది. దాన్ని సాగదీయాలంటే ఒక్కటేమార్గం. ఇప్పటికే టైమ్ బారయిపోయింది. ఇకనైనా త్వరపడి ఒకసానిదాన్ని చేరదీయి. ఏమీ సిగ్గుపడనక్కరలేదు. పో. పురుషార్థం' అని డబ్బిచ్చి పలికించాను. నువ్వు వచ్చావు. నాపంట పండింది.'

నా ఆశ్చర్యానికి అంతులేదు. అబ్బా! మనుషులకిన్ని తెలివితేటలు ఎవరిచ్చారు? తాడితన్నేవాడొకడుంటే తలతన్నే వాడొకడుంటాడట. ఇదే కాబోలు!

'రా చంద్రా! రా, నన్ను నీవాడ్నిగా చేసుకో, నాకు మోక్షం ప్రసాదించు.'

'చంద్రా? మళ్ళీ నాకేదో కొత్తపేరు పెట్టారేమిటి? ఇప్పటికే పేర్లు ఎక్కువై మెడ వంగిపోతున్నది, అన్నాను.

'లేదు. పాతపేరే పంచుకున్నాం. చెరుకుగడలాంటి 'చంద్ర' అనే ముక్క నే తీసుకుని 'కాంత' అనే పిప్పిదంటు వాడికిచ్చాను. వాడొట్టి పశువు....రాచంద్రా! రా. నన్ను వేధించకు.'

మీసాలవాడు సుడితిరిగి పోతున్నాడు.

'నీకెంతమంది పిల్లలు?' అడిగాను.

'అయిదుగురు. పెద్దమ్మాయికి మొన్ననే పెళ్ళిచేశాను.'

'ఐదుగురు బిడ్డల తండ్రివైనా నీకింకా ఆర్భాటం తగ్గలేదే?'

"అది నీలోని మహిమ" అన్నాడు మీసాలవాడు.

"అయితే కొంచెం నెమ్మదించండి. నేను నీదాన్నే, కాని కాంతయ్యగారికి తెలిస్తే నీకొంప పీకేస్తాడు.'

"వాడా? వాడి ముగుదాళ్ళు నాచేతిలో ఉన్నాయి. ఎక్కడ కట్టేయమంటే ఆముసలిగొడ్డు నక్కడ కట్టేస్తాను....అందులో పెద్దక్కయ్య గూడా మనచేతిక్రిందే వున్న తరువాత మనకేం భయం?' మీసాలు ఎగదోసుకున్నాడు.

"పెద్దక్క య్యెవరు?" అన్నాను.

"వీడిభార్య యశోదమ్మనే మేము పెద్దక్కయ్యంటాము. కాస్త దూరమైనా మా యిద్దరికీ చుట్టరికముంది. అందువల్లే కాంతిగాడు నన్నిక్కడకి చేరనిస్తున్నాడు. లేకుంటేనా? అమ్మా! పీనుగ! సందుపెట్టేవాడా? వేలుపట్టే సందు దొరకాలేగాని కాలు పెట్టేయడ మెంత సేపు? ఇప్పుడీ యింటి వ్యవహారాలన్నీ మన చేతిగోళ్ళలో ఉన్నాయి. మన సంబంధాన్ని గూర్చి కూడా పెద్దక్కయ్యకు తెలుసు. అక్కయ్య యిష్టప్రకారమే నేనీ పనికి పూనుకున్నాను."

"ఏ పని?"

"పిల్లల్ని పుట్టించేపని. వాడికా-సంసారం చేస్తాడన్నమాటేగాని-పిల్లల్నికనే సత్తువలేదు. బంగారంవంటి పెళ్ళాం, మరి ఐదుగురు ఆడంగులతో పాతికేళ్ళు సంసారం వేగించిన వెధవ ఒక బిడ్డను కనలేక

పోయాడంటే కారణమేమిటి? ఆరుగు రాడవాళ్ళలోనూ లోపమున్న దంటావా? లేదు. లోపమంతా వీడిదే. మనవాడి కసలు ఆ సరుకు లేదు.'

"అయితే నీకు పుట్టిన బిడ్డను వాళ్ళ బిడ్డని ఎత్తుకుంటారా?"

"నా బిడ్డంటే పెద్దక్కయ్య కేమంత కష్టముండదు. ఇక కాంతిగాడికి విషయం తెలియకుండా, తనకు పుట్టిన బిడ్డనే భ్రమింపచేయాలి. అది నీ పనితనం.'

"నే నొప్పుకోకపోతే?"

"ఏడాది వెళ్ళ చేతల్లోనే అలివేలు కొంప ఎక్కడుందా అని మళ్ళీ వెతుకోక్కవాలి."

  

కాంతయ్యగారిపేర చీటీవున్నా, చంద్రకాంత ఇప్పుడు జంటసంసారం చేస్తున్నది. లేహ్యాలూ, అరుకులూ ఒంటికి పట్టించుకుంటున్నారు కాంతయ్యగారు.

ఒకరోజు ముసలమ్మ నన్ను పిలిపించింది.

"ఏమ్మా! ఏమిటి పిలిపించావు?"

"చిన్నోడుకూడా వచ్చాడా? కూచో" అని తను లేచి కూర్చున్నది.

నేను మంచంమీద కూర్చుంటూ "అడిగేం, వచ్చాడు" అన్నాను.

"వాడ్నికూడా నాకాడ కూచోమను."

"ముగ్గురం కూచుంటే మంచ మిరుగుతుందే, నేను నిలబడతాలే చెప్పు" అన్నాడు కాంతయ్యగారు.

"ఇరిగితే మానెలే. నేను రేపో యెల్లుండో ఎల్లిపోతున్నాను. ఇంక మంచమేం చేసుకోను? కూచో' అన్నది ముసలమ్మ.

చుట్టపారేసి కాంతయ్యగారు కూడా చతికిలబడ్డారు.

"ఒరే చిన్నోడా! ఆ కర్రిటు తే." మంచంక్రింద నున్న చేతి కర్రను ముసలమ్మ కందించాడు.

"ఇదుగో! ఈ చేతికర్రతో నాకింక పనిలేదు. దీన్ని బద్దరంగా దాచిపెట్టు. పారేయకూడదు."

నిజంగానే కాంతయ్యగారు దా న్నందుకుని కళ్ళకద్దుకున్నాడు.

"అమ్మా! కొత్తదానివైనా నిన్ను కనిపెట్టాను. కళ్ళులేకపోయినా నీకమ్మటి గొంతువల్ల నిన్ను చూస్తూనే వున్నా. నీచెయ్యిటుతే." నేను రెండుచేతులనూ అందించాను. పొదివి తన హస్తాలలో పట్టుకుంది.

"అమ్మా! పుట్టినవాళ్ళు తొమ్మండుగురుపోగా కడగొట్టువాడు-వీడు మిగిలాడు. పేడపిసికి మేడకట్టినట్టు పెద్దఖ సంపాయించిన యావత్తు ఐశ్వర్యానికి వీడొక్కడే నాధుడు. వీడికొక నలుసు కలుగుతుందేమో ననుకుంటే, నాకళ్ళతో చూడలేకపోయా. ఈ ఐశ్వర్యమంతా ఏమయ్యేట్టు?.... నేను పెంచి పెద్దచేశానేగాని, ఒక్కకానీపెట్టి ఇంతపటికి బెల్లమైనా నోట్లో యేసు కెరగను. అట్టా కడుపు ఆయగట్టుకుని, పోగుచేసి నే పోతున్నాను.... నా కీ యింటిమీద బ్రమత తీరలేదు. చచ్చి నీకడుపున పుట్టి నీ ఆస్థి నే తింటాను.... ఏమిరా చిన్నోడా ఏమంటావు?"

కాంతయ్యగారి కండ్లు నీరుపోసుకుని ఉబ్బినట్లున్నాయి.

"అమ్మా! నాకడుపున పుడతానంటే కాదంటానా? నీ యిష్టం. కాని తల్లిలేని బిడ్డగా నన్నొదిలి పోతావంటే...."

"తప్పదురా చిన్నోడా! పోతేగాని రావటానికి వీల్లేదుగదా!.... నా సొమ్మంతా ఇక్కడొదిలిపెట్టి నేనెక్కడుంటానురా పిచ్చోడా! వెంటనే రానూ?.... ఇయ్యాల మనింట్లో చెక్కభజన చేయించు," అన్నది.

ముసలమ్మ ఆజ్ఞమేరకు ఆ రాత్రి పాండురంగడి భజన పెట్టించారు. భక్తులు వీరావేశంలో చెక్కలు ఝళిపించుతూ 'హే పాండురంగ వరద గోవిందోహరి! హే పుండరీకవరద గోవిందో హరి" అని నినది

స్తుంటే ఎప్పుడో, ఎవరికీ చెప్పకుండా మునెమ్మ ఆ హరినాదంలో హరించుకుపోయింది.

ఆమె పోయిన మాసంలోనే నాకు నెలతప్పింది. ఆమె మాట ప్రభావమో, మీసాలవాడి శక్తిప్రభావమో నేను చెప్పలేనుకాని పండంటి ఆడశిశువును మాత్రం కన్నాను.



అచ్చుగుద్దినట్లు అన్నీ నాపోలికలేనని నేననుకున్నాను.

"అంతా మాయమ్మే. మాయమ్మ మాటకు తిరుగులేదు" అని మురుసుకున్నారు కాంతయ్యగారు.

"ఆ కళ్ళు చూడు! మా చిన్నమ్మాయి కళ్ళుకూడా అచ్చ మలాగే వుంటాయి. నాదే అచ్చు" అని చెవిలో ఊదిపోయాడు మీసాలవాడు.

"ముక్కు తల్లిది; చేతులూ, చెవులూ తండ్రివి." అని నిర్ణయించారు అమ్మలక్కలు.

యశోదమ్మ మాత్రం బిడ్డనెత్తుకుని ముద్దాడిందేగాని ఇదమిద్ధమని తేల్చలేదు.

"చూశావు కాంతా! నీ కడుపు పండిందని దానికి కడుపుమంట. దాని మొహాన తుమ్మలు మొలిచాయి చూడు" అన్నాడు కాంతయ్యగారు.

"కాదండి. వంశాన్ని ఉద్ధరించటానికి మగబిడ్డ కలగలేదే అని దిగులు."

"కానేకాదు. ఎవరెటువంటివారో నాకు తెలుసు. కాని నాకేమీ తెలియదు, తెలివితక్కువ వాడ్నను కుంటారు....అదీ ఒకందుకు మేలేలే. మనిషి పైకగుపించకూడదు."

నాకేదో దెబ్బతగిలినట్లయి బెదరిచూశాను. జంటసంసారం సంగతి తెలియనుగదా?

"నాకు మగతనం లేదనీ. ఉన్నా సంతు కలగదనీ లోక మేమేమో నన్ను ఆడిపోసుకుంది. అదిమట్టుకది-నా ముఖాన్నే అడిగింది.... కాంతా! నువ్వొచ్చి నా పరువు నిలబెట్టావు. మా యింట్లో దీపంపెట్టావు."

ఆయనలోని నిష్కల్మషం, సత్యం నాలో పేరుకుపోయిన అసత్యాన్నీ, మోసాన్నీ చిత్రహింస చేశాయి.

"నేనా పొగిడింపులకు తగను. ఆ మాటలతో పొడిచి నన్ను బాధ పెట్టకండి. నేను మోసాన్ని" అన్నాను.

"కాదు కాంతా! నాకు దారి చూపించిన దేవతవు."

నేను దహించుకుపోతున్నాను. నాలోని నీచత్వమే నన్ను పట్టి వధిస్తున్నది, కాని కాంతయ్యగారి చేతులగుండా ఏదో ఆత్మీయత, సన్నిహితత్వం నా శరీరంలోనికి ప్రవహించాయి. నేనాక్షణంవరకు ఆయన్ను ప్రేమించి యెరుగను. ఎవటివారలా నిండుహృదయంతో ప్రేమిస్తుంటే, ఎల్లకాలం మనంకూడా ప్రేమించకుండా ఉండలేమేమో? కృతజ్ఞతనిండి కన్నీటిరూపంలో బొటబొట రెండుబొట్లు రాలాయి.

"ఒక్క కోరిక. నా గతమంతా పాపాలపుట్ట. ఇక నేనా పాపంలో తలదూర్చలేను. జీవితశేషమైనా మనిషిగా జీవిస్తాను. మీ పాదాలకడ కాస్తంత చోటివ్వండి. నేనంతకన్న కోరేదేమీలేదు."

కాంతయ్యగారు మాటాడలేక పోయారేమో 'పిచ్చిముండా!....' అని సగంమ్రింగుతూ కళ్ళనీళ్ళు తుడిచి లేచిపోయారు.

అంతే. ఆపోయింది పోవడం మళ్ళీ నాకంటి కగుపించలేదు. ఏదో కోర్టుపనివుండి పట్నం పోయారట.

బండి వాకిట్లో నిలిపి యశోదమ్మ నన్ను ప్రయాణం కమ్మన్నది. చంటిబిడ్డను మా ఆవిడ చూస్తుంది లెమ్మన్నాడు మీసాలవాడు.

"ఎక్కడికి?"

ఎక్కు చేవుతాం." నవ్వుతూ రెక్కపట్టి నన్ను బండెక్కించింది యశోదమ్మ.

బండి కదిలిపోతున్నది. ఒకనాడు నేనూ, సుజాతా, సూర్యప్రకాశ రావుగారూ ఒకేబండిలో ఏ అవస్థలో ప్రయాణం చేశామో అదేతంతు... బండిమారి రైలెక్కాము. అయితే ఎక్కడికి? నేనేమీ తిరిగి వారిని ప్రశ్నించలేదు. ప్రాణం లేకపోయినా పొగబండి ఎలా పరుగెత్తిపోతున్నదో మేమూ అంతే. ఎన్నో ఊళ్ళుచూసి కళ్ళుమూశాను.

యశోదమ్మ నన్ను తట్టిలేపింది. వారివెంటవున్న సామానులాగానే నేనూ దిగిపోయాను. పోయిపోయి ఆ కటికచీకటి గ్రామాన ఒక కొంప చేరాము. పాడుపడ్డ దేవళంవంటి ఆ కొంపలో పావురాయి పిట్టలతోపాటు ఒక కాపలావాడున్నాడు. వెలుతురు పురుగుల్ని ఎగదోసుకుంటూ వచ్చి, లాంతరెత్తి మా ముఖాలు చూశాడు.

"అమ్మగారా! దన్నంపెడతా. ఇంతరేతిరికాడ....రండి. తాలాలు తీస్తా."

తిరిగి తలుపులు మూసుకున్నాయి. ముగ్గురం జీవసమాధి చేస్తున్నాము.

"ఈ రాత్రికి పడుకో. ఉదయమే మాట్లాడుకుందాం." నిశ్చలత్వాన్ని చీల్చివేసింది యశోదమ్మ తీయనికంఠం.

"ఫరవాలేదు. నేనేమీ అలసిపోలేదు. మాటాడేదేదో ఇప్పుడే మాటాడవచ్చు."

మీసాలువాడు లేచి లైటువత్తి నెక్కించాడు. అస్పష్టమైన ఆవెలుగులో అందమైన యశోదమ్మ పడగవిప్పిన నాగుపాములా కనబడింది. నాలుకలు సాచినట్లు పాపిటబిళ్ళ కదిలాడుతూ తళతళ మెరుస్తున్నది.

"అమ్మాయ్! నిన్నిక్కడికి ఎందుకు తెచ్చామో-తెలివిగలదానివి-తెలుసుకునే వుంటావనుకుంటా....నీవిక మా యింటికి రాకూడదు."

"అంతేనా? ఈ ఒక్కముక్క చెప్పడానికేనా నన్నింతదూరం లాక్కొచ్చారు? ఈ ముక్క ఇంటివద్ద చెప్పినా వెళ్ళిపోయేదాన్నే?.... అయినా అడుగుతున్నాను. ఎందువల్ల?"

"నీ అవసరం తీరిపోయింది. వెయ్యిరూపాయలుపోసి నిన్నెందుకు కొనితెచ్చామో, ఆపని పూర్తయిపోయింది. నీతో మాకిక ఎలాంటి సంబంధమూ ఉండదు. నీదారి నీవు చూసుకో."

"నా బిడ్డ?"

"మా బిడ్డగాదా?" అన్నాడు మీసాలవాడు.

"ఎవరిబిడ్డ అయితేనేం? ఆ బిడ్డకోసమేగా నీకు డబ్బుపోసింది?"

"డబ్బుకోసం కాదుగా యశోదమ్మా నేను బిడ్డనుకన్నది?"

"నీవు డబ్బుకోసం కనకపోయినా, మే మా బిడ్డకోసమే డబ్బు పోశాము. తెలుసుకో. ఆ బిడ్డ మాది. మా డబ్బుతో పుట్టింది."

"డబ్బుకు బిడ్డలు పుడతారా?"

"అప్రస్తుతం. కాని పుడతారు....ఇదిగో! శుభమా అంటూ బిడ్డను గన్న తల్లిని కన్నీటితో పంపలేము. నిన్ను తెచ్చేప్పుడు వెయ్యిరూపాయ లిచ్చాము. ఇప్పుడు మరో వెయ్యిరూపాయ లిస్తున్నాము. నవ్వుతూ, దిలాసాగా వెళ్ళిపో."

ఆ ఆజ్ఞకు నాకు నవ్వువచ్చింది.

"యశోదమ్మా! మీకు కోపంరాకుంటే ఒక్కప్రశ్న అడుగుతాను——మీరూ స్త్రీలేకదా! తల్లివిగాకపోయినా, తల్లిహృదయ మెలావుంటుందో మీకు తెలుసు కదా?——గడ్డితినే పశువు బిడ్డను కంటే, మరులు తరిగేవరకు దూడను విడదీయరే——"

"మరులు—మమత? మాకేమీ తెలియవు. నీడబ్బు నీవు తీసుకుని ప్రొద్దుపొడిచేసరికల్లా ఈ ఊరు దాటిపో. కావాలంటే అందాకా మనిషిని పంపిస్తాను,' అంటూ యశోదమ్మ పెద్దరూపాయలకట్టను నాచేతి కందించింది.

అంత డబ్బును నే నొక్కసారిగా ఎన్నడూ చూడలేదు.

"అయితే ఈ డబ్బు చాలదు."

"ఎంతకావాలో చెప్పు"

"దీనికి పదింతలన్నా కావాలి."

"పున్నానికి పోతే పాప మెదురైందట. ఆ అలివేలు ముండ కిచ్చిందే దండుగనుకుంటూ, పోనీ బ్రతుకుతుందిలెమ్మని దయదలచి నీకూ ఇంతమొత్తం ధారపోస్తుంటే-అమ్మాయి పని తికమకగా వున్నదే" అంటూ లేచాడు మీసాలవాడు,

"అయితే నాకక్కరలేదు. అడిగినంత యిస్తేనే పోతాను."

"ఇవ్వకుంటే పోవా?"

"పోను. ఏంచేస్తారు?"

యశోదమ్మ మీసాలవాడివంక చూస్తున్నది. వాడు నావంక చూస్తున్నాడు.

"చంపుతారా?"

ఇద్దరూ కలపలుక్కున్నట్లు చూసుకుంటున్నారు.

"ఆ శ్రమ మీ కేమీ అక్కరలేదు. పనికిమాలిన ఒక ఆడదాన్ని చంపి, దాన్ని కప్పిపుచ్చుకోడానికై మళ్ళీ కొంత డబ్బెందుకు ఖర్చు

పెట్టుకుంటారు? మీ డబ్బు బిడ్డల్ని కంటుంది. ఈడబ్బుకూడా మీకడనే వుంచుకుని ఇంకా పిల్లల్ని పెట్టించండి. నాకో చిల్లిగవ్వ అవసరంలేదు. వస్తా. వస్తాను పెద్దక్కయ్యా!"



అప్పటినుంచి నాకు చరిత్రలేదు. ఎక్కడెక్కడ తిరిగానో, ఏమేమి చేశానో నా కంతగా తెలియదు. ఆకలయితే పడుకుని నిదుర పోయేదాన్ని. నిద్దరొస్తే నీళ్ళు తాగేదాన్ని. చిరిగి జీరండాలయిన చీరెతో నవ్వుతూ నేను నడుస్తుంటే పిల్లలు భయపడి తప్పుకుపోయేవారు. కాలికి బలపంగట్టుకుని ఎల్లవేళలా నేను తిరుగుతుంటే, జనం నన్ను పిచ్చిదాని క్రింద జమకట్టారు.

ఏ అమ్మయినా దయతలచి కాస్తంత అన్నంపెడితే కాదనకుండా తినేదాన్ని. కాని నా అంతట నేనుగా ఎవరినీ, ఎప్పుడూ నోరువిప్పి అడుగలేదు. అడుగవలసిన అవసరం నాకులేదు.

ఎక్కడికెడుతున్నానో తెలియకుండానే ఎక్కడికో వెళ్ళేదాన్ని. ఒకదినం వల్లకాటిలో, ఒకదినం వర్షంలో, హాయిగా పడుకుని నిదురించే దాన్ని. నేనిప్పుడు ప్రకృతి ఒడిలో బిడ్డను. నాతల్లికీ నాకూ వైరంలేదు.

ఒక నా డెక్కడో పడుకుని వుండగా ప్రకృతిబిడ్డ డొకడు నన్ను నిద్రలేపాడు. నాతల్లిసైతం కన్నుమూసిన కారణంగా లోకమంతా చీకట యింది. నే నతగాడ్ని గుర్తించలేకపోయాను.

'చలి. నరాలు కొరికేచలి.... రెండునిముషాలు అతగాడు నన్ను వరుచుకుని వెచ్చచేసుకుంటున్నాడు.

కలియుగం అంతమైపోతున్నట్లు, ఒక మహాభీకర ప్రళయం, యావత్తు భూగోళాన్ని దద్దరిల్లగొడుతూ బ్రద్దలుచేస్తున్నట్లు కలగంటున్నాను. పిడుగుల చప్పుడే లేకుండా చురకత్తులవంటి మెరుపులు నాకంటిలోనూ ఒంటిలోనూ దిగపడి నెత్తుర్లు కక్కుతున్నాయి.

ఒక్కగా నొక్కమాటు పడిన ఆ పిడుగుమంటలో అతగాడిమోము చూశాను. ఎవరు?....ఎవరాతడు?....అతడే నా తండ్రి—ననుగన్న తండ్రి—పిడుగుమంటుకు చల్లారిపోయిన అతని కళేబరం నన్ను కావిలించుకుని తీసుకుపోతున్నది.

సమాప్తం

# MaNaSu Foundation - Check List

| | |
|---|---|
| Book Number | CP04C136 |
| Front Cover | Yes |
| Back Cover | Yes |
| Blank Pages | CT, 209 |
| Missing Pages | 1 to 2. |
| Remarks | |